

శ్రీ

# * కాంచీ ఖండము *


గ్రంథకర్త:

మల్లంపల్లి వీరేశ్వరశర్మ



ద్రవ్య సహాయకులు:

మ॥ రా॥ శ్రీ ఆకారపు నరసింగం గుప్తగారు

శ్రీ రామలింగేశ్వర ముద్రాక్షరశాల, స్టేషన్ రోడ్ - వరంగల్.

— ౫౦౦ ప్రతులు —

1949.



# * కాంచీ ఖండము *



గ్రంథకర్త:

మల్లంపల్లి వీరేశ్వరశర్మ



ద్రవ్య సహాయకులు:

మ॥ రా॥ శ్రీ ఆకారపు నరసింగ గుప్తగారు



శ్రీ రామలింగేశ్వర ముద్రాక్షరశాల, స్టేషన్ రోడ్ - వరంగల్.

— 500 ప్రతులు —

1949.

# కాంచీఖండము — పీఠిక.

చం॥ అగును బురాణ మియ్యది యటులైనను గావ్యకథా రసోచితిన్
దగిలి యొకింత మార్చియు నభిధానకథన్ విడనాడ దెందునున్
దగనిది గాన నూరకయ తప్పుల నెన్నెడువాఁడు కల్గినన్
దగవసఁగాన వారికి వినమ్రుడనై యొనరింతు నంజలుల్॥

గ్రంథము వ్రాయుట యొకయెత్తు పీఠిక వ్రాయుట యొకయెత్తు అది కవియే వ్రాయవలసి వచ్చుచోఁ గల భారమనంతము. అయినను సూచనామాత్రముగనైన దెలుపవలసిన విధిననుసరించి యిది వెలువడినది. క్రీ॥ శ॥ 1889 కి సరియగు సర్వధారి సంవత్సరమున శ్రీ శ్రీ కార్వేటినగర ప్రభువులు పండితపరిష్కృతముగావించి తెలుఁగు లిపిలోఁ బ్రకటించిన స్కాందపురాణాంతర్గతమగు కాంచీ మాహాత్మ్యమే యీ కృతికి మూలము. ఇందేఁబది యధ్యాయములు గలవు. శ్రీనాథుని మఱఁదియగు దుగ్గకవి తెనిఁగించిన కాంచీ మాహాత్మ్యమునకు మూలము తెలియదు. అసలాంధ్రీకృతమే కాలగర్భమున నిమిడినదిగదా! ఈకృతి ముద్రణసమయమున శ్రీ ముక్త్యాల ప్రభువులకంకితముగా నైదాశ్వాసములలో శ్రీ కొప్పరాజు సుబ్బరాయకవిచే రచింపఁబడి క్రీ॥ శ॥ 1900 సంవత్సరమున ముద్రితమగు కాంచీమాహాత్మ్యము ప్రతి యొకటి నాకు లభించినది. అది యీమూలమునకుఁ జాలదగ్గఱగానున్నది. వచనమున నున్న గొన్నింటిని వినుటయే గాని నేను జూడలేదు.

మిక్కిలి ప్రాఁతవడిన చరిత్రలే పురాణములనుట సత్యదూరము గాదు. ధర్మబోధనమిందలి ప్రధానోద్దేశము. ఇందలి కథలు సత్యములాయను చర్చతోఁ బనిలేదు. అనంతమగు కాలప్రవాహమున నిట్టివి సంభవించుటలో విరోధము లేదు. నాఁటికి నేఁటికి నామమాత్ర భేదములు తప్పఁ బ్రధానవిషయమున నెక్కువ భేదము లేదు. కావుననే " పురాపినవ్య " మ్మని పురాణపదమున కభియుక్తులు వివరణ మొనర్చిరి.

మతావేశపూరితులగు పండితులు వీనఁ బెక్కు ప్రక్షిప్తములు నించిరి. పరమార్థమును గ్రహింపకయే కథలందలి పాత్రల సౌచిత్యమును చేటుఁగా జిత్రించిరి. శివతత్త్వ ప్రధానములగు పది పురాణములలో నైతము పరదైవదూషణముతోఁబాటు శివదూషణముగూడఁ జేరినది. కేవలాద్వైతవాదము దీనికి దోహద మొసంగినది. శివపురాణములయందు శివప్రాముఖ్యమే యుండుట యుక్తమేగాన దాని లక్షించి యన్యమత నిందవిడచి యీ యనువాదమునడచినది. అనఁగా నట్టికథలఁగూడ విడిచితినన్నమాట.

ఇది యెనిమిది యాశ్వాసముల గ్రంథము. ప్రసిద్ధులగు కథల విడచి ప్రాఁతవడినవాని వెలువరించుటయు, రసోచితముగాఁ గథఁ గూర్చుటయుఁ బ్రధానకారణములుగా నిది కేవలమనువాదము కాక

నొకవిధముగా స్వతంత్రముగానే నడచినది. కావున ధర్మబోధన విషయములలోఁ గాక కథావిధానములో మూలముతో సరిపడునని యనరాదు.

చదువరుల సౌకర్యమునకై యిందలి యాశ్వాసములయందలి కథావిశేషముల నొకించుక వివరించెద.

## ప్రథమాశ్వాసము — సనత్కుమారకథయు,

ఇది చాలవఱకు మూలమునను సరించినది. క్షేత్రప్రశంసయు, నింద్రోపాఖ్యానము నిందుఁ బ్రధానములు.

ఆంధ్రీకరణము.

సనత్కుమారుని కథలో బ్రహ్మ శివుని దర్శించినప్పుడు

త్వామాశ్రిత్య పురా ముక్తిః కూర్మత్వాత్కచ్ఛపాద్ధరిః ।
కురుక్షేత్రాచ్చ కేదారాన్నైమిశాత్పుష్కరాదపి ।
కాశ్యా విశిష్టా కాంచీతి కథా వేదే ప్రసిద్ధిభాక్ । (౨ అ॥ 54–55 శ్లోకములు)

శా॥ కేదారంబుజొరందు నిల్వఁడు గురుక్షేత్రంబునన్ బుష్కర
శ్రీదృష్టింబడనీఁడు నైమిశము లక్షింపఁడునొక్కింత కా
లూదంబోఁడు మహాశ్మశానమున నేలోఁగి యీ కాంచికిన్
దా దొడ్డింబడియున్నవాఁడు వృషభేంద్రస్వామివిశ్వేశ్వరా॥ 1అ 105

కం॥ ఆ మందరగిరి మోయఁగఁ, దా మేటితనంబు నాసి తాఁ బేలగుటన్ ।
నీ మన్ననఁ బురుషోత్తముఁడై మఱి తా మేటిగాదె హరిమున్నిచటన్ ॥ 106

ఇందలి నైమిశపదమునకుఁ బట్టాగాడియను నర్థము వివక్షితము. సనత్కుమారుని శపించినది నంది గాన బ్రహ్మపలుకులలో వ్యాజనింద కూర్పఁబడినది. తాన్ మేటితనము - తా మేటితనము. తాన్ బేలగుట - తాఁ బేలగుట అని రెండువిధములుగా విఱుచుట యభిమతము. శ్లేష గావున రెండవచోట నర్ధబిందు వంతగా బాధింపదు.

## — కథావిధానము —

మునులు సనత్కుమారుని నందికి నప్పగించి వెళ్ళినతరువాత నాతని యొంటెరూపము పోయినట్లు మూలము. నందిని గాంచినంతనే వికృతరూపము పోయినట్లనువాదము శివదర్శనముననే శాపముపోయినట్లుం బ్రహ్మతో నంది పలుకుట యాధారముగా నీమార్పు చేసితిని. ఇంద్రోపాఖ్యానమున నింద్రునకు రాజ్యముపయి విరక్తి యాకస్మికముగాఁ గలుగుటకు నిమిత్తము మూలమునలేదు. అప్సరలు నిరూపించిన దాని కాననవిహారలీల నిమిత్తముగా వ్రాసితిని. ఇట్టివే మార్పులుగలవు. సహృదయులే దాని యౌచిత్యమునకుఁ బ్రమాణము కాఁగలరు. వేయేల సుబ్బరాయకవి కాంచీమాహాత్మ్యమును జూచిన దీనికిని మూల

మున్నకుఁగల భేదము సర్వదా వివాదము కాఁగలదు. భేదములన్నియు వ్రాయుచో గ్రంథమంతయు నె వ్రాయవలసివచ్చునను భీతిచే బ్రధానకథలమాత్రమిటఁ జేర్కొంటిని.

## — 2 వ ఆశ్వాసము —

ఇందు గజేంద్రమోక్షణము సరస్వతీ బ్రహ్మల సంవాదము. మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణావతారముల ప్రసంగముకలదు. మూలమున భిన్నభిన్న స్థలములలోనున్న వీని నించుకమార్పుతో నొకచోఁగూర్చితిని.

## — 3 వ ఆశ్వాసము —

బుద్ధావతారము, త్రిపురాసురసంహారమందలి విషయము గౌతమబుద్ధుఁడే దశావతారములలో బుద్ధుఁడని చరిత్రకారులన్నను బురాణజ్ఞులమతమున నది త్రిపురాసురసంహారములోనిది. ఇఁటనుం కావ్యము స్వతంత్రముగా సంపూర్ణముగా నడచినదనవచ్చును

## — 4 వ ఆశ్వాసము —

దారుకావనవిహార మిందలి వస్తువు. కర్మప్రధానవాదులై యీశ్వరనిరాకారమొనర్చిన దారుకావన మునులకు శివకేశవులొనర్చిన గర్వభంగమిందలి ప్రధానవిషయము. ఇది యీకావ్యమునఁ బ్రధానఘట్టమనవచ్చును. ఇందలి జలంధరుఁడు జేతోకుఁడు అంధకసంహారము శివకేశవులిద్దరు చేసినట్లుకలదు.

## — 5 వ ఆశ్వాసము —

శాస్తృభైరవజననము, దక్షయాగము, నిందలివస్తువులు.

## — 6 వ ఆశ్వాసము —

సతీవియోగము, పార్వతితపశ్చర్య, పార్వతీపరిణయము, నిందలివిషయములు.

## — 7 వ ఆశ్వాసము —

కుమారజననము, తారకాదిసంహారము, కుమారకళ్యాణము, మూలముననందందుగల క్షేత్రప్రశంస ధర్మవిషయములిందు నిబద్ధములు.

## — 8 వ ఆశ్వాసము —

ఇందు మూకమహాకవి చరిత్రముకలదు. పెద్దలవలన గురువులవలన వినఁగిన కథ ననుసరించి పార్వతీపరమేశ్వరుల ప్రణయకలహము నూహించి వ్రాసితిని. మూలమునఁ గౌశికుఁడను విప్రుఁడు తీర్థయాత్రకయి యిటవచ్చి తోడివారికి శ్రీకాంచీమహిమను చెప్పినట్లుకలదు. ఆ కౌశికుని నేను మూకమహాకవికి మూలపురుషునిగాఁ గైకొంటిని. ఇంకఁ గౌశికుఁడు చెప్పిన ధర్మములుగాక మిగిలినదంతయు మూలములోనిది కాదు.

# IV

ప్రతి కవియందు నెంతో ప్రాచీనత కలదో యంత నవ్యతయు నుండవలయునని నా సంకల్పము. అది యెంతవఱకు నిర్వహించినానో సహృదయులెఱుంగగలరు.

ఇందు మిశ్రమము గాక కావ్యమంతయు స్వతంత్రమే యగుటచే విమర్శకులు మూలముతో దీని పోల్చి నాయాసపడక యిందలి యౌచిత్యమునే గ్రహింతురుగాక యని సవినయముగా నర్థింతును.

కేవలకథావిషయమునందే గాక ఛందోవిషయమునగూడ నించుక స్వతంత్రించిన ఘట్టములు కలవు. ప్రాచీనులు కొన్నిచోట్ల యతులేక మాత్రాగాఁ బ్రాసమునుగూడ వాడిరి. తెనుఁగులాక్షణికులు సంస్కృతమునయున్నట్లే తెనుఁగునను వృత్తముల యతిస్థానములఁ జాలవఱకు నిరూపించిరి. ఇందలి ఇంద్రవంశ, వంశస్థ, జలోద్ధతగతి వృత్తములలో నా లక్షణము విస్పష్టమైనది. రచనాసమయమునకగలిగిన యీ భేదమును జిరకాలమునకును గుర్తింపనే లేదు. తెనుఁగువిశేషములగు నీవృత్తముల యతిస్థానము తరువాత మార్పు లేదు. ఏరిమిడ చామరాఖ్యాపనమున పంచామృతపద పద్యము పంచచామరమునకు దగ్గరగానుండుటచేఁ జామరమని పేరిడితిని. స్వాతంత్ర్యగత్యాకరమున గాని తెనుఁగలక్షణగ్రంథములందు గాని నా కిట్టివృత్తము గాన్పింపలేదు. ఇదిగాక బుద్ధిపూర్వకముగా నతిక్రమించిన ఛందోవిషయములు గాని వ్యాకరణవిషయములు గాని యిందు లేవు.

కథాసన్నివేశనిమగ్నమగు నాబుద్ధికి బహ్యేకముగాఁ గాలము లక్షితము కాలేదు అది కారణముగా నిందుఁ బ్రత్యేకములగు వర్ణనలకు స్థానము లభింపలేదు. నా తొలిప్రయత్నములోని యీలోపములను బండితులు మన్నింతురుగాక.

ఇది కృతిగా నొసంగకపోయినను దమ ఔదార్యమును మాహేశ్వరభక్తియు నిరూపితమగునట్లుగా నధిక వ్యయప్రయాసలకోర్చి దీని నచ్చొత్తించిన వైశ్యశిఖామణులు పరమశివపూజాధురంధరులు శ్రీకాశీవిశ్వేశ్వరప్రతిష్ఠాదేవాలయనిర్మాణాది బహుధర్మకార్యధురీణులు నిరంతర సత్కృత పండిత కవీంద్రులు, ననంతలక్ష్మీసంపన్నులు నేకశిలానగర వాస్తవ్యులునగు శ్రీ ఆకారపు నరసింగగుప్తగారికి విశ్వేశ్వరుండు సకలాభీష్టముల ననుగ్రహించుఁగాక.

ఏతన్ముద్రణమునకుఁ బ్రధానులై శ్రీ సేటుగారి యాస్థానపండితులై పెక్కు సత్కవి గ్రంథములను మత భావ్యములను వారిచేఁ బ్రకటింపఁజేయుచు వారి యౌదార్య ముచితమార్గమున లోకకల్యాణప్రదమగునట్లుగ నోహాదమొసఁగి నా కత్యంతోపకారమొనర్చిన శివశ్రీ విద్వచ్ఛిరోమణి ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారికి నా కృతజ్ఞతావందనములు.

వీరు స్థాపించిన సంస్కృతకళాశాలలోఁ జిరకాలము పండితపదవినలంకరించి చాలవఱకిందలి యచ్చుపొరపాటులను సరిదిద్దిన సౌజన్యమూర్తి శ్రీ జయంతి భాస్కరశాస్త్రిగారిని విస్మరింపజాలను.

మూలమంతయుఁ దెనుఁగులోనికి రావలెనను పట్టుదలను సడలించి, నా స్వతంత్రరచనకు దోహద మొసంగి ప్రేరేపించిన మా యన్న సుప్రసిద్ధ చారిత్రకపరిశోధకుఁడు మా యన్న- శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి వినయకృతజ్ఞతాభివందనములు.

మా జనకులకు సమర్పితముగా వ్రాయఁబూనిన యీ కాంచీఖండ ప్రబంధమును విని, సత్వర గ్రంథసమాప్తి యగునట్లాశీర్వదించి ప్రోత్సాహమొసంగిన మా గురుదేవులు, ఆంధ్ర విశ్వకళాశాలాంధ్రోపన్యాసకులగు శ్రీ దువ్వూరి వెంకటరమణ శాస్త్రులవారికి సంతతమట్టి యాశీర్వచః పరంపర నొసంగ నంజలింతును.

తల్లిబిడ్డ పట్టక చెల్లాచెదరగు నలజడినను యుమున సయితము నా యీ గ్రంథమును దమ ప్రాణములకంటె నధికముగాఁ గాపాడి, ముద్రణకార్యమును నిర్విఘ్నముగా సాగించిన సౌభ్రాత్రమూర్తి శ్రీ రామలింగేశ్వర ముద్రణాలయాధిపతి శివశ్రీ శివపురము రామలింగయ్యగారి కెంతయు ఋణపడియుంటిని. వారి సౌజన్యమునుగూర్చి యెంతవ్రాసినను మిగులునే గాని తఱుగదు.

పెక్కుగానొదవిన ముద్రాప్రమాదముల సవరించుకొనఁ జదువరుల నర్థించుచు నిట్లు నా యీ కృతికి సాహాయ్యమొనరించిన సుజనులకందఱకుఁ బ్రణామములర్పించి, వారియన్వయములు శుభశ్రీవర్ధిల్లఁ బరశివుం బ్రార్థించి కృతకృత్యుఁడనగుచున్నాఁడను.

5 – 12 – 48
నారసింహ కళాశాల,
చిట్టిగూడూరు
పర్ణశాల పోస్టు, వయా బందరు.

మల్లంపల్లి వీరేశ్వరశర్మ,
నారసింహ కళాశాల,
చిట్టిగూడూరు – బందరు.



# పండితాభిప్రాయములు.

శివాయ గురవే నమః

## శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు.

నీవు రచించి, పితృపాద పాదాంకిత మొనర్చి, నాకడకుఁ బంపిన కాంచీఖండము చాలవఱకుఁ జదివినాను. యావత్తు. దీక్షగాఁ జదువుశక్తి లోపించుటచే, మఱికొన్ని నాళ్లలోఁగాని, ఆపని జరుగదు. చదివినంతలో నొకటో, రెండో ముద్రాప్రమాదాలు (శివ పుట. జనియించె యెల్లమాంబిక, శివ పుట. రాకేందుకలాకలాపరాజితమకుటున్) ఇవి తప్ప సంశయింపఁదగినవి లేవు. ఇందు "రాకేందు.....మకుటున్" అన్నది ముఖాముఖిని మాటలాడితే సమంజసంగా తేలవచ్చును. పూర్ణిమనాఁటి చంద్రుని, యీశ్వరుఁడు ధరించినాఁడా? అనేది శంకాస్థానము

శ్వేతచందురుల దాలిచినవారు

అనిగదా ప్రత్యుత్తరశ్లోధగాఁ జదువుటకు, ఓపిక లేదు. శ్రీనాథుని కాశీఖండమునకు వచ్చిన గౌరవము రాఁగలదు. లేనిపోని వ్యర్థపదములు లేక ధారకమ్మచ్చున తీసిన బంగారు-తీఁగవలెనున్నది. లాక్షణికదోషములు కానరావు ప్రమాదతః, యెక్కడే నట్టివి దొరలినను, సహృదయులు దానిని గణింపరు. నీకు, పరమేశ్వరుఁడు నిరామయాయుర్భాగ్యమునకు శ్రేయస్సు నొసంగి, నీచే నింకను చాల కబ్బములొనర్పఁ జేయునని నాయాశీస్సు. స్వస్తి.

వెం. శా. శతావధాని, బెజవాడ, 20-12-48.

## శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు.

శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మ ఆంధ్రమున లబ్ధప్రతిష్ఠుఁడైన కవి. తద్రచితమైన కాంచీఖండము ఆంధ్రపురాణ సరస్వతికి నూతనాలంకారముగా వెలుఁగొందునని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ఈ యుద్గ్రంథమును పితృపాదులకు నంకితమిచ్చి యీ కవి తన కవితాప్రవృత్తిని, జరితార్థమొనర్చుకొనెను ఈ పుణ్యము, ఈతనికి సర్వసంపదలొసఁగుఁగాక.

పిం. లక్ష్మీకాంతము, వాల్తేరు 8-1-48

---

## శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

శ్రీ మల్లికార్జునశాస్త్రిగారి సంతానమునకు తేలికపాటుపలుకు నాలికకెక్కదు. పలుకుపొంకము, పరమార్థముతో శ్రుతిగూడి సాఁగునుగాని పెడవాసి వెడత్రోవ తొక్కదు. ఇందుకు లక్ష్యముగా మీగ్రంథమున దారువనవిహార కథ చదివితిని. శృంగారాభాసము దానఁగానరాలేదు.

"పోతనభక్తి" ఇత్యాది పద్యము తాతగారిఁగూర్చి చెప్పినదయినను, మనుమని యెడఁగూడ సరిపడినది. తాతగారే మనుమఁడయినారేమో.

తపోమయులు, అస్మత్పూజ్య శ్రీ గురుపాదులు అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారి పేరిపద్యము చదివి, మరలఁజదివి, కొంతపడవు తలఁపులుడిఁగి, ముడిఁగికూర్చున్నాను.

దోషజ్ఞతఁగాక, గుణజ్ఞత నాకుఁ గూర్చినది మీ గ్రంథము. అయినను — అచ్చుతీరు దానిని నాకు నిలిపినది.

తే. గీ. మల్లికార్జున సుకవికుమార వరున
కల్లసితకావ్యకళలు రంజిల్లుటరుదె?
గురులు తిరుపతి వేంకటేశ్వరుల కరుణ
మెలఁగువారి కేదియుఁబల్కు పోలుపులరుదె?

వే. ప్రభాకరశాస్త్రి. తిరుపతి 29-1-49

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.

శ్రీ మ. వీరేశ్వరశర్మగారిచే విరచితమైన కాంచీఖండము చదివి మిక్కిలి యానందించితిని. వీరు పండితులు. గొప్ప కవులు. వీరి పాండిత్యము గ్రంథమునం దంతటను గోచరించుచున్నది. వీరికవిత యమకవృత్త్యనుప్రాసాభిముఖముగా సుఖముగా నడుచును.

వీరు శ్రీమల్లికార్జునారాధ్యుల వారి సంతానము. మల్లికార్జునారాధ్యుల వారు విద్వత్కవులు. వారిసంతానమిట్లు విద్వత్కవులగుటలో నబ్రమేమియు లేదు.

కాంచీఖండము బహుకథా సంపుటి. ఐక్యమన్నికథలు శివ పారమ్యబోధకము లగుటయే ఇందులో సరస్వతి లక్ష్మికన్నఁ దక్కువవని, బ్రహ్మయనఁగా నామె కోపించి తనమూర్తినుపసంహరించుకొన్న ఘట్టము, నేఁటిస్థితిని, చక్కగా నిరూపించుచున్నది పురాణములు కామధేనువు. లోకమునందలి సార్వకాలిక యాథార్థ్యములనిట్లురూపించును.

"పురాణారణ్య భిల్లప్రభో'' అని నాథుని సంభోధించునట్టి మాధుర్యము. ఈకవియందుఁగలదు.

"ఉదయించె నేరవి, వానియెఱ్ఱసెరలా
ద్యోమార్గమధ్యంబునన్
ద్విదళంబైనయవార్లతాగ్రమధురో
త్ప్రేక్షార్హమైతోఁచె"

మొదలయిన ప్రకృతి పరిశీలనము భావుకథయు, కలకవి.

ఈ కావ్యమున నెన్నో మధురపద్యములు ప్రౌఢభావములుకలవు. అచ్చుతప్పు లును, తక్కిన తెలుగు గ్రంథములయందువలనే సమృద్ధిగాఁగలవు.

కవిగారిది నిర్దుష్టమైన రచన "త్రియంబక' శబ్దమును, కాళి దాసు వలెనే

వాడినారు.

వీరి, మా, మధ్య, చాలహార్ద సంపద కలిమింబకు పాతోక్తియధ్యవసింపంబడు నను భీతినెక్కువ వ్రాయుటలేదు.

నేంటికవిత యొకవంక, విపరీతపు త్రోవలపోవుచుండగా, నొకవంక, సుచరిత పథమునభ్యసించు చున్నదనుటకు వీరిమార్గము మంచియుదాహరణము.

వీరికిసర్వదా, శివమూర్తి, బహుగ్రంధరచనయు, నాయురారోగ్యసంపదలు ప్రసాదించుగాత.

విశ్వనాథ సత్యనారాయణ బెజవాడ 14-3-49



# ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారు.

శివశ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మగారు, మల్లికార్జునారాధ్యులవారి తృతీయ పుత్రులు. తండ్రిగారివలె వీరును విద్వత్కవులు. ఈ కాంచీఖండమునందుగల కల్పనా కౌశలము, రసపోషణము, పాత్రౌచిత్యము, అర్థగాంభీర్యము, శబ్దమాధుర్యము, లాక్షణికపదప్రయోగము, ధారాశుద్ధి మున్నగు సుగుణములు సహృదయ హృదయైక వేద్యములు.

ప్రాచీనాధునిక రమ్యకవితా సువర్ణ పరీక్షకీ గ్రంథరత్నము నికషోపలము. ఉత్తమ శ్రేణికిజెందిననిట్టి యుద్గ్రంథమును శర్మగారు తెలుంగు భాషలో బరివర్తించి యాంధ్రభాషా యోషకు శ్రొంగొత్త యాభరణము నలంకరించినారు. నవ్యపద్ధతితో సంస్కృత భాషనుండి యాంధ్రభాషలోనికి బరివర్తనముఁ జేయువారి కీ గ్రంథము మార్గదర్శకము కాగలదని నా తలంపు.



ఈ గ్రంథముద్రిణ ద్రివ్యసహాయకులు మహారాజశ్రీ ఆకారపు నరసింగం గుప్తగారు. వీరు లక్షలు వ్యయపరచి కాశీవిశ్వేశ్వర దేవాలయమును రమణీయముగ కట్టించినారు. అన్నసత్రమును నెలకొల్పినారు. తనపేరుతో సంస్కృతాంధ్ర కళాశాలను స్థాపించి యూనివర్సిటీ పరీక్షలకు విద్యార్థులను పంపించుచున్నారు. వేద పాఠశాలను. శివభజన మండలిని సంగీత పాఠశాలయుగూడ స్థాపించినారు. విశ్వేశ్వర దేవాలయమున దక్షిణాదిపద్ధతి ననుసరించి నిత్యభోగములు పట్టాలపూజలు నడిపింపబడుచున్నవి. శైవగ్రంథములేమి తదితర గ్రంథములేమి యనేకములు స్వంతధనము నుండి ముద్రింపించినారు.

అన్నిగ్రంథములలో శ్రీ నీలకంఠారాధ్య విరచితమగు బ్రహ్మసూత్ర భాష్యము ప్రధానమైనది, దీనికి శివచింతామణి ప్రభయను వ్యాఖ్యానమును శివయోగి ముదిగొండ నాగలింగశాస్త్రిగారు రచించినారు ఈ నూతన వ్యాఖ్యాసమేతమగు జగద్గురు నీలకంఠారాధ్య భాష్యమును ముద్రింపించుటలో గుప్తగారిజీవితము ధన్యమైనది. కాంచీఖండము మున్నగు గ్రంథ రాజముల ముద్రింపించుటయేగాక, శివధర్మబోధకమును రమణీయమునగు సచిత్రమాస పత్రిక నెలకొల్పుట యందును మహేశ్వరభక్తియందును నిరంతర శివపూజా పరాకాష్ఠయందును నిరంతరోత్సాహము గన్పరచుచున్న నరసింగం గుప్తగారి పూర్వపుణ్య మగణ్యము.

విశ్వేశ్వర పుస్తక భాండాగారమును స్థాపించిరి సర్వజనా కర్షణీయమగు నొకరమ్య సౌధమును తననివాసమునకై గట్టించికొనిరి. విద్యార్థులకుచిత భోజన సౌకర్యములు గల్పించినారు. ఒకప్పుడీ ఓరుగల్లునగరమును శివభక్తిడోలికలయందు ప్రబోధగీతికల నుయ్యాలలూగించిన సిద్ధపురుషుడు - లోకోత్తరవ్యక్తి - మూర్తీభవించిన భక్తిసంతానము-లక్షతొంబదియారువేల గణార్చన లనేకములొనర్చిన మాహేశ్వర పాదధూలి రేణుపు పరమశివోపాసకుడైన ఆరాధ్యచూడామణియగు శ్రీకంఠరారాధ్యులవారి చరితను కృతినొందిన ధన్యజీవికూడా ఈ నరసింగంగుప్తయే.

జననీజనకులగు రాజమాంబా చెన్నయ్య శ్రేష్ఠిగారి పుత్రుడై, అనతలక్ష్మీ సుశీలా సమేతుడై శ్రీమంతులలో నగ్రేసరుడై వెలయు నరసింగంగుప్తకు అన్నపూర్ణా విశాలాక్షీ సహితుడయిన యా కాశీవిశ్వేశ్వరస్వామి నిరంతరాయురారోగ్య పుత్రసంపదల నొసగి నాచంద్రార్కము వంశాభివృద్ధి నొసంగుగాత.



శ్రీ నరసింగగుప్తగారి తండ్రి, తల్లి
శ్రీ ఆకారపు చెన్నయ్య శ్రేష్ఠిగారు, సౌ. రాజమాంబగారు



శ్రీ నరసింగగుప్త గారి తండ్రి, తల్లి
శ్రీ ఆకారపు చెన్నయ్య శ్రేష్టిగారు, సౌ. రాజమాంబగారు



శ్రీ ఆకారపు నరసింగ గుప్తగారు

వారి ధర్మపత్నులు

సౌ. సుశీలమ్మ　　　　సౌ. అనంతలక్ష్మమ్మ



కృతిపతులు

శ్రీ. లో. మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారు

కృతికర్త

మల్లంపల్లి వీరేశ్వరశర్మగారు

# కృతిపోషకవంశప్రశంస.

శా॥ శ్రీమన్మంగళ విగ్రహుండు కరుణాసింధుండు కాత్యాయనీ
ప్రేమ శ్రీనిధి మేరుధన్వి యమరశ్రేష్ఠుండు మందాకినీ
శ్రీమల్లీమయ హారమధ్య కుసుమ శ్రీభాసమానాబ్జుఁడీ
శ్రీమంతున్ నరసింహుఁ బ్రోచుతదరస్మేరామృత జ్యోత్స్నలన్॥ 1

శా॥ భారద్వాజ పవిత్రగోత్రుఁడు సుధీబంధుండు వీరేశలిం
గారాధ్యుండు నను బ్రియంబు మెయినాహ్వానింపఁగాఁ బోయితిన్
చారిత్ర ప్రథితంబు నాంధ్రజనతా సౌభాగ్య చిహ్నంబునాఁ
బేరుంగాంచిన యోరుగంటిపురము న్వీక్షింప నుత్సాహినై. 2

ఉ॥ రైలొక యర్ధరాత్రము వరంగలు సేరిన నేనుఁ బోవఁగాఁ
జాలక యా సమీపమున సత్రమును న్వెని యానిశీథినిన్
గాలము వెళ్లఁబుచ్చఁ జనగా నటఁ గావలివారలప్పుడున్
జాలఁ బ్రియమ్ముతో నచటి సౌధమునం దొకతావుఁ జూపి నన్. 3

కం॥ వసియించినాఁడ ప్రథమా వసథము సుఖమయ్యెననుచుఁ బరమ ముదమునన్
నిసియెల్లఁ గన్నుమూయదు బసలకు నటువచ్చు వివిధ పాంథుల చేతన్. 4

ఉ॥ వేసిన చప్పుడుల్ తలుపు వెంటనె యెవ్వరొ పిల్చినట్లుగాఁ
దీసిన చప్పుడుల్ వివిధదేశ నివాసుల దొక్కు వేయికిన్
వీసముతగ్గ రెంతవిసివించిన పాంథులనందు కాపరుల్
వీసము కోపగింపరది విస్మయమయ్యె మదీయ బుద్ధికిన్, 5

ఉ. సత్రము లెన్నొ గాంచరొ విశాలము ప్రత్యేకమట్లు రెమ్మెమీ
సత్రము నిట్టునిల్పి కొనసాగఁగఁ జేసిన పుణ్యుఁ డెవ్వఁడో
పాత్రము వోరుగంటిపురి పావిత్ర్యన ధర్మగుణ ప్రకర్షణా
సూత్రమొ సత్రమయ్యె ననుచుం దలపోసితి నెల్లరాత్రియున్. 6

మ. ఉదయించె న్రవివాని యెఱ్ఱసెజలాద్యో మార్గమధ్యంబునన్
ద్విదశాంశైన యహార్లతాగ్రమధునో త్ప్రిత్ఫూర్హమైలోఁచె నా
మదికి న్నేనను సత్రమున్విడిచి శుంభద్రాజ మార్గంబునన్
గదియన్ సౌధశిరమ్ములన్ దళుకుపాగాలయ్యె భానుచ్ఛవుల్. 7

శా॥ వీథుల్ వీథులఁ బుణ్యయానతము ప్రస్విన్నాంగ రాగాంగమై
స్వాధీయన్సుమ పూర్ణపాత్రములతో సౌభాగ్య దేవార్చనా
గాథామంజుళ జల్పనంబులఁ జలత్కర్ణావతంస స్ఫుర
న్మాధుర్యోజ్జ్వలయానమై తెరువులం బండించె మాంగళ్యముల్. 8

మ॥ కనుగొంటిం జనుచుండి యానగరిలోఁ గాశీశ్వరస్థాన మా
వనితల్ మున్నుగ వేదపాఠ మధురధ్వానమ్ము లాలించుచున్
చని లోనన్ గనుగొంటి నీశ్వరకథాసారమ్ములౌ చిత్రముల్
జనతాకీర్ణము మూర్తి భక్తి యగు నాస్థానమ్మునం దెల్లడన్॥ 9

శా॥ చంద్రప్రస్తర దేవవిగ్రహ కళాసౌందర్య మీక్షించుచున్
సాంద్రాశ్రీయాన్య శివార్చనా మహితమంత్రధ్వాన మాలించుచు న్నీ
యింద్రాగారము సత్ప్రకెవ్వరని యే నీక్షింపఁగాఁ దోఁచె నా
సాంద్రమ్మైన జనార్ణవమ్మున మనుష్యభ్రాంతి కృచ్చిత్రముల్. 10

*

శా॥ ఈ కల్యాణ గృహమ్ము సల్పినది వీరేశాదరం చెంచి వీ
రేశాలమ్మున వారలంచడుగఁగా నిట్లాడిరచ్చోటి వా
రాకారన్వయ కౌస్తుభమ్ము నరసింహశ్రేష్ఠి కట్టించెనీ
ప్రాకారోజ్జ్వల దివ్యసౌధముల సద్భక్తి క్రియాగాధముల్. 11

ఉ॥ ఆతని తల్లిదండ్రులని యాతని భార్యలటంచు నన్నియుల్
బ్రీతినిజూపి చెప్పిరి సవిస్తరముల్ దగఁ దత్ప్రసంగమం
దాతని తండ్రినిల్పినదె యచ్చటిసత్రమునంచెఱింగి మే
లీతఁడు తండ్రిమించెనని యెంచుచు నెంతయు సంతసమ్మునన్. 12

శా॥ ఆరమ్యాలయమంత కాంచితిని నే నల్లంత వీరేశలిం
గారాధ్యుల్ దగురీతి దర్శనపు మర్యాదల్ బ్రవర్తిల్ల నా
ధీరుండచ్చటి పాఠశాలను గళార్థి వ్రాతముల్ వారికిం
గారాబుంగురులైన ధీరులను జక్కన్నాకుఁ జూపించుచున్. 13

కం॥ ఆకారపు నరసింగయ యీకల్యాణములకెల్ల నేడుగడచుఁ డీ
యాకృత పుణ్యునిగాంచుట మీకుందగునంచు నన్ను మేకొలిపి వడిన్. 14

మ॥ కొనిపోయెన్నను నాసుధీజనముతోఁ గూడన్ ద్విధామాలయం
బును బోనుజ్జ్వలసౌధసీమకడకున్ మూఁడైన యంతస్థులం
దును నాగేంద్రఫణాగ భీరమగు లోనుందాటి పై యంతర
మ్మునఁ బత్నియుతుఁడౌచుఁ విప్రజనమున్ బూజించు ధన్యాత్మునిన్. 15

మ॥ కనియేనా నరసింగమీా యనఘుఁ డాగాయంచు లోసెంచు లో
నన మమ్ముంగని యన్నరీతి నతఁడున్మన్నించెద ద్భక్తికిన్
మనముప్పొంగెను గొంతగోష్ఠి జరుగన్ మధ్యేప్రసంగమ్మునన్
"దెనుఁగుం జేసిరె కాంచిఖండ"మని సన్వీక్షించి యద్వ్యాదృతిన్ . 61

కం॥ వినవలతు మీారలయ్యది వినిపింపుఁ డనంగ నేనువిని చితిఁ గబ్బ
మ్మునఁ గొన్నియెడల మోహన ఘనగాథాలహరి దారుకా వనలీలల్. 17

కం॥ విని మెచ్చి దీనిముద్రిణ మొనరించెద మాకుఁ గృతిగ నొసఁగుఁడని యె నా
ఘనుఁడే నేమియు బలుకక చని యాతని పీడుకొనుచు సముచితరీతిఁ. 18

ఉ॥ పుట్టిన పండుపీనవమి పుణ్యదినమ్మని యెంచి కొంటినే
గట్టిగ నాతఁడిష్టి కృతిగాఁ గొనగోరెను గాని మున్నగాఁ
బట్టము గట్టియుంటఁ బితృపాదుల దీని నెఱుంగఁ డాతఁడీ
పట్టున నేమికార్యమని భావమునం దలపోయునంతలో. 19

చ॥ కడచెను నాల్గునాళ్లు లతిగాఢ మనఃప్రియభక్తి తోడ నా
తఁడు ననుబిల్వఁబంచి విబుధ ప్రియబంధులతోడ మిక్కిలిఁ
బెడఁగగు దివ్యసౌధమున విశ్రుతభక్తిని. గాంచిఖండమా
కడమ కథావిధానము దగన్విని యెంతయు సంతసమ్మునన్. 20

మ॥ వినియుంటిన్ శివపుణ్యమంజుళ కథావిస్తార మీా కావ్యమున్
మును మీా యొజ్జలకప్పనంబిడిన యా పుణ్యంపు వార్తన్ భవ
జ్జనకుండీశ్వర తుల్యుఁడా యనఘు పూజారూప మీాగ్రంధము
ద్రణగావించు విశేషపుణ్యమయినన్ దక్కించుకో నెంచితిన్. 21

*

కం॥ వినియుంటిఁ బెక్కు కవులను, గనియుంటిని మీకు కావ్యకౌశలము నరసిన్
మన మిచ్చగించెఁ గావున, ననఘా! వేఁడెద కబ్బమైన నొసఁగరే 22

మ॥ అనిన న్విస్మయమంది యయ్యనఘు విద్యాపక్షపాతమ్మునున్
ఘనభక్తిన్ సముదారవర్తనమునా గాంభీర్యము న్మెచ్చి యే
మును రాజన్యు లింత సేయరనుచున్ మోదమ్ము పెంపొందనా
ఘను వాక్యమ్మును సమ్మతింప నతఁడున్ గాంచె న్మహానందమున్. 23

కం॥ ఈదృశగుణరమ్యుండయి యాది శ్రీవైశ్యకుల సముచిత చరితుం
డై దనరునతని ఘనవంశోదయ చరితమ్ముఁ బలుకు టుచితము కాదే. 24

మ॥ మహనీయుండగు వేదపూరుషుని శ్రీ మధ్యాంగ దేశమ్మునన్
మహిలోఁ బుట్టిరి వైశ్యులా కొలమున న్నామకంత గోత్రమ్మునం
దహిరాడ్భూషణ భక్తి ధుర్యమగు నీ యాకార వంశమ్ము ప్ర
త్యహసంపూజిత శంకరమ్మయి జగత్ప్రఖ్యాతిఁ గాంచెన్ గడున్. 25

కం॥ గురవయ్య గుప్త యంవొక, సురుచిర మాణిక్యమగుచు శోభిల్లెను ద
ద్వరపత్ని నాగమాంబిక హరుగేహిని యన్నపూర్ణయన నొప్పారెన్. 26

కం॥ వారికి సింగయ గుప్త యుధారుఁడు జనియించె యెల్లమాంబిక సతియై
తోరపుఁ బుణ్యసమృద్ధిని శ్రీరమణి యనంగ భర్తృసేవ వెలిఁగెన్ 27

కం॥ వారికిఁ జెన్నయగుప్త గభీరుఁడు ధీరుండు ధర్మవిదుఁడు పుట్టెన్
శ్రీరాజమాంబ సతిగాఁ బేరందిన సతి మొకఁడు పెట్టె నతండున్. 28



ఉ॥ వారికి బుట్టె ధర్మగుణ బంధురుఁడై నరసింగగుప్త ప
ద్వారసవేది యీశ్వర పదాబ్జ మధువ్రతమానసుండు పెం
పారఁగఁ దండ్రి నిల్పిన మహోత్తరమా నల ధర్మసత్ర మెం
తేరహి నుద్ధరించె నొక యిర్వదివేలు వ్యయమ్ము సేయుచున్. 29

కం॥ భావిని యనంతలక్ష్మీ దేవియు సుగుణమ్ములకును శీవి సుశీలా
దేవియు సతులై కొలువఁగఁ గావించె నతండు ధర్మకార్యములర్థిన్. 30

కం॥ శివసందర్శనవిధి మొద లవుగ్రంథమ్ములను బెక్కులచ్చొత్తించెన్.
నవనవ కీర్తిప్రియుఁడై శివపాదాంభోజ లగ్న చిత్తుండగుచున్. 31

మ॥ శివపూజా పరతంత్ర వృత్తమును దాక్షిణ్యంబు గోరక్షణ
ప్రవణత్వమ్మును హింసదానమును నారాధ్యార్చనమ్ము న్మహా
కవి విద్వద్గురు పూజనమ్ము నరయంగా నైజముల్ గాదె భ
క్త్యవతారమ్మయి యాడితప్పని నృసింహశ్రేష్ఠి కెక్కాలముల్. 32

కం॥ చేసినవి చేయనున్నవి వాసిగ నిఁకముందు చేయఁ బనిగొన్నవియై.
రాసులుగనున్న యాతని యాసత్కృత్యము లిన్నియనఁగనగు నెవ్వారికిన్. 33

శా॥ (శ్రీ) దుర్గా కరుణాకటాక్షముల వారీ స్నిగ్ధావరస్మేరముల్
శ్రీదప్రాభవమై సుశోజ్జ్వలత వాసింగాంచు నీవంశ మ
ర్యాదన్నిల్పెడు నట్టిపుత్రకుని విద్యాయుర్య శోభాగ్య ల
క్ష్మీ దాక్షిణ్య గుణాభిరామునిఁ జిరంజీవిన్ గటాక్షించుతన్. 34

కం॥ చిరకాలము వర్ధిలుత నరసింగయగుప్త ధరణి నవనవకీర్తి
స్ఫురణమ్మున దారలతో స్థిరతర బహుపుత్ర పౌత్ర సిద్ధులతోడన్. 35

శివమ్.

# మంగళాచరణము.

ఉ॥ శ్రీమదగండదానలహరీశ్రిత భృంగనినాదనందితున్
హేమగిరీంద్రభాస్వసుని నేక రసాలక మూలవాసి మా
తా మహ శీతశైలునపితామహు లోకపితామహుం జగ
త్స్వామి మహామహున్ వికటచక్రవినాయకు నాశ్రయించెదన్. 1

శా॥ ఆధారుండయి సర్వలోకముల కాద్యంతాన్యశూన్యుండునై
బోధానందమయస్వరూపుఁడు జగత్పూర్ణుండు నాత్మీయ చి
ద్గాథాచింతన భక్తదత్తవిలసత్కైవల్య సామ్రాజ్యుఁడై
సాధుధ్యేయ పదారవిందుఁడగు మాస్వామిన్ శివున్ గొల్చెదన్. 2

కం॥ శ్రీకాంచినగరీశ్వరు నేకామ్రాధీశుఁ గొలుతు నిహపరలోక
శ్రీకైవల్యపదప్రదు రాకేందుకలాకలాపరాజితమకుటున్. 3

కం॥ అక్షీణభక్తిఁ గొలుతున్ ద్ర్యక్షుని రాణిం బురాణి నక్షుద్రకటా
క్ష క్షపిత దురిత వృక్షున్ శిక్షిత రక్షిత విపక్షశ్రీ కామాక్షిన్. 4

శా॥ సాక్షాద్విష్ణుని బ్రహ్మసూత్రరచనా చాతుర్య ధుర్యున్ మహా
భిక్షున్ వేదవిభాగి భారతసుధావిర్భావ పాథోనిధిన్
దక్షాపత్యముఖాఖిలామర మునీంద్రస్తుత్యు నభ్యర్హిత
త్ర్యక్షున్ దివ్యపురాణ వాఙ్మయ ఘనాధ్యక్షున్ బ్రశంసించెదన్. 5

కం॥ అరిది తపస్సంపదచేఁ బురహరు మెప్పించి యూర్ధ్వముఖవీక్షితుఁడౌ
హారితమహామునిగోత్రాంకురు నేకోగామువంశ గురుని దలంతున్. 6

కం॥ మల్లమ్మపల్లినాథుఁడు నల్లిండ్లిడనందుఁ దామనారతముంటన్
మల్లమపలిగ్రహనామము చెల్లినయారాధ్యవంశశీతకరుండై. 7

శా। సారోదారగుణాంచితుండు హరపూజాశాలి వీరేశలిం
గారాధ్యుండు పురామునీశ్వర తపోగంభీరుఁ డత్యుగ్ర లిం
గారాధ్యుం గనియెం గుమారు నభవధ్యానైకశీలున్ సదా
చారున్ సంతత శిష్యసేవిత పదాబ్జాంఘ్రిన్ మహీమండనున్. 8

కం। అక్షయలింగారాధ్యుం డక్షయగుణవారిరాశియం దుదయించెన్
త్ర్యక్షపద కింకరగణాధ్యక్షుండు శ్రీ వీరమల్లయారాధ్యుఁ డనన్. 9

కం। ఆజన్మ గణార్చావ్రతుఁడై జనసమ్మాన్య చరితుఁడయి హరచరణాం
భోజైక భక్తుఁడగుచున్ రాజిల్లెను వీరమల్లనారాధ్యుఁ డిలన్. 10

కం। ఆతని తమ్ముండనఁదగి ఖ్యాతింగనె మంత్రిమూర్తియారాధ్యుఁడు స
చ్చేతోనందన చరితుఁడు ధూతాఘుండమల గుణుఁడు దుష్కరతపుఁడై 11

కం। కేళిగ గంటములను నిరుగేలంగాళులను నొకటఁ గీలించి వడిన్
దాళిఖయించిన నాతని వ్రాలట ముత్యాలకోవ వగు సహసించున్. 12

కం। వారిరువురకుం గూర్చెడి గారాబుండమ్ముఁ గుజ్జఘనుఁడట వెలసెన్
వీరేశలింగ నాముఁడు నారాధ్యకులాంబుజాకరాంబుజ హితుఁడై. 13

శా। మా తాతల్ గడుఁ గొప్పవారనుట సంభావ్యంబ యెవ్వారికే
నే తన్మాత్రము యెంచిచెప్ప నిదిగో నీనాటికేమాకు య
చ్చేతశ్శుద్ధ తపః పవిత్ర చరిత శ్రీరక్షయా వారి నా
కే తన్మాత్రవచః ప్రకారముల నూ[illegible]పంగ నెట్లయ్యెడిన్. 14

కం। భ్రమరాంబిక యనుసతినుప యమ మయ్యెను వీరమల్లయారాధ్యుఁడు రూ
ప మహితగుణాఢ్యలక్ష్మి కుమారి శ్రీకాశినాథగోత్రోద్భూతిన్. 15

కం॥ భ్రమరాంబ, సుందరాంబయు, సమధికమతి రామలింగ శాస్త్రి గుణాళి
రమణీయ యన్నపూర్ణాంబ మల్లికార్జునుఁ డనంగఁ బరఁగిన వారిన్. 16

ఉ॥ పుత్రులగాంచి రందు గుణపూజ్యుఁడు రామయలింగశాస్త్రి యీ
ధాత్రిఁ బ్రసిద్ధికెక్కెఁ గవితార్కిక సింహ మనన్యదివ్య వా
క్చిత్రవిలాసుఁ డర్థిజనసింధువు మన్మథ మన్మథుండు చా
రిత్రపవిత్రుఁ డాగమగరిష్ఠుఁడు బాంధవలోక బంధుఁడై. 17

కం॥ ఆతనికి నెల్లవిధముల నీతఁడు తమ్ముండనంగ నెసఁగె జగమునన్
మాతండ్రి మధురకవితా ఖ్యాతుఁడు శ్రీమల్లికార్జునారాధ్యుఁ డొగిన్. 18

మ॥ పదిమాసమ్ముల వేళఁ దండ్రియును నాపై నన్ని వర్షంబులన్
ద్రిదశేంద్ర ధ్వజతుల్యుఁ డన్నయును గీర్తిన్నిల్పి దామేఁగినన్
జదివెన్ దాఁ దనకొక్కరుండు గడయై సాధించె శాస్త్రమ్ముల
భ్యుదయమ్మందె నఖండ భవ్యకవితోద్యోగంబు పాటించుచున్. 19

ఉ॥ పోతనభక్తి తిమ్మకవి ముద్దులపల్కులు భట్టుమూర్తి వా
క్చాతురి శబ్దశాసనుని శబ్దపవిత్రత సోమయాజి వి
ఖ్యాత రసార్ద్రవృత్తి గుమికట్టినయట్టులఁ బల్కనేర్చె మా
తాతకు నెవ్వరీడు కవితావని తా పరమేశమూర్తికిన్. 20

ఉ॥ ఎవ్వనికార్జవమ్ము తనయింటిధనమ్ము పవిత్రజీవనం
బెవ్వనిసొమ్ము జాతరిపుఁ డెవ్వఁడెవండున యైకవర్తనుం
డెవ్వని గర్భమందు జనియించి కృతార్థులమైతిమేము నా
మువ్వురు మాతృలొక్కటగు మూర్తిని నేఁబొగడంగ నేర్తునే. 21

కం॥ వినయైకధనుఁడు దేశిక జనతాసమ్మాన్యచిత్రచారు చరిత్రుం
డనఘుండు మల్లికార్జున ఘనదివ్యాంశజుఁడు మల్లికార్జునుఁడరయన్. 22

మ॥ ఒకపద్యమ్మును దేశికోత్తమునకై యొప్పించి తద్గ్రంథక
ర్తృకతన్ భవ్యవరమ్ముఁగాఁ బడసెఁ దానెవ్వండు దుస్సంగ దో
షకథా దూరజనైకలభ్యుఁడు సదాచారుండతండెందు న
త్యకళంకుండగు మల్లికార్జునుఁడు శాపానుగ్రహోదగ్రుఁడై. 23

మ॥ అమలామ్నాయజటాభిషేకహర నిత్యావాసతా ధన్యతా
హిమవచ్ఛ్రీముదిగొండలింగయ వధానిందాత్మజాతన్ సతీ
కమనీయోజ్జ్వల పుణ్యశీలయగు దుర్గం బెండ్లియాడెన్ మహా
ప్రమథ జ్యేష్ఠుఁడు మల్లికార్జునుఁడు దుర్గన్మున్న శంభుండటుల్. 24

ఉ॥ హైమవతీకుమారియగు నాయమకుండగు నగ్రిజల్ శుక
శ్యామల శ్రీగిరి భ్రమరమాంబిక పర్వతవర్ధనాంబయున్
దామనుజాతలైరి విదితల్ త్రిపురాంబిక సర్వమంగళల్
హైమవతీ తనుప్రభవలల్ల కుమారుని తల్లులోయనన్. 25

చం॥ వెలసిరియందు దుర్గగుణవిశ్రుతనంబికఁ బుత్రిఁగాంచి ని
స్తులగుణసంపదం గనకదుర్గయె యీమె యనంగనొప్పి యా
త్మల నొకఁడో కుమారులఁ గుమారవిలాస విశేష భిన్నరూ
పులఁగనియెన్ సుధీజనసముజ్జ్వల భవ్యపదాధ్వనీనులన్. 26

గీ॥ అంబ శ్రీశైలపతియనునట్టి పుత్రు, శ్యామలాంబికయనఁదగునట్టి పుత్రిఁ
గనియె వారలు గావ్యవిజ్ఞానమహిమఁ, బడసిరాతాతమామలవలనఁగొంత. 27

సీ. తనతండ్రి పేరిడఁ దగి తన్ను నే వేళ, నలరించు వీరమల్లయ్యబుధుఁడు
తనయన్న పేరిడఁ దగిన మేధాశాలి, యనఘుండు రామలింగాహ్వయుండు
నట్టి యన్నలవెన్క నడుగుజాడలఁగూడ ననుసరించుట వ్రతమైన నేను
గురుభక్తియుక్తులై కులమును వెలయించు, సద్వర్తనులు రామ శరభకవులు
తే. చిన్నవాఁడైన భద్రుఁడా పెద్దకూఁతు, రనుఁగుగోడండ్రు మనుమలు మనుమరాండ్రు
కొలువ మాతండ్రి కులపతి కొలువుదీర్పఁ గనకదుర్గేశ్వరుఁడు మల్లికార్జునుండు. 28

కం. ఆనిండుకొలువు కన్నుల కానందముగూర్ప మనుమరాండ్రును గొడుకుల్
నానావిధ మృదుకవితా నూన వినోదములఁ గొలుచుచుందురు సతముల్. 29

సీ. తిక్కననన్నయదిద్దిన తీర్పరి, పెద్దన శ్రీనాథు పెద్దకొడుకు
తిమ్మన కడుముద్దు తీరుతీయము వాఁడు, సూరన్న కెనయగు వారు లేరు
రామలింగము కవి రాజసింహము గాదె, పలుకుల చేహారి భట్టుమూర్తి
రాయలమాటలు రత్నాలమూటలు, పోతనగారితోఁ బోల్పఁదగిన
గీ. కవియుఁగలుఁగు నె సోమనఘనుఁడు గాఁడె, యెందు ధూర్జటి ధూర్జటి యెఱ్ఱనార్యు
నుభయ కవిమిత్రుఁడనుటయె యొప్పుగాదె. యనుచుఁ జర్చింతు రచ్చోట
నను దినంబు. 30

ఉ. ఇట్టు దినమ్ము లేఁగు నెడ నింతలు నాపిన తమ్ము లిర్వురున్
దిట్టత నమ్మతోడ గురుదేవుని దామొక కావ్యనాథుగం
బట్టముగట్టి రంతనిడ మర్తికలీనుఁడు నీశ్వరప్ప దా
నెట్టిని భక్తిఁగావ్యమిడి నిల్పికొనెన్ దన శిష్యభావమున్. 31

ఉ. అంతట దైవయోగమున నర్భకు నొక్కనిగాంచి నాకు నే
కాంత మొసంగి పోయెఁగులకాంత మదీయకిశోర దుర్దశా
శాంతికిఁ దద్వియోగవిధురత్వమునన్ గృహ మెల్లఁగానగాఁ
జింతల మున్గఁ జూచుచును జిన్నలఁ బెద్దల నార్తమూర్తినై.

మ॥ సవతెంపంగన కేలఁజేసితివి మత్సంసార రాజ్యంబు నీ
కెవరో యీసరివచ్చువారనుచు నాకీరీతి వీశోకులు నీ
కవునే యంచు నిరుద్ధకంఠమున నిత్యక్లిన్నచిత్తమ్మునన్
వివిధానుక్షణ కల్పదుస్సహము శుగ్వేధిం బ్రవర్తించుచో, 33

శా॥ చింతింపందగునే భవాదృశులకున్ జేపట్టుఁడీ ధైర్యమున్
సంతాపించెడి పిన్నపెద్దలను మీసంతానముంజూచి నా
స్వాంతమ్మున్ దనియించు కోర్కి కవితన్ సాధింపుఁడీ యంచు మ
త్కాంతా కోమల కంఠవాగమృతసేకంబుల్ముతో తెంచినన్. 34

ఉ॥ అల్లనఁ దెప్పిరిల్లివినినట్టుల సేయదలంపుగల్గి మా
తల్లికిఁ దండ్రి కన్నలకుఁ దమ్ములకున్ ననుగొప్పసేయు మా
యల్లునికిన్ ముదంబలర నంతన మత్కవితాలతాంగి నే
నల్లన మేలుకొల్పితి మహత్తర కావ్యనిబద్ధబుద్ధినై, 35

ఉ॥ క్రొత్తదనంబు కావ్యమునకుం గవిమూలము వస్తుమూల మీ
క్రొత్తలు పాత్రలున్ సమమగున్ రసతత్వమెఱుంగు వారికిన్
గ్రొత్తగువానిలోన సరిక్రొత్తయుఁ బాతలలోనఁ బాతయై
క్రొత్తయుఁబాతగాని రసగుంభిత కావ్యము బ్రహ్మమెన్నఁగన్. 36

ం॥ అవియాశబ్దబ్రహ్మంబు నుపాసనఁజేసి నాదుపుట్టువు ధన్యం
బొనరించుకొనెడి పూనిక, కనువగువస్తువుకుదఱచి యరయుచు నంతన్, 37

జనియించినట్టినా శైవమతంబును. బూజింపఁ దలకొను బుద్ధిఁజేసి
ఆంధ్రవాణికి నూత్నమగునలంకారంబు, నర్పింపదివిరెడు నాసఁజేసి

అలమహా స్కాందమ్మునందు సనత్కుమారుని సంహితాభాగగాథమైన
కాళిఖండమునందుఁ గాంచీపురమహాత్మ్య, మనుఁ దెనిఁగింపగాఁ బూనినాఁడ.

గీ। ఋత్రధర్మంబు నెఱవేర్చు పొంకెశివుని, గుసునినర్చించి ఋణమీఁగుకొఱకెగాక
కాదు పాండిత్య కవితాదివాదమునకుఁ గాదు ప్రాక్కవిసామ్యజగమిప గాని 38

కం। కేవలమొక యనువాదమె, నావలదీ తెనుఁగు సేఁత, నా నేర్చినటుల్
భావరసోచితపద్ధతి, గావించెద మొదలికవుల గమన మరయుచున్. 39

కం। అందందునున్న గాథలఁ బొందుగ నొక్కెడఁగూర్చి బుధజనముల మె
చ్చొందగ రచింతు పేనుల, విందుగ ధర్మమ్ము నీతివిధులుగలయెడన్. 40

కం। పొరవడుటనరుల నైజం, బరయఁగనా యట్టివాఁడనా? వ్యాసులచే
విరచితమగునీస్కాందము, దొరకొనియెడిఁ దెనుఁగుశేయ దోసఁగు వెరఁగ వే. 41

మ। అదియట్లుండె నిజమ్మునట్లయగు నా వ్యాసుండు నిర్మించె దా
బదిపై నెన్మిదియట్టి పురాణముల సంభావించె నందీశ్వరుల్
బదిటన్ దెల్పునఁగానరాదొకఁడు శ్రీనాథాదులా స్కాంద వా
ర్ధిఁదగంజొచ్చి మథించి తెచ్చిరట నర్ఘ్యంగొన్ని రత్నమ్ములన్. 42

ఆ।వె। మనువు సార్వభౌము ముద్దుసేయుమటంది, దుగ్గసుకవిమౌళి దగ్గుపల్లి
వంశగగనవిహారదంశుమాలి రచించె, గాంచిపురముమహిమ గరిమ మెఱయ. 43

చం। స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేలగల్గెనీ
యతులిత మాధురీమహిమయన్న ప్రశస్తి వెలుంగఁజేసె సం
గతముగఁ గాళహస్తి శివఖండకథాకథనమ్ము తెండు సం
తత శివపాదపద్మ మధుధారల నానిన మానసమ్మునన్. 44

కం। తురగా రామకవియు నాగర ఖండముఁ దెనుఁగు సేసె స్కాందమున రచిం
చిరి శివరహస్యఖండము, నరయంగా మున్న వేంకటాచలముఖ్యుల్. 45

కం। తెనిఁగించె నేన్గులక్ష్మణ, మును మెచ్చగ సేతుఖండమును మా వంశం
బున బుచ్చినకవి తెనిఁగిం, చెను హాలాస్యమ్ము రసవిసృత్వరకవితన్. 46

కం। భోగేశ్వరమహాత్మ్య (శ్రీ)గురుఁడగు మాదుతండ్రి (శ్రీ)శైలపతి
(శ్రీ)గరిమ మృదులరసమయు, వాగమరఝరీతరంగ ఫణితిఁ బలికియున్. 47

ఉ। మానుగ విశ్వతీర్థమహిమమ్ముల నిమ్ముగ సత్యవత్యుపా
ఖ్యాన మహాప్రబంధమున నచ్చుపడన్ రచియించెఁ గావునన్.
నేనును నమ్మహాత్ము కమనీయపదాంబుజ చిహ్నితాధ్వమున్
బూనిచరించి వానిమనమున్ దనియింపఁ గడంగి భక్తిమై. 48

---

## గురుస్తుతి.

చం। తనరమహాప్రబంధకవితా ఘనతా పటుభవ్య సాహితీ
ఘనుఁ గవిసార్వభౌము నుతిఁగాంచినధీరునిఁ దండ్రిమల్లికా
ర్జున గురునిన్ భజింతుఁ బరిశుద్ధచరిత్రు మహాత్ముఁ బ్రాప్పరీ
జనపతి విశ్వనాథ నృపచంద్ర సమర్చిత పాదపంకజున్. 49

సీ. పంచమవేద ప్రపంచార్ధ కవితానిధానమ్ము నా కవిత్రయము మ్రొక్కి-
జ్ఞాను తెనుంగుకై జన్మ గట్టినకవి, చంద్రుసోముని శిరసావహించి
పండితకవి నృపాఖండలార్చితుఁడైన సార్వభౌమునకు నంజలిఘటించి
అన్యదుష్కర కల్పనాంభోధిఁ బిఁగళి, సూర్యునిఁ గవిసూర్యు స్తుతి యొనర్చి

తే॥ ప్రాచ్యులో నెల్ల సత్కవి బ్రహ్మవరులఁ, దమదుచరితను గవితఁ బ్రత్య[illegible]
యీ శతాబ్దినిగవిచక్రకమేలుపరమ, గురులఁదిరుపతివెంకటేశ్వరులగొలుతు 50

కం॥ పూనియజించెద శివవిజ్ఞానాంబుధి బాష్యకర్త సాహిత్య జగ
న్మాన్యనితు నస్మన్మాత్మకు వీనుని ముదిగొండ నాగలింగారాధ్యున్. 51

కం॥ తిరుమలజలనిధి కౌస్తుభు వరదాచార్యుల భజించి ప్రణమిల్లెదఁ గొ
ల్లూరి సోమశేఖరునకున్, గరిరామానుజుని గురునిఁ గరము నుతింతున్. 52

కం॥ పటుశక్తి మెరయు నెవ్వని, కటాక్షమీజమున కిట్టిగమన మొసఁగె వెం
కట రమణునట్టి గురువెంకట రమణు భజింతు భక్తిఁ గరుణాసింధున్. 53

కం॥ గురుడయి బంధుఁడు వరసోదరుఁడయి యాప్తుండు సుగుణధన్యుఁడు ప్రతిభా
కరుఁడగు శ్రీపతి పండిత, శరభారాధ్యుని భజింతు సమ్యగ్భక్తిన్. 54

కం॥ నిగమాగమను విశారదుఁడగు, నలమామేనమామ కనుగుఁగొమరుడై
నెగడు కవివీరభద్రుని, నగణితగుణశాలి మల్లికార్జునుఁగొలుతున్. 55

కం॥ నుతియించెద సువ్రతుసం, సంతతపంచాక్షర జపైకతత్పరు సుగుణా
న్వితు నాత్రేయకులేందుని, సుతపోనిధి నాదుమామ, సుబ్రహ్మణ్యున్. 56

ఉ॥ మల్లమపల్లివంశ నవమండన మంజుళ మాక్తికా తప
త్రోల్లసదచ్ఛకీర్తి మహిమోన్నతుఁ డుజ్వలమంత్ర శాస్త్రసం
పల్లలితుండునైన గురుమల్లయదేశికనందనుం గృపా
వల్లభు రామలింగ గురువర్యు భజింతు మదిష్టసిద్ధికిన్. 57

*

ఉ॥ మొత్తని చిత్తమున్ గుణసమృద్ధియు నిల్చిన కొల్వుకూటమై
వృత్తము పెంపునన్ గురుల పేర్మి వసించిన రచ్చపట్టు మే
నత్త కుమారు బావ సుగుణాంబుధిఁ గొల్చెద నాగలింగ ధీ
రోత్తముఁ గాశినాధకులు నున్నత కావ్య కళా విదుత్తమన్ 58

కం॥ అనియీకావ్యారంభ మ్మునగురువులనెల్లఁ దలచి పురహర పూజా
జనితాదరమే దురమతివనుఁ గుంగవితా కుమారి నల్లనగనుమన్. 59

## కృతి సమర్పణము.

శా॥ అమ్మా పుట్టినయిల్లు మెట్టినిలు నీకా లక్ష్మికిం బోలెనే
కమ్మయ్యెన్ విబుధుల్ కవీంద్రులును నీకాంతున్నినుం గొల్వ వం
శమ్మున్ దామరతంపరై యలరఁగా సద్భక్తి మీతాత చి
త్తమున్ రంజిలఁ జేయుచున్ జగతినన్ ధన్యాత్మ గావింపుమా. 60

ఉ॥ చంచలమైన జీవనము సంగతిఁ గాంచినఁ గాంచుగాక నిన్
గాంచిన తల్లిపుణ్యగుణ గౌరవముల్ శుచితా గభీరతల్
నించు రసస్వరూపము ధ్వనిప్రియమైన కవీంద్రకోటి మే
లంచను రాజశేఖర సమాదరణమ్మును నిర్వహింపుమా. 61

కం॥ అనిపలికి యాత్మగౌరవ ధనునకు హరిపాద భజన తత్పరునకుఁ బో
ధనునకు మునిసమ్మితునకు, ననఘునకును మల్లికార్జునారాధ్యునకున్. 62

కం॥ జనకునకు భవ్యకవితా జనకునకును హేంద్రమౌళి సంచిత నీరా
జనకునకు నాత్మవిద్యాజనకున కర్పించిదీనిఁ జరితార్థుఁడగన్. 63

కం॥ శ్రీ మీర్జాంచితసీతా రామప్రభు హృదయవిమల రాజీవలసత్
శ్రీ మహిత మహితకవితా శ్యామలవన కేకి మల్లికార్జున దేవా!

మ॥ ఇదినేనై రచియింపలేను సుమితంద్రీ! బుద్ధికూహింపఁగన్
కుదురేదీ తనుదానవచ్చి నడవన్ గూలంకష ప్రజ్ఞ మీ
మదికిన్వచ్చిన యట్టికోడలొనరింపం బూనునీ సేవకున్
మదిమెచ్చన్ మిము వేడికొందుఁ గవితామాధుర్యంబు మన్నించుచున్.



# కథాప్రారంభము.

శా॥ శ్రీపంచాక్షరమంత్ర చింతనపరుల్ శిష్యప్రశిష్యాన్వితుల్
పాపోన్మూలన కర్మకర్మఠ తపోభారావనమ్రుల్ దరియా
వ్యాపారుల్ హరితాత్రి కౌశిక వసిష్ఠాదుల్ మునుల్ మోక్షల
క్ష్మీ పూఃపాంథులునై మిశంబున జగత్ క్షేమాధ్వరారంభులై. 66

కం॥ భవఘోరవనధితారము, భవసాక్షాత్కృతియెగాక పరికింపంగా
భువిగలదె తమోనాశక, మవిరళరవికాంతి యట్టులన్యంబగునే. 67

కం॥ పశువులకుఁ బాశబంధము, పశుపతిచేఁగాక యెంటఁబాయునె చెప్పుడా
పశుపతి సాక్షాత్కృతికయి, వశమొనరింపంగఁ దగిన వర్తనగనుఁడీ. 68

కం॥ అనిచర్చ సేయువారలఁ, గని మైత్రావరుణుఁడనియెఁ గడు దుష్కరముల్
గానవచ్చుఁ దపముచేఁ దప,మునకు నసాధ్యంబుగలదె ముల్లోకములన్. 69

చం॥ తపమునఁగాంచి యీశ్వరుని ధన్యులమయ్యెదమింత యేటికిన్
దపమున లోకపాలకులు దత్పదమందరె బ్రహ్మవిష్ణులున్
దపమున సృష్టిరక్షణ విధానమొనర్పరె "నాస్తిదుష్కరమ్
తపసః" యటన్న వాక్యమునెదం బరికింపుఁడు మీరలిందరున్. 70

కం॥ అనునినవంశ పురోహితుఁ గనిశాతాతపమహర్షి కలకలనగుచున్
వినిపించె నిట్లుదనమది కనువుగఁ గనిపించు నొక యుపాయము నంతన్. 71

ఉ। ధర్మము పాపముం దొలఁచు ధర్మము శంకరుమూర్తి స్వర్గమున్
ధర్మమొసంగుఁ బ్రాక్తనము ధర్మము, శర్మము, పూర్వమోదఁబో
ధర్మముఁ గొల్చి యీశ్వర పదమ్మును గాంచి రఖీశ దాతృతా
కర్మఠ, మిట్టిది౯ సలుపఁగానగు వాంఛిత సిద్ధి యొందును౯. 72

కం। గోదావరీ విఘాత్ముఁడు ద్వాదశవర్షాన్నదాన తర్పిత లోకం,
డాదిముని, శాస్త్రరచయిత, పాదాక్షుఁడు పలికెఁ దనదు భావము నిట్టుల్. 73

ఉ। దానము సర్వసిద్ధుల నిదానము, శత్రులు మిత్రులౌటకున్
దానము దానమౌ బ్రదుకు దానపరాయణుఁ గొల్చి లోకముల్
దానముకన్న గానము విధానము వేఱొకఁ డెందుగాని యీ
శానుఁ బ్రసన్నుఁ జేయ ననఁ జక్కఁగనుంగొని కశ్యపుండను౯. 74

కం। సత్యముపరమశ్రేయము సత్యమునఁ బ్రతిష్ఠితంబు సర్వజగంబున్
సత్యమున వీచుగాలియు సత్యముచే నుదయమందు సవితృఁడు శశియు౯. 75

కం। సత్యమున వెలయుజలధులు సత్యమునఁ వెలుంగు వహ్ని సత్యము హరియు౯
సత్యము బ్రహ్మము శంభుడు సత్యముననయీశు మనము సాధింతమన౯. 76

వ. విని భగద్వాజుండు 77

కం। యజ్ఞము త్రిలోకగణ్యము యజ్ఞముననఁ గురియువాన యమునలుతృప్తుల్
యజ్ఞేశ్వరు హరుఁ గనుఁగొన యజ్ఞమునకు మించియొక యుపాయము గలదే 78

వ. అనుటయుఁ గశ్యపుండు, 79



ఉ॥ పుత్రునిచే జయించు జగముల్, ప్రజఁగాంచుట యుత్తమంబు మేల్
పౌత్రునిచే ననంతమగు వంశము సూర్యుని పుణ్యలోకముల్
పౌత్రుని పుత్రుచేఁ గలుగుఁ బాయుఁ బితౄణము గాననొక్కనిన్
బుత్రుని సర్వలోక పరిపూజ్యుని గాంచుట మేలునావుడున్ 80

కం॥ కేవల భవశోపమయ ప్రావిర్భావుండు నగుచుఁబలికెను దుర్వా
సోవాచంయమికనుకెం పావహిలన్ దష్టవిచ లితాధరుఁడగుచున్ 81

వ. సన్యాసంబు సర్వాశ్రమ గరిష్ఠంబు, శివప్రాప్తినిదానంబు. దక్కిన వి యెక్కుడి మార్గంబు లని యుపన్యసించుచున్నంత. ౮౨

కం॥ వారి తపోరశ్ములనా కారితుండై వచ్చెననఁగ ఘనతేజస్సం
భారుఁడు పురాణ ఘనరథ సారధిసూతుండు విమలసారధిశోఁచెన్ 83

కం॥ రుద్రధ్యానపరాయణు రుద్రాక్షకిరీటు భసితరూషిత వేషున్
భద్ర చరిత్రునివ్యాసును,రదుర్మమ మధుమత్త బంభరాయితు నూతున్. 84

వ. కనుఁగొను నప్పుడు, 85

కం॥ తారాకలకలమెల్లని, శారాజుం గనినయంత శమియించునటుల్
వారల మనోంబరంబున నారాటము కొంత కొంత యప్పుడతగ్గెన్. 86

ఉ॥ పూనినభక్తివారు మునిపుంగవు సూతుని నర్ఘ్యపాద్య స
న్మానితుఁ జేసియిట్లనిరి మాదగుపుణ్య తపః ఫలంబుచే
నో నిఖిలాగమాంత పరమోత్తమ ధర్మరహస్య భవ్య వి
జ్ఞాననిధాన నిన్నిచటఁ గాంచుట ధన్యులమైతి మెంతయున్. 87

చం॥ భవము ద్వైధ విజృంభణంబణఁ బగాఁ బంచాస్య సాహోత్కృతిన్
వివిధస్ఫార కఠోర దుష్కర తపో నిష్ఠా గరిష్ఠాధ్వ క
ష్టవిధిన్ గానగనేర మాగమ గుహాసంచారి దర్శించు పు
ణ్య విశేషంబును బోధసేయుము పురాణారణ్య భిల్లప్రభూ. 88

మ॥ తపమం చొక్కరు, ధర్మమం చొక, రసత్యమ్మంచు వేరొక్కరున్
జపమం చొక్కరు, యజ్ఞమం చొకరునున్, సన్యాసమం బొక్కరున్
విపరీతమ్ములు వాదముల్ సలుపుచున్ వేర్వేరుమార్గంబులా
త్మ పటుత్వమ్మునఁ బల్కుచుండిరి చటన్ దర్కించి వాక్రుచ్చుమా. 89

కం॥ కృష్ణద్వైపాయనముని, విష్ణుకృతకసుతుఁడ వీవు వేదార్థకలా
నిష్ణాతుఁ డవగుటం బ్రభ, విష్ణుఁడవీ సంశయంబు విడఁదీయంగా. 90

కం॥ సర్వజ్ఞుఁడ వగుదీవు చతుర్వర్గ పక్షాంతరార్థ దోషజ్ఞుఁడ వా
శర్వ పదంబును జేర్పగ నిర్వాహకుఁ డనుటమాకు నిశ్చితమనఘా 91

కం॥ అమరగవీ సేవనమ య్యమరనదీ మజ్జనంబు నఖిలశుభంబుల్
సమకూర్చునటుల సజ్జనుల మోఘ దర్శనులు రోమహర్షణతనయా. 92

కం॥ అని తనప్రత్యభి వందనమున కవక శంబుని కని మునిపుంగవులన్
గని వినయమితి మూర్ధంబునఁ గేలంగవ ఘటించి మునికుంజరుఁడున్, 93

సీ. మీ యెరుంగని యర్థమీ యేనుగందునే వాత్సల్యమిటులుట్టిపడఁగ మీర
లాశీర్వదించుటయగుఁ గాక మీపద. సేవకు నాకు విశిష్టమెద్ది
ఘనఘనాఘన యోగమునఁ బుట్టు, క్రొమ్మించు కర్షకజనమనో హర్షమిడిన
యలట్టునాపల్కు నరయఁగారణమీర, లురుతపస్సామ్రాజ్య గరిమఁ జేసి

సీ॥ జగమును గలిగింపఁ బెనుపంగ సంహరింపఁ, జాలువారలు ధిక్కృత స్వర్గవిభులు
పలికి పలికించి చిలుకలపలుకు నేర్పు. మెచ్చుకొనుటలు జ్ఞానుల యిచ్చగాదె. 94

వ. తొల్లి మీరడిగిన యర్థంబు రెండవ శంకరుండగు నందీశ్వరు వలన సనత్కుమారుండును, నయ్యనఘు వలన వ్యాసశేయుండును దదనుగ్రహంబున నేనుం గొంత యెఱింగితి నదియు మీకు వచించెదనని గురు పరంపర నర్చించి యమ్మునుల సంభావించి యతం డిట్లనియె. 95

* * *

# సనత్కుమార చరిత్ర.



ఉ॥ శతమఖు యజ్ఞయూపముల చాలన నొప్పుమఁ గూర్పు నేర్పునన్
శతధృతి సృష్టిచాతురిని జాటుచు నించెడి యివ్వసుంధరా
ధృతశత శృంగ భాసిత కిరీటమనంగ లసన్మహౌషధీ
చితఘన పుణ్యభూమి శతశృంగ మెసంగు నగేంద్రమౌళియై, 96

క॥ అట కఠినవ్రతముల నట మటయై తపమును సనత్కుమారుఁడు సలిపెన్
పటుతర యోగాభ్యాస స్ఫుటతేజము చదలవింత పొలుపుదెలుపగాన్. 97

వ. ఆ సమయమ్మున సపరివారమ్ముగా యదృచ్ఛాగతుండైన పరమేశ్వరు నాత్మవిద్యాగర్వంబున నమ్ముని యర్ఘ్యోపచారమ్ముల నాదరింపకుండిన గని 98

శా॥ దుర్వారోద్ధత దుర్నిరీక్షుసు తపోధుర్యత్వ గర్వాంధతన్
సర్వజ్ఞుంగనఁడేటిమౌని యనుచున్ సందష్టతామ్రోష్ఠుఁడై
పర్వన్ గ్రోధమరీచికల్ త్రిపురజిద్వాల్లభ్య భాక్పారిషత్
సర్వాధ్యక్షుఁడు నందియల్గికటుఁ వర్షామేఘగర్జాధ్వనిన్. 99

కం। కమ్మ క్రమేకమ్మవు మార్గమ్మున నుండగిన ఫలముగాన నిచట శా
పమ్మిడుచు నంతవానికిఁ గ్రమ్మఱిచని రజత శైలకటకమ్మునకున్. 100

కం। అన్నంది పలుకుతోడన యున్నట్టులయుండి మాని యుప్పొంగుచున్
పెన్నిష్ఠలు నియమములా, విన్నాణములడఁగి పుడమి వేసరునంతన్. 101

కం। పరమేశ్వర పదసేవా ధురీణుఁడయి నట్టికొడుకు దుర్దశనట్టుల్
పొరయు తెఱఁగు నెఱుంగుచు విరించనుఁడు యోగదృష్టి విశదముగాఁగన్ 102

కం। శరణాగత కింకరజన శరణాయితు లోకబంధు శర్వుమహేశున్
హరుఁగొల్వఁ గాంచిపురమున కరిగియుజుండ భవునెదుటనార్తస్వనుఁడై. 103

మ। జగదారాధ్య! వృషేంద్రవాహ! గిరిజాజానీ! కృపాశీలునిన్
నిగమప్రస్తుతు మానివంద్యుఁ బ్రమథాని కావృతుఁ జేర్మి మిం
చగనేతెంచిన నిన్నుఁగానని దురాచారుం గుమారున్ క్షమిం
పఁగ వేడ్కొందును గావవే పశుపతీ! పాలింపవే దీనులన్ 104

శా। కేదారంబుఁ జొరండు, నిల్వఁడు గురుక్షేత్రంబునన్ బుష్కర
శ్రీ దృష్టింబడనీఁడు నైమిశము లక్షింపండు, నొక్కింతె కా
లూదంబోఁడు మహాశ్మశానమున, నే లోలోఁగి యీ కాంచికిన్
దా దొడ్డింబడి యున్నవాఁడు వృషభేంద్రస్వామి విశ్వేశ్వరా! 105

కం। ఆ మందరగిరి మోయఁగ, దామేటితనంబు వాసి తాఁ బేలగుటన్
నీ మన్ననఁ బురుషోత్తముఁ, డైమఱితా మేటిగాఁడె హరి మున్నిచటన్. 106

కం। కాంచితి శరణంబుగనీ కాంచిని బలుమార్లు పెక్కు కల్పాంతములన్
గాంచితి సేవించితిఁ బూజించితి రక్షించితీవు సేవకునన్నున్. 107

సీ. నీ మహత్త్వంబైన యీ సకలజగంబున, నీకన్న నొకదిక్కు మాకుఁ గలదె
భక్తులమన్నించి పాలించుటకు నాగ, బద్ధకంకణము నిన్నుఁ బలుకు శ్రుతులు
పశుపతి వైనను బేర్కొఁ బాటింతు వనుటకు, వృషభంబునీ చేతిమృగము సాక్షి
ఆర్తి నెంతటిదాని హరియించుటను జాటు, గళమున వెలసిన గరళరేఖ

గీ॥ అష్టమూర్తిని శివు భవుని భవ్యభర్గు, శర్వు సర్వజ్ఞు శంకరు శంభు శాంతు
నప్రమేయుని బ్రభు బ్రపన్న ప్రసన్ను, నాశ్రయించెద దా మొఱ యాలకింపు. 108

కం॥ అనితమున విరళనిష్ఠా ఘనతరభక్తిన్ భజించు కాంచనగర్భున్
గనికరము మదిని జెలఁగెడి కనికరపు వెల్లి మిగులఁ గడలుకొనంగా. 109

సీ. కరుణారసం బెల్ల కడముట్టె జడలలో, బొంగెనానుడి కొను గంగతోడ
వడిగురుద్రోహంబు సడలించి శిరమిచ్చు, భక్తులకను నెలబాలుతోడ
నేరూపమున నున్న నేమి సేవించినఁ, జేపట్టుటలు దెల్పు జింకతోడఁ
పాపరాజగుఁ గాక పదమంటఁ గృపఁ బ్రక, టించెడు గండపెండెరముతోడఁ

గీ॥ కాళికామూర్తి తననీడఁ గాఁగ బూని, మించు వహించు వింత క్రొమ్మించు పసలు
వెలయఁ జేసెడి తనమేని వెలుఁగుతోడ నెట్టయెదురయ్యె వేల్పులు చుట్టికొనగ 110

గీ॥ అట్లు ప్రత్యక్షమయి వెఱఁగందు విధిని, వేడుకొనువత్స నీమనభీష్టమనియె
నెఱిఁగియుండియుఁ బిన్నల తెఱఁగు లడిగి, వాంఛితములీగి పెద్దలవర్తనంబు 111

వ. అంత నా చతుర్ముఖుండు విరచిత కరకమలాంజలి యుగళుండగుచు నాగళపీతస్నాత, శివ పదారవింద మధు రసోన్మత్తార్ద్రాంగ నిరీక్షణ భృంగమ్ములు వెలుంగ, హరకృపారస, సరస, సరసీనిమజ్జనోన్మదస్ఫారసమానసంబున, క్షణక్షణ ప్రవర్ధమాన, లలాటేక్షణగుణ మహిమాభివర్ణనోత్కంఠాసమాకుల, భవదర్శన వికసిత నిజచతుర్వదనీ, కమలినీ, నిర్యన్మత్తమిళిందికుల, కల. కాకు, కాకలీ ఝుంకార శంకాకర, రవంబులు చెలంగ నిగమసూక్తంబులం బ్రస్తుతించి. 112

మ॥ శివ, విద్రోహి, సనత్కుమారు గరుణన్ జేపట్టి రక్షింపవే
భవ, నందీశ్వర శాపదగ్ధుననినం బల్కెంబురా రాతి నే
నవుఁగాదంచనరాదు, భక్తజనకృత్యంబౌట నామాటయిం
దు విశేషింపఁగనే లనందియొసఁగుమా బో నీకునిష్టార్థమున్. 113

కం॥ అని తనుమొఱఁగెడు శంకరుననుమతిఁ గొని నందికడకు నజుఁడరిఁగి వడిన్
దన తనయు శాపమోక్షము ననుగ్రహింపంగ వేడ నాతఁడు నగుచున్. 114

కం॥ సకలేశ్వరుఁడగు శంకరు సకళంకితభక్తిఁ గొలుచునంతకుఁ గలదే
ఒకటియుఁదపములు జపములు కవిక గలిగించు ఘోరగహనపథంబుల్ 115

కం॥ భక్తివలెరక్తినొసఁగవు, శక్తులుపదివేలుగాని సర్వజ్ఞునకున్
భుక్తినిడుముక్తినిడు ఘన, భక్తియెఘంటాపథమ్ము పరపదమునకున్. 116

చం॥ ఎఱిఁగి యెఱింగి నన్నడుగనేటికి శాపము గ్రమ్మఱింపఁగా
మొఱకుఁదనంబు నప్ఫలముఁబొందెను బూర్ణముగాఁగ నీసుతుం
డుఱక విచారముల్ దొలగుమున్నదె యింకను శాప బంధమున్
దఱిఁగెను గచ్ఛపేశ్వరుని దర్శనమప్పుడుయంచు నర్మిలిన్. 117

కం॥ శేషంబు శేషదోషము దూషితమగు నన్నుఁగనిన తోడనెయతనిన్
బోషింతునఖిలవిద్యా, శేషవిశేషములఁ దెల్పి సిద్ధునొనర్తున్. 118

మ॥ అనినన్నందిని మ్రొక్కిపీడుకొని యయ్యబ్జాతగర్భుండు దాఁ
దనయున్స్వీయజనంబుతో నతని చెంతం జేర్పఁగాఁ బంచెఁ బం
చిన మౌనీంద్రుల వెంటనేగుచతఁ డీక్షించెన్ గిరుల్ వాహినుల్
తనపూర్వానుభవమ్ము దెల్పునవిగాఁ దర్శించె వానింగడున్. 119

సీ. ఈ వీరలెవ్వరో యీబంధమేలొకో, యెందాఁకఁబోవుటో యెందుకో యకో
ఈ కొండవాఁకలు నీపాదలుబయల్లు తలపించునీవింత తలఁపులేమి
ఇదియేమిమునువలె నీలేఁతజొంపముల్ జిహ్వాకుమిగుల రుచింపవయ్యె
దివ్యమైతోఁచు నాదేహసౌభాగ్యంబు వెగటుగా నేఁడు గాన్పించునేల
గీ. అనుచు నేమేమొతలపోయు నాశ్రమముల, నడుగువేయక వారి నాయాసపెట్టు
వెఱ్ఱివెఱ్ఱిగఁ దిలకించు వింతసఱచుఁ, బలుకులాడెదు నమ్మునులులికిపడఁగ. 120

సీ. బ్రతిమాలిమాలికొ్రం బరుసఁదనంబున, హుంకరించెదు ముని నోరఁజూచు
ముక్కుద్రాఁట నొకపాటి యొకబాటకునుదూఁకు, జడదారితడబడ మెడనుజూఁచు
నిండమంచుఁ జిగుళ్ల నందిచ్చు మునిపాణి, పల్లవంబులొకింత పదనుపఱచు
సామగానము సేయు సంయమిపలుకుల, పడి సవ్వడినిబట్టి యడుగువైచు
గీ. నెంతవిసిగించినను నిసుమంతయేని, కనలుచూపని మునిపైని నెనరుచూపు
నొంటితనమునుదొలఁగించు పొందువారు, వెంటఁ గొంపోవఁ బోవు
నవ్వింతయొంటె. 121

కం. కంటకిమును మును దనమదిఁ, గంటక ముగ్రసించు కంటకప్రియుఁడచ్చో
నంటఁడు దన మునిపంటను, గంటికినింపైన నట్టి కంటకమేనిన్. 122

కం. తన కొంటెతనము గలుగఁగ, మునికొనినయమోఘతపము మోసపుఫలమున్
దనకొంటెతనము దొలఁగఁగ, ననియోయవిపల్లవములు నంటదుకంటన్. 123

కం. లొట్టలనువైచును కాలొట్టియ గడు నిష్టవస్తులును నొరకొన్నన్
ముట్టదు మూపట్టదు నీర్వట్టువడియుఁ బెదవితడుపఁ బట్టు కొలుపదున్. 124

ఆ. వె. ఎంతతపముచేసె నేనియు వెను మును, చూపుచాలనట్టి పాప బుద్ధి
యందు ఫలముఁ దెలుపునమ్మహాంగముపుచ్చ, చలనమునను శిరముచాలనమున. 125

క॥ మునిరూపమున్నఁ దనకుం,గొనిపోవఁదలంచువారిఁ గోరినయెడలన్
దనకను మునిత్వ బలమున, సనత్కుమారుండు కూడఁ జనియెడువేళన్, 126

వ. మఱియు సమ్మహాగ్రీవంబు, చతుష్పదత్వంబు గోల్పోయినంబలె నొక్కొక్కయెడ రెం
డడుగులనిడి యాగియాగి నడచుచు, నొండుచో మౌనియై యరుగుచుం బదాంతరంబున
వేదపిపఠిషంబోలె వింతగా నుచ్చైస్స్వనం బొనరించుచుఁ దనవిక్రితికిం జింతించుపగిది,
సమాకుంచిత గ్రీవంబగుచు శిరంబువాల్చుచు. నొండు నెడ భవిష్యన్మహోన్నతదశ సూ
చించువిధంబున మెడసాచి, సరాగ, పల్లవాంచిత, విటప, సమున్నత మహామహీరుహ,
శాఖానిలయంబులగు, శుకాది, ద్విజప్రకరంబులు దందడిఁబాఱ, నిక్కి నలుదిక్కులఁ
జక్కఁగలయం గనుంగొనుచుఁ జనునంత. 127

క॥ వారలు మేరుగిరీంద్రము, దూరాగమనప్రయాస దూరముగాఁగన్
జేరుచు నా నందీశ్వరు, నారామ ప్రాంతమునకు నరుగుచు నచటన్, 128

ఉ॥ కాంచిరివారు కన్నుఁ గవఁగాంచినదానికి సార్థకంబుగా
నంచిత మేరుపృష్ఠమున యందు జగద్గురుయోగి పుంగవున్
గాంచన విగ్రహుఌ బ్రమథనాథసమావృతు రక్షిత త్రయీ
సంచయునిం బ్రపన్న పరిమత్సరమేశ్వరు నందికేశ్వరున్. 129

క॥ వంచిరి శిరములు కేల్మోడ్చి,యించిరి నించిరి ముదంబునే నస్తుతిమా
యించిరి మించిరి నుతిఁగా, వించిరి విధిపలుకు విన్నవించిరి పిదపన్, 130

క॥ అతిభక్తిని సాష్టాంగ వి,నతింజేసి సనత్కుమారు నందీశున కు
న్నతి నప్పగించు కుతుకము, నతిశయమున వెనుకదిరిగె యబ్బురపడుచున్, 131

లయగ్రాహి॥ ఏఁడియనువా రిచట రాడె యను వారచట
లేఁడె యనువారెటకుఁ బోఁడె యనువారున్

జాతుఁడని వారతని జాడలను వారిపుడ
కూతుఁడను వారెచటఁ గూడుననువారల్
మూఁడెనను వారెదియొ కీడనెడి వారిచటఁ
గీడునగునా యదియె మూఁడునను వారల్
వేఁడుఁడను వారెవని వేఁడుటను వారునయి
కీడువడి రమ్మునుల జేఁడులొక యింతల్. 132

కం। అమ్మునులయందు సాష్టాంగమ్ముగఁబడి లేవకున్న ఘనునొక ముని వా
రిమ్మగఁగని, విస్మితచిత్తమ్మునలనె వరీతఁడనుచుఁ దర్శించునెడన్ 133

కం। తన దివ్యదర్శనమున మునియగు నుత్పన్నమ్ము వెదకు మునులాశ్చర్యం
బున ఘనభక్తి తరంగిణి మునుఁగుచుఁదను నర్చసేయు పొలుపు వహింపన్. 134

శా। ఆ నందీశ్వరుఁడ మ్మునీశ్వరుని వత్సాయంచుఁ బ్రేమంబునన్
లేనెత్తెన్, దయఁ గౌఁగిలించె, నతఁడా లీలాఖిలప్రాప్తన
జ్ఞానాంభోనిధియై రచించెను తులన్ గాలప్రవర్ధన
ధ్యానప్రీత మునీంద్రకేకిసువచో వారం బవారంబుగాన్. 135

వ. ఇట్టులా సనత్కుమారుం డప్పశుపతి చక్రవర్తి యనుగ్రహ విశేషంబున, మహాబలధూత ఘనాఘన నిరోధంబున వెలుంగు, రాకానిశాకరు చందంబున, మునిజననయన చకోర పర్వం బొనరించుచుఁ దదనుభావ విశేషంబున, నప్పుడ విగత కళంకంబగు తన హృదయము కురంబునం బ్రతిఫలించు నిఖిల వేద వేదాంగ విమల జ్ఞాన రసవాహినుల పొంగెననఁ జిరునగవు నుడుంగుల డగన మ్మునీంద్రుల సంభావించె. వారును బ్రమదాధ్యత్తు నభ్యర్థించి వారలచే ననుజ్ఞాతులై త్వరిత గమనంబులన వృత్తాంతంబు నివేదింప నంబుజ సంభవుపాలికిం జనిరంత నవ్విరించన కుమారుండు శిలాదకుమారుం గని. 136



మ: ప్రతిపాదించితి సర్వశాస్త్ర నిగమ ప్రజ్ఞాన సిద్ధాంత సం
గతి చూతుంబన నొండులేదు, శివసాక్షాత్కారమే యంచు నా
ద్గతి నేరీతిఁ గనంగనేర్చుఁ బసుతాక్రాంతుండు జీవుండు, స
న్మతి బోధింపవె ముక్తికిమ్మయిన ఘంటా మార్గమిప్పట్టునన్. 137

కం: ఆరాధ్యుఁడ వాచార్యుఁడ, వారాధిత పరమ శివ పదాంభోజుఁడవున్
లేరెట నీ సరివారలు, గారామున నన్నుఁ బ్రోవఁగదవె మహాత్మా. 138

చం: అన, ననెనాతఁడాతనికి సత్యమలంబు భవన్మనంబు నీ
వనఘ కుమారు నంశ నుదయుం బగుటన్ నిను మో జగంబులన్
గన విన నీ యెఱుంగనిది గానఁగ నేరమ యర్థ మొక్కఁడున్
నిను వినిపింపఁ గాఁబనిచె నీ జనకుండు ననునో దయార్ద్రుఁడై. 139

వ. తొల్లి నీచే నిజాపత్యాపరాధంబునఁ గారాగారనిబద్ధుండగు నజుండు నిన్నుం గుమారుని
గాఁబడయం గోరి పెక్కుతపంబులాచరించి యయ్యల్పంబు భక్తజనసులభుండగు శంకరునివలన
సంపాదించె నదికారణముగ నైధాత్రుండవై సనత్కుమార ప్రసిద్ధిఁ గాంచితివి యట్లుండె.
వినుము వేదాధికారులగు ద్విజులకు మంత్రపూర్వకంబులుగా బ్రహ్మచర్య, గార్హపత్య,
వానప్రస్థ, సన్యాసంబులను, నాలుగాశ్రమంబులు నిర్ణీతంబులందు గర్భాష్ట మైకాదశక
ద్వాదశక, సమంబులఁ గ్రమంబుగ వారల కుపనయనవిధి విహితంబు నదంపడివార
లుత్తమాచార్యముఖంబున సరహస్యంబులు సాంగంబులు వేదంబు లభ్యసనంబు సేసి, ము
నిఋణంబుఁ దీర్చి త్రివర్గసిద్ధిముఁ బిత్రుదేవఋణ విముక్తియుం గారణంబుగ దారపరిగ్ర
హంబొనరించి వనంబులఁ దపంబాచరించి, యనంతరంబు సన్యసింపవలయు. నిట్లుగాని
నాడా ద్విజుండు పతితుండగుంబరఁగు. నంతటఁ బ్రణవంబున మహేశ్వరు నుపాసించి త
ద్భావంబు నాశ్రయించి కలిగిన శివ సాక్షాత్కారంబున ముక్తుడై వెండియు మాతృగర్భ
కుహరంబుం జొరనేరడు. ఇయ్యది శివ సాక్షాత్కార క్రమోపాయం బట్లయ్యు నల్ప స
త్త్వులగు మానవుల కెల్లవారికిని సుగమంబు గాదని నుడువుటయు సనత్కుమారుండో
మహానుభావా! అల్పసత్త్వులగు మానవులు సులభముగఁ దరించుట కనువగు మార్గంబు
సెలవీవేయని ప్రార్థించుటయు నంత నాశిలాదనందనుండిట్లనియె. 140

# కాంచీ క్షేత్ర ప్రశంస

కం॥ సుగమము ఋజువగు మార్గము, జగతి శివ క్షేత్రవాస, సంగతియొకఁడే
దగుముక్తినిడుఁ గశ్వపచుం డగుగాక మఱెట్టి జంతువగుఁ గాక తుదిన్. 141

అని వచింప నాలించి నందనుండు,

కం॥ అగుచోఁ బెక్కులు గలవ, య్యగధన్వికిఁ బ్రియతమంబులగు క్షేత్రంబుల్
పొగడఁదగు వానవధికం, బగు నెయ్యది దానిఁ జెప్పుమా! యనన తండున్. 142

చం॥ వినుము సనత్కుమారమును వేదతురంగముఁ డొక్కనాఁడు, భ
క్తనివహముల్ భజింప మణిధామ సముజ్జ్వల పీఠిపై జగ
జ్జననియుఁ బ్రీతిఁ గొల్వఁగఁ గథా కదనంబుల దేవ నీ ప్రియం
బున కిరవైన పుణ్యపురమున్ దగ నానతి యిమ్మటం చొగిన్, 143

కం॥ వాల్లభ్యాతిశయంబున వల్లభదను వేడఁ బ్రమథవల్లభులు వినన్
ఉల్లంబులఁ గుతుక ముజ్జృంభిల్లన్ మముఁజూచి శివుడు ప్రియముననియెన్, 144

శా॥ హాలాస్యంబు ప్రియంబె సేతువిడు నయ్యానంద మల్పంబె శ్రీ
శైలంబీ క్షణకౌతుకంబె నటనాస్థానంబు నాస్థానమే
కాళీఘట్టము పట్టణంబె యదె గోకర్ణంబలంకారమే
కాలంటంబడుఁ గాళహస్తి ముదమున్ గల్గింపదే కాశియున్. 145

శా॥ కైలాసంబిటు తెల్లఁబోయినది వంగంజొచ్చె నిమ్మేరువున్
బ్రాలే యాద్రియుఁ జల్లచల్లఁబడియెన్ మందాద్రి దానబ్ధిలో
దూలెన్నను వహింపఁగాఁదలఁప నొందుం గాంచికేఁ జెల్లుఁబో
బాలే దెందును దాని సాటిపురమియ్యబ్జోద్భవాండంబునన్, 146

వ॥ అని యప్పరమేశ్వరుండు సెలవిచ్చునెడలఁ బ్రమథ ప్రముఖులగు ఫణికోటి ప్రముఖు లాక్రాంత తనవు విస్మయానందోళిత మానసులగుచుం జకితవీక్షణంబుల నొండొరుల నభిలక్షించి మెల్లమెల్లన నేమేమి? గజారణ్యంబు పంచాస్య ప్రియంబుగాదె. వటారణ్యంబావి ముని నిలయం బనుచుందుము. త్రియంబకంబు త్రియంబక నివాసంబనియుఁ, జంపకవనంబు పంచముఖప్రీతి జనకంబనియు, వృద్ధాచలం బాజ్ఞయిని మహావృద్ధ తుష్టిదాయకంబులనియుం దలంతుము. ప్రభాసంబాభాసమాత్రంబె యరుణగిరి యవరణీయంబె సిద్ధవటంబు ప్రసిద్ధంబె యానంద కాననంబు మహాశ్మశానంబని యేవగించెనో. చిదంబరరహస్యం బింతమాత్రంబె కర్మ విద్యావిహీన పశుపక్షి జనంబుల, నిజ దివ్య దర్శనంబున, నక్షీణ మోక్షలక్ష్మీం గటాక్షించు తమకంబునఁ దా వెలసిన యిమ్మహా క్షేత్రంబుల గరీయస్త్వంబు గాంచుట కిక్కాంచి యేమి తపంబు గావించెనో. యని పలుపలు తెఱంగులఁ దక్కించుచు, గుసగుసలు వోవునెడల హిమాచలనందన యగు నప్పరమేశ్వరి ప్రణయ కౌతుకాశ్చర్య ప్రవాహ నిర్నిమేషంబులగు నయనంబులు శంబరునకై భంజనంబయిం బఱుగులువార నిజగురుశీత్కార, వికార, సమాకుంచిత ముకుళీభవద్వదన పంకజ సహచరంబులగు కరకమలంబులు మొగిడ్చి, నిశ్వాసదీర్ఘంబు, నాలోచనాచలితంబు కలకాకలీ మధురంబు, భావపరవశతా కషాయితంబు. వినయ సుందరంబునగు ప్రశ్నని యొలుకగున. 147



ఉ॥ ఏమితపంబు సేసెంబరమేశ్వర యీ తనసాటివానిలో
నేమిట నెక్కువయ్యె గణింపఁగ నిమ్మెయి వ్యంగ్యమాధురీ
మీమదిఁ జూడఁగాఁగొసియె నే యనుకంపయె గాదుగా మణీ
ధామము కాంచికాపురమె ధన్యతమంబగు నే నిజంబుగా. 148

కం॥ అని తన సంతాపము మదిఁ బెనఁగొనునర్ధంబుఁ దాన పెనిమిటి నడుగం
బనిగొనుజగత్కుటుంబినిఁ, గనియనియె విభుండుమధుర గంభీరముగాన్. 149



చం। ఎఱుఁగవొ కాకయేమొ పశిగిత్రివు దళన్నళినాక్షి రో నిజం
బెఱిఁగినయంత చెప్పవలె నేనియుఁ జెప్పెదనాలకింపు నా
తెఱఁగిది నేఁడు వింతయె విధిప్రముఖుల్ గనలేనినన్ను న
క్కఱపడి విల్చికోఁగలిగెఁ గాంచియె నాయనుకంప పెంపునన్. 150

ఆ॥వె। అన్నపూర్ణ యనుచు నఖిల జగంబులఁ, బేరునీకుఁ దెచ్చిపెట్టెఁ గాశి
యందునే నునుందునవిముక్తమనఁ బ్రీతిఁగాని కాంచి సాటిగాదు కాశి. 151

కం। ఉంచితి లోకములను బాలించుట కట విశ్వనాథలింగము గాశిన్
మించిన యనుకంపను జనియించితి నిటఁ గాంచి పంచ కృత్యంబులకై. 152

కం। ఏకామ్ర నామధేయం బేకచ్ఛత్రంబుగాగ నేకామ్రతరు
శ్రీ కాంచిత కాంచిపురీ శ్రీ కాంచన సింహపీఠిఁ జెలఁగి వసింతున్. 153

కం। ఒక దినము గాని యట మున్నికటమున వసించు నరుడు నేరఁడు సుమ్మీ
ప్రకటోర మాతృగర్భ నరకఘోరపథంబు గనఁ బరాకున నైనన్. 154

కం। పలుకు పరాకునఁ గానీ, బలవంతముచేత నొకటఁ బలికినగానీ
కవి విద్రోహమణంచును గలిగించును స్వర్గలక్ష్మి కాంచియనుచు, నుడుల్. 155

కం। ఎంచఁగనితరక్షేత్రము, లంచితములయ్యెనఁ గాంచి సధికంబుగఁ బ్రే
మించెదఁ బెఱయవినామది కించపుగా కాంచియటుల హిమశైల సుతా. 156

మ। అనిసన్ ఒడ్డణనాధ యూధము గడున్ హర్షించె సింహేంద్ర వా
హనయున్ బాసన్ప్రు లెండటన్న క్రియగా నాస్యంబు కుంచించి శం
భుని నీక్షించెఁ గళిందజావిమలవాః పూరాభిషేక క్రియ
ఘన కౌతూహల వర్ధమాన మృదుపీయూషాను వక్త్రాబ్జయై. 157

శా॥ ఆ వేళన్నముఁ బోటులందరు నమందానంద డోలోత్సవ
శ్రీ విస్తారిత చిత్తలగ్న శివమూర్తిం గొల్చుచున్నంతలోఁ
గావించెం బ్రణవోపదేశము వృషగ్రైవేయ ఘంటాధ్వనుల్
భావస్థైర్య విధాన ధీరములు శబ్దబ్రహ్మ లీలాఢ్యముల్. 158

క॥ అంకెలును బొబ్బరింతలు, ఘీంకారంబులును నరియు క్రేంకారంబుల్
ఝుంకారంబులు నాసభ నోంకారని లీనమగుచు నొప్పెఁ గుమారా. 159

క॥ ఉక్షధ్వజవచనంబులు, నక్షీణపు భక్తి వినెడు నవసరమందున్
చక్షులె కర్ణంబులుగాఁ జక్షుశ్శ్రుతి భావమొసఁగె సభ నెల్లరకున్. 160

క॥ ఆ నీలకంఠు నంతర్ధానము మాకెఱుక పడఁగ తన్నిర్గమ వే
ళా నిర్ణీతధ్యానము, తానై మాచెవులఁ బడెను దాకఁ గుమారా. 161

క॥ కావున సుదీర్ఘసేవయే గావించుట మేలు నందుఁగాంచిని బోలన్
గావలఁతి తీర్థమొక్కండే, విశ్వంభరను గలుగ దెన్నండే నిన్. 162

క॥ అనవిని విస్మితుఁడయి యతఁడనఘా! వృషభేంద్రు వేఱయుటఁ దెలిపితి నీ
వును నాతఁడొకరుగారో యన నవ్వుచు నంది యతని కనియెం బ్రీతిన్. 163

ఉ॥ ఓయి కుమార! నేనునతఁడొక్కటియే యననేల, నాకు, నా
రాయణుఁడంచు వేదమయుఁడంచును భద్రుఁడు ధర్ముఁడంచునున్
గాయజవైరిసేసె బహుకల్పన విచ్చఁదలంచి నట్లు భ
ద్రాయితమూర్తి యవ్విభు పదస్థిర సేవన రిత్తఁబోవునే. 164



సీ. అది సెంటటి భిక్షుండయి యన్ననగుఁగాక, బంగారు కోదండఁ జేపట్టఁగలఁడు
కిరులఁ గిరులద్రిమ్మరు కిరాతుండైన బ్రహ్మణ్యమూర్తియై పరిఢవిల్లు
నిల్లువాకిలిలేక వల్లకాట వసించు, నొంటరియుండు వెండింట నెపుడు
కులగోత్రములు లేని గోపాలకుండైన, రాజశేఖరుఁడు సర్వజ్ఞుఁడగును

గీ. సతతహాలాప్రియుండు విఘ్నిత మహాధ్వరుండునగుఁగాక యెవ్వఁడైయుండెనేని
యగును సర్వసుపర్వ మాన్యాంఘ్రియగుఁడా, తఁడెవ్వఁడు గొల్వ
నేకామ్రవిభుని. 165

కం. పురసంహరు చరితంబులు గరము విచిత్రములు సకలకల్మషహరముల్
పరమపదదాన ధౌరంధరములు గలికాల దోషధర దారణముల్. 166

కం. అని యాసనత్కుమారుని వినిపించెను నంది యతఁడు వినిచెను మునువ్యా
సుని నతఁడనుగ్రహించెను నను నేసిట మనవిచేసినాఁడను మీకున్. 167

కం. అనుసూతు నమ్మునీశ్వరు లనఘా! పరమంబు శివ కథామృతరసమున్
గొనఁగోరి తనివిసెందని మనముల యుత్కంఠఁదీర్పుమా! యని వేడన్. 168



# ఇంద్రోపాఖ్యానము.

వ. వినుండమ్మని యమ్మహేశ్వరు సముచితంబుగా వీడ్కొని పౌరందరమ్మునకరిగి యేకా
మ్రేశ్వరు సేవించి కృతార్థుండయ్యెననుటయుఁ గాంచికి పౌరందరాభిధానంబెట్లు గలి
గెననిన మునుఁ గనుంగొని యతండు మున్న వారాహకల్పమ్మున నాజవమన్వంతరమ్మున
శిఖీ యనువాఁడు సురాధిపత్యమ్ము వహించె. నంత నొక్కనాఁడు, 169

శా. మానీంద్రామరసిద్ధసేవిత సుధర్మాభర్మసింహాసనా
సీనుండై సురగాయనీ నటనటీ శృంగార సంగీత భం
గీ నాట్యాంచిత నైపుణీ ప్రకటన క్రీడాకళా, పండితా
స్థానీ భవ్య చరిత్రుఁడౌచు నమృతాంధస్స్వామి యున్నంతటన్. 170

కం. హాహాగాయనగాన, మ్మాహాయనిపించె నచట నందఱ నంతన్
హూహూగానము విని కుహు, కుహూ యని నందనమునఁ గోకిల
గళముల్, 171

మ. ప్రణవోచ్చారణ కర్ణధారము, పరబ్రహ్మర్షి గుప్తమ్ము న
ల్బణసంసార పయస్తితీర్షు కుశల బ్రహ్మధ్వనీనావ్య, స
న్మణి ముక్తాంచిత దేశ బోధక మహానావమ్ము, చాతుర్య వా
గ్రణితమ్మౌచు వెలింగె వేదమట నోంకారైక గంభీరమై. 172

గీ. అమర రమణీమణీ గానమాలకించి, మించు ననురాగమునఁ బల్లవించె విటప
కులము నందన విలసనముల ద్రవించెఁ, జిత్రరీతుల మునిమనశ్శిలలు గూడ, 173

కం. భరతాచార్యులు త్రిపురాసుర సంహారమ్ము నచటఁ జూపించె వియ
చ్చరులచ్చెరువడి రప్పుడ, జరుగుచునున్నదియ కనిన సంభ్రమమొలయన్, 174

క॥ పరిణత భరితఫలమ్మగు భరతాచార్యుండు భరతవాక్యము పలుకన్
సురసభవారలు వినుతము యిరవుల నపుడున్నమాట యెఱిఁగిరొకింతన్. 175

క॥ ఎన్నియొ కనుఁగను జెవ్రలకు నెన్నె మొగంబులను గన్న నేనియు విన్నన్
దన్నిపుణత యెడఁదన తనకున్నవి యటఁజాలవయ్యె నొకవేల్పునకున్. 176

క॥ వేయికనువాఁడు నొక కనుదోయిఁగలవాఁడు గొసియెఁదుల్యమౌ ఫలిత
మ్మేయెడ మహాప్రవాహము చాయంగల చిన్న పెద్ద సరసుల పోలెన్. 177

క॥ ఆ నాట్య భంగిమమ్ముల గానమ్ముల నధికదృష్టిఁగని కని యింద్రుం
డీ నిఖిలమ్మగు నీయాధీనమ్మని తన బుద్ధిఁదెలిసెఁ దెలిసినన్. 178

మ॥ మొగిడెన్ వేగను దామరల్ సురసభా మోదమ్ము తగ్గెన్ గడున్
బెగడందెన్ బుధచక్రముల్ సురసతీ నేత్రప్రభా రాగముల్
దగనొప్పారె నొకింత లోకముఖ చంద్ర జ్యోత్స్నతోఁ బాటుగా
నెగడెన్ సన్మని దేవ దేవ పని తానీకమ్మ నాకమ్మనన్. 179

క॥ అలరించె నతని నృత్తమ్మలరించె నయ్యభినయమ్ము నంతకు ముదముక్
గలిగించె గాన మావయిబలపడె భావమ్ము నతని భావము నందున్. 180

క॥ నాటిన తద్భావమ్మున నాఁటికొలువు విడిచె విబుధనాయకుఁ డమరీ
కోటుల సందడి లోపలి పీటికిఁ గైదండ నిడుచుఁ బ్రియమును నడువన్. 181

చం॥ చనుచుఁబులోమజానయన చాలనవిజ్ఞ సఖీజనంబు మ
న్నన నొనరించు సేవల మనమ్మున దృష్టి నటింప మోముపైఁ
దన యొనరింపఁగా వలయు తక్కిన కృత్యము లాదరింపఁడున్
గొనఁడు ప్రియాంగనా మధుర కోమల చారువచః ప్రకారముల్. 182

వ. వెండియు నన్నిలింప వల్లభుండు ప్రాజ్యమ్మగు తన సామ్రాజ్యమ్ము [illegible] శాశ్వతంబుగ భావించుచు విదగ్ధ వధూ ప్రౌఢ కటాక్షమ్ములం బోలె [illegible] న్మదనన వోఘాహ్లాదయ సమభిలాషంబులం బోలె దన్నెఱుంగ నీయక యున్న నిఖిల గీర్వాణ లక్ష్మి యగు నింద్రాణి సప్రశ్రయమ్ము సహజ మధురిమ్మగు నెఱంగు దన్నొక్క వడ, నుదయద్వ్యాప్త నిరుద్ధ పథమ్మును వాల్లభ్యద[illegible]తమ్మును, ప్రత్యుత్తరసముత్క్రాంతిత మ్మగు వీక్షణమ్మున నతనిం గటాక్షించుచు నీషదాకుంచిత వదనమ్మున, సవిభ్రమంబగు మందహాసంబులయ, 183

ఉ॥ నాదుసపర్యలం గలిగెనా? పొరిపాటు ప్రమాద మేదియుఁ
రాదు గదా? యనాథజనరక్షణ మందపచార మెందులన్
గాదు గదా మునీంద్రులకు గర్విత దుర్భర దైత్యయుద్ధ మొం
డేదియు రాదుగా వగవనేటికి మీకు నిలింప వల్లభా. 184

కం॥ సైదోడై చేదోడై వాదోడై మనకు భువన వల్లభుఁడుండన్
రాఁదగునే యీకొఱకొఱ, కాదనువాఁడొకఁడు మీకుఁగలఁడే యెందున్ 185

సీ॥ సాగించెనా యేమి? సగరుఁడెవ్వఁడు కాని, యశ్వమేధముల నిరంతరముగఁ
గలిగించెనో కాక కౌశికుండెవఁడేని, నాకమ్ము కర్మ చండాలునకును
నేఁటేట గావించు నింద్రోత్సవమ్మును, జెల్లింపఁడాయె నాగొల్లఁడొకఁడు
కలిగెనా? కామినీ కమనీయ తామస, దమయంతి దమయంతి తరుణి యొందు
గీ॥ కాక నిజగురు ధిక్కారగర్వితుండు, రేసెనో యేమొ ధూర్తవర్తి బ్రువుఁడు
నడుగ వెఱచెదఁ దుదిఁజెప్పనగునొ కాదొ, నన్నుఁ బనిగొమ్ము నా
తగియున్న యంత, 186

* *

శా। చెల్లింపక దిగధీశ్వరుల్ ముడుపులక్ష్మీశా మరీరాజ్య, భూ
పాలఖ్యాతి పదాభిషిక్తుఁడగుచుర్ వర్ధిల్లు వాఁడొక్కటన్
డిల్లింబోయిన కారణంబ యనుచాటింపుల్ వినన్వచ్చునే
చెల్లఁగ బ్రస్తుతి వాదముల్ విను చెవుల్ సిగ్గిల్లఁ బ్రాణేశ్వరా. 187

కం। అనునెడ వెడవెడనగి యామానవతీ ద్రోహి విబుధ పూజ్యుఁడు తన
పత్నినిఁ గనియిట్లనుజృంభిత. ఘనముక్తి వధూది దృతుఁగలుషితమతియై. 188

కం॥ గజ కర్ణాంచల, చంచల, నిజరాజ్య శ్రీ నెఱింగి నిర్విణ్ణమై
యజరామర పదమందగ, గుజగుజవడె మనము నేఁడు కువలయనేత్రా. 189

సీ। మానవుల కన్న నొక యింతమాట వాసి, కాక నిత్యతయేది, దివౌకసులకు
నేఱువాగను భేదమ్మె వెనసియున్న, నబ్ధిఁజొచ్చెడు నెపలఁదుల్యములుగ వె. 190

గీ। వెనుకముందును ముందును వెనుకె గాక, గానుగనబడ్డ నువ్వులు గారె ప్రజలు
ఎంచమనకన్న మనుజలోకింత మెఱుఁగు, వాంఛితములెల్ల నిడఁగల
వాఁడు లేమి. 191

సీ। వాంఛితములీఁగ సురభికల్పమ్ములుంట, ముదిమియెఱుఁగనితనువులపొందలియుంటఁ
గన్నఁగానరుగా కీయన్యవాసు లింతకేవైరి పలుమారు లిందువదన. 192

గీ। ఎల్లసౌఖ్యంబు లిడి చింతయింతలేక. తన్నుఁగనుఁగొనఁ దలఁచి విధాత యిడిన
యనిమిషత్వంబు వ్యర్థమైయాసఁ గేఁగి, చెలఁగి వర్తించు సురలేమి చేదుతినరు. 193

శా। స్విద్యత్పద్మదళాక్షి నీవుధృతిమై సిద్ధాంతముం జేయఁగా
నుద్యోగించెదవో గరిష్ఠమనియీ యుద్యోగిధర్మంబు కా
దుద్యోగమ్మిడి యెంచి చూడఁగ నదో యోగమ్మె యౌగాఁని సం
పద్యోగమ్ము సుఖమ్ము దుంబర ఫలాలాపమ్యంబు చర్చింపఁగాన్. 194

క॥ కావుననీయిక్కట్టుం ద్రోవగనిమ్మైన త్రోవ దొరకొను కొలఁకుల్
బోవుదునిఖిలామరగురు, తావాస పదాబ్జుఁడగు బృహస్పతి కడకున్. 195

క॥ అని వెడలి నీడపోలికఁ దన వెనుకన వచ్చు గృహిణిఁదలఁపక చను నో
వినియయ్యకాలమున మ్రోసినదుందుభి మ్రోఁత వెఱఁగుఁజెందిర మర్త్యుల్. 19

సీ. ఎదురుగా ఘీంకార మెసఁగ నేతెంచిన, వెల్లయేనుఁగుఁ జూపు సిల్లనాఁగి
హేషారవంబుతో నెదురైన వెలిమావుఁ, జెఱునవ్వుఁ దఱటులఁ జేసి యాఁగి
పదివేల గుఱ్ఱముల్ పన్నిన రథముతో, నున్న మాతలిని జేసన్న నిలిపి
యభిముఖమ్ముగ వచ్చు నందలంబుల నెల్ల, నోరచూపుల చేత నొత్తిరించి
గీ॥ యరుగు సురపతి కెదురు రానైన వాఁడు కూడఁబోయెడు సాహసికుండు గాని
నాఁడు లేడయ్యెఁ బురిలోన నీడయగుచు, నతని వెన్నాడె సురలక్ష్మి
యంతనంత. 197

సీ॥ ఇదె వచ్చె సురపతి యీమాట గురులతో, జెప్పుమా యనియెకు చిలుకపలుకు
నింద్రుఁడొక్కఁడె కాఁడ, యిల్లాలునని కూడఁ దెలుపుమాయనె కోకిలయెలుంగు
అటఁ బీఠమిడుఁడు ముందిటనర్ఘ్యపాద్యంబు. లరయుఁడీ యనెడి రాయంచగళము
అతిథులెవ్వరో వచ్చిరని తెలిచూపులఁ, దిలకించు మృగమ్మృగీ కలకలంబు
గీ। కళవళము పెట్టఁబాత్రముల్ గట్టిపెట్టి లోనఁజను వారు నర్ఘ్యముల్ పూనువారు
నగుచు సందడిగొనుగురునాశ్రమంబు నెడకు విచ్చేసెనింద్రుఁడయ్యింతితోడ. 198

సీ॥ ఇది యేమిరా యీమునిటు నడిపించెదు, విబుధేంద్రుఁడను వింత విధము వారు
అంతఃకలహ మేమియయ్యెనో సంసృతి, సుఖమద్దిరా యని చూచువారు
వత్తురు పోదురన్వర్థలే కానిట్లు, కనులారఁగనమని గొణుఁగువారు
నేఁడు కాల్నడవచ్చి నాఁడియ్యెడంగల, పనియొక పాటి గదనెడి వారు

సీ॥ నగుమ శిష్యులు దమలోన, నంతలోన బాయులుగదీక్ష నిశ్శబ్దవదనులగుచు
గురుని మన్నన చవిగొన్న యిరువురప్పుడు, వచ్చి యర్ఘ్యంబు గొనుచు
నవ్వాసవుననకు 199

సీ॥ అతిథి సత్కార మొనరించి రధికభక్తి మంత్రతంత్రమ్ములందు నేమఱక వారు
తానయర్చించెనింద్రాణిదగినరీతిఁ దారక కచరఘునరఘుసాత్కారమలర, 200

కం॥ తారను దత్పదముల నిజ, దారనుగని చకితుఁడగుచు దైవతపతియున్
దారపదంబులకెరఁగిన, వారలదీవించియామె వాత్సల్యమునన్. 201

గీ॥ ఎల్లవారికి సేమమాయఁటిరియొద్ద, నేల కాల్నడవచ్చితిరింతదవ్వు
వింతవార్తలులేవుగా వీటిలోనఁగొనుఁడు వీనిని శ్రమఁదీర్చికొనుఁడుముందు 202.

కం॥ అని ఫలములిడిన హరిసుతు, జననీ మాకెల్లసుఖము, సకలధరమ్ముల్
దనబుద్ధి గురులెదీర్పన్, దనమిగిలినపనియుఁగలదె తచ్ఛిష్యునకున్. 203

గీ॥ పరిమాగురులింటనున్నారె యిపుడు, దర్శనము సేయుసమయమా! తల్లియనుచు
నడుగునాలోన నచటఁబ్రత్యక్షమయ్యె, గరుణవర్షించుచూపులసురగురుండు 204

కం॥ సురరాజ్యరత్నమకుటీ, చిరపరిచితమౌళిపీఠిఁ జేరిచెభక్తిన్.
బరిచిత తారాకోమల, కరపీడనధిషణచరణ కమలము సొంతన్ 205

కం॥ విరచిత హారపదపూజా, పరిచయమున్ భావనంబు భసితపరాగ
స్ఫురితము రుద్రాక్షక మధు,కరమగు కరకమలమునను గయికొనియతనిన్ .206

వ. గురుండు తత్సమయ సముచిత భాషణంబుల నమరేశ్వరిని మన్నించి వారల యథోచితా
సనాసీనుల నొనర్చి, నియమిత కార్యంబులొనర్ప నంతే వాసిగణంబులం బనిచి పరిమిత
ప్రాతఃపరిష్కృతుండై సురపరివృఢుం గనుంగొని. 207

క॥ ఏలయ్యనాకలోక, శ్రీలక్షితమైనమోము చిన్నదోలంగా
బ్రాలేయ బిందుహతరుచి, నాళీకమనంగ నమర నాయక చెపుమా, 208

వ. అని శచిం గనుంగొని. 209

క॥ ఈ నాపుత్త్రిక మోమున, నేనాడు విచార మిట్టి దేనెఱుఁగఁ గటా
నీనోట నేమివింటినో, యీనాఁడిది వెఱఁగుగొలిపె నెంతయు మాకున్, 210

ఆ॥వె॥ అలవిగాని శత్రుఁ డావిర్భవించెనో, కాక నీకు నీవికారమేల
యనిన నట్టివార్త యనరాదు వినరాదు, విన్నవింతునొక్క చిన్నమాట. 211

క॥ ఏ నీ త్రిలోకసామ్రాజ్యానుభవంబెల్ల నిక్కమనినమ్మితి నా
కీ నీడఁబోనిమృత్యువు, నాననమున నిలిచియుండు టదిగననైతిన్, 212

క॥ కాలముసృజించు 'బ్రాణులఁ' గాలముహరియించుజగము కాలవశమ్మౌ
కాలమునుగడవఁ ద్రోయం,జాలినవాఁ డొక్కఁడైన జనియించెనొకో, 213

వ మహాత్మా నీయెఱుంగని యర్థంబుగలదె. యయిన విన్నవింతు నవధరింపుము. మర్త్యుల వత్సరమ్ము మాకు నొక్కవాసరమ్మట్టివాసరములు ముప్పదింట నొకనెలయు, వానఁ బండ్రెండింట నొక్క హాయనమ్మును నవి నూఱు చెల్లిన మా యాయువు పరిసమాప్తం బిట్టి మేము పదునల్వురమును మాతో మాయట్టివారు మనువులు. చెల్లిన విధాతకొక్క దినం బీక్రియంబున నతని నూఱేండ్లు నారాయణున కొక్కపగలు. గాగ నతండును దన వర్షశతాంతమ్మునఁ గాలవశుండగు, మర్త్యుల దృష్టికే మమర్త్యుల మగుదుముగాక మా కమర్త్యత్వ మెక్కడిది కావున. 214

క॥ ఈనశ్వరమగు పదమును, గానీ బ్రహ్మత్వపదముగానీ తుదకా
శ్రీనారాయణ పదమును,గానీ వాంఛింపనొల్లఁ గాలవశమ్మున్, 215

*

సీ|| ఈయనిశ్చిత పదవుల సేవరింప, దేనలభియించు ముక్తి బోధింపవయ్య
యజ్ఞమో లేక దానమ్మొయనశనమ్మొ, తీర్థసేవయొ దానిసాధింతునిపుడు 216

ఆ|| వె|| అనివిరక్తి దెలుపు నాతనిమాటల, నాదరించి కనులనల్ల మిగిచి
ధ్యానముద్రనలరె దైవతగురుఁడుని, దాగ్రఘమీనమైన హ్రదము బోలె. 217

కం|| చిఱునగవు కోడి కనుఁగవ, మెఱుఁగులఁ దొలిరాచు మొగులు మెఱవడిపలుకుం
దఱుఁటుగొను నెలుఁగుపోఁవన్, గఱుకుంగొను శాంతరసము గడలుగొనంగా. 218

కం|| ధ్యానమ్ముల దానమ్ముల, మౌనమ్ముల ముక్తిబడయు మాటలుజూటల్
దానిర్మల నిశ్చలతర, మానసపరిపాకమింత మఱువడెనేనిన్. 219

ఆ|| వె|| వినుఁడు లేక జగములిరులుగొన్నట్టుల, నెవనికనులమూత నెల్లజగముఁ
యగునొ యట్టి యీశునరసిన వాఁడయీా, బహుళజననపాశ భంగకరుడు. 220

వ. అపర్యంతరమణీయ గుణాకరుండు, నశేషకల్యాణగుణనిలయుండు, ననాది మలసంశ్లేష విహీనుండు, నౌదార్య వీర్య గాంభీర్య మాధుర్య మకరాలయుండు ననంత మహిముండు నపరిచ్ఛిన్నవైభవుండు, నుత్తరోత్తర భూతోత్తరుండు, నిరుత్తరుండు, ననంతానందసందోహ మకరంద మధువ్రతుండు నాత్మశక్త్యమృతాస్వాదప్రమోదరసికుండు, నశేష విషయామోఘ శుద్ధబుద్ధి విజృంభణుండు, నఖండజగదండ పిండీకరణ పండితుండు, సర్వజగజ్జనకుండు, సర్వమంగళ స్వరూపుండును, విశ్వాధికుండగు రుద్రుండు. 221

కం|| శ్రీనారాయణుఁడాదిగ, నానాప్రాణులసృజించి నానావిద్యా
జ్ఞానమ్మనుగ్రహించుచుఁ, దానెల్లజగమ్ము నడపుఁ దత్తత్క్రియలన్. 222

కం|| పరుఁడై త్రిజగద్గురుడై, హరుఁడిడుభక్తులకునెల్ల నమృతత్వంబున్
స్థిరుఁడై వేదాంతగుహాం, చరుఁడై మునిహృదయనిహిత చరణాబ్జుండై. 223



క॥ విశ్వమ్మతనివశమ్మగు, విశ్వమునకుఁ గాఁడతండు విశ్వే[illegible]నీ
శాశ్వతుమహేశ్వరేశ్వరు, విశ్వంభరు విశ్వమయుని వేఁడుము పుత్రా!......224

క॥ సేవింపుదక్షిణాముఖు, దేవుమహాదేవు నద్వితీయు ననంతున్
భావింపు నీలలోహితు, నీవాంఛితసిద్ధి నంద నేర్తువు పుత్రా! 225

ఆ॥వె॥ అనుడు హర్షపులకితాంగ కదంబుండు, నశ్రుపూర్ణనయనుఁ డార్ద్రహస్తుఁ
డగుచు గురునిపాద మల్లనగ్రహియించి, భక్తిరసముపొంగు పరిఢవింప. 226

క॥ గురుఁడేజననియుజనకుఁడు, గురుఁడేబ్రహ్మయునుహరియు గురుఁడె హరుండున్
గురుఁడేరక్షకుఁడనునుడి, చరితార్థమునాదుపాలఁ జలుపుమహాత్మా. 227

క॥ అనియిట్లు దన్నువేఁడెడు, ననిమిషవిభుఁ గాంచి గురుఁడు ననుకంపమెయిన్
జననఘటాపంచానన, మను శాంభవదీక్షనిచ్చి మోదమెలర్పన్. 228

శా॥ కైశోమ్నా! సురనాథపాశుపత దీక్షన్ మోక్షసామ్రాజ్య ఘం
టాకల్యాణపథమ్ము, జన్మమృతి ఖడ్గవ్యాఘ్రదూరమ్ము, న
స్తోకప్రీతిరసాకరమ్ము, భక్తజనతా తుంగదుఃఖచ్ఛ[illegible]
శోకోన్మాథము, శాంతిపాంథము బుధస్తుత్యమ్మనంబొ[illegible] 229

క॥ సత్యముపాథేయముగా, సత్యవ్రతతీర్థయాత్ర సలిపి [illegible]
సత్యేశ్వరు నర్చింపుము నిత్యపదమ్మబ్బుసుమ్ము నీకననతఁడున్. 230

క॥ సత్యవ్రతనామమ్మన, నత్యాశ్చర్యమ్మనాకు ననుభూతకథా
స్మృత్యుదయమయ్యెనెదియో సత్యవచా! తెలుపుదీని సందర్భమునన్. 231

ఆ॥వె॥ పూర్వజన్మమందుఁ బుధవాసరమ్మునఁ, గాంచిసత్యవిభునిఁ గాంచినాఁడ
వమ్మహేశుఁగొలుచునర్చనా ఫలమొక్కొ, యింద్రపదముగూర్చెనిపుడునీకు. 232

క॥ ఏకద్విత్రిచతుర్వ్యాప్తైకామ్రీశార్చనమ్ము లెలమినొసంగున్
నాకమ్ము సత్యలోకము, వైకుంఠము ముక్తి, భక్తిపరులకుననినన్. 233

క॥ బుధవాసరమునకింతటి, యధికఫలమ్మెట్లు గలిగె నాచార్యయనన్
బుధుఁడిట గ్రహపదమందెను, విధుమౌళియజించి వాని వేడుకయిదియున్. 234

చౌపద॥ అనవిని యిందుగ్రిండాచార్యునకున్
ప్రణతులొనర్చుచు రాజ్యభరమ్మున్
గొన నర్ధించుచు గురుతరభక్తిన్
గొని గురుననుమతిఁ గోమలితోడన్. 235

చౌపద॥ తఁడబడు నడుగుల్ నొడీబడునుడుగుల్
సడలెడుతొడవుల్ సుడిబడుచూపుల్
గడుకొనగురువుల విడిచెడునెడలన్
విడనేరకయును వెడలుచువారల్. 236

చౌపద॥ ఉడుపథమునఁ దారుడుగకచనుచో
నుడు గరగొనిఁ చనువడువు దలిర్పన్
బడిదీరిచి వెంబడిరాయంచల్
నడపెనుదొరలకు నడునడు లెల్లన్. 237

చౌపద॥ తడయని మనములు బడలినతనువులు
విడివడుకొప్పులు ముడివడిచొప్పులు
బెడగుడనంబును వెడఁగుఁదనంబున్
గడలుకొనంగాఁ గడచనునెడలన్. 238



చౌపద॥ కాంచీ హంసీకలకలములు సూ
చించెను వారికిఁ జించెదరింకన్
సంచితభవముల పత్యవ్రతమున్
గాంచుటచేనని కలమధురముగాన్. 239

వ. అట్లు చని. 240

శా॥ కాంచీపట్టణనాయకున్ ద్విజగతీకల్యాణ సంధాయకున్
గాంచెన్వంచిత పంచబాణు గిరి కన్యాభూషితార్థాంగుఁ బూ
జించెన్నిర్జరసార్వభౌముఁడు నుతించెన్మించెఁగామించె న
ర్థించెన్వేదయు సేయు వేయని కృతార్థీభావదానార్థియై. 241

శా॥ దేవుండెవ్వఁడు నీదుముంగల మహాదేవుండు వీవుండఁగా
నేవాఁడీశుఁడు వేరెకీశ్వరుఁడనై యీవుండ నేవారికిన్
నీవాఁడెవ్వఁడు గానివాఁడెవఁడు తండ్రీ నిన్ను నర్థించెదన్
నీవాల్లభ్యముఁజూపు నేళయిదె మన్నింపగదే యీశ్వరా. 242

మ॥ ఎవఁడయ్యా భగవత్పదార్హుఁడగువాఁడీ విశ్వవిశ్వంభరన్
భువనాభీలహాలాహలంబుఁ దినెనో పోనిమ్ము కాలాంతకున్
దవులన్ దన్నెనొ పట్టణ త్రితయమున్ భస్మమ్ము గావించెనో
శివ! నీవొక్కఁడుదక్క నెవ్వనికగున్ జేయుంగ నిక్కార్యముల్. 243

సీ. అభవుండునవ్యయుం డాద్యుండనంతుండు, సత్యస్వరూపుండు శాంతుఁడనియు
విశ్వాధికుఁడువిధి విష్ణుసంభావ్యుండు, కాలకాలుఁడు జగత్కర్తయనియు
అక్షీణదాక్షిణ్య రక్షితసేవకుం డుక్షేంద్రతురగుఁడు త్ర్యక్షుఁడనియు
పరమమునీశ్వర వరహృదయాంభోజ, వికసనాలోకన విభవుఁడనియు

తే॥ నిన్నుఁ బలుకంగఁ జాలని నిగమములును, వాఙ్మనోదూరమహిమానుభావుఁ డనిన
నెంతవాఁడను నేస్తుతియింప నిన్ను, నన్నుఁ దరియింపఁ జేయు ప్రసన్నమూర్తి. 244

ఆ॥ వె॥ ఎన్నికోట్ల జనిమ లెత్తితినో కాని, మెఱుఁగఁ జాలనైతి నింతదాఁక
నెఱిఁగియెఱిఁగి యింక మఱవ నాతరమా నె, నీదుపాదభజన నిటలనేత్ర. 245

కం॥ అని ధ్యానపరవశుండై, కనుమూసిన యంతలోన గంభీరజటా
స్వనదమరధునీనాదము, తనరాక నెఱుంగఁ జేయుతతనాదముగా. 246

ఆ॥ వె॥ వచ్చినిలిచి యేనువచ్చితి లెమ్మింక, నడుగువలయు దాని ననినయంతఁ
గనులవిచ్చి గాంచి గల్యాణవిగ్రహు, బాలచంద్రధరునిఁ బ్రణతుఁ డగుచు. 247

ఆ॥ వె॥ వివిధజన్మములను వేసరియున్నాఁడ, నీకటాక్షమునకుఁ గాకమున్న
నేఁడు కర్మబంధనిర్మూలనము సేసి, యభవ యొసఁగు నాకు నమృతపదము. 248

కం॥ హరి యిట్లు వేడ నపుడా, వరమిడి యీక్షేత్ర మింకఁ బౌరందరభా
సురనామమంచు ననంచును, గరుణించి జగద్గురుండు గన్పడఁ డయ్యెన్. 249

కం॥ కామాక్షీ కరుణాప్తీ, తామృత సిద్ధార్థయైన యమరేశ్వరితోఁ
దా మిన్నందుచు హరినిజ, ధామంబున కేఁగె సురవితానము పొగడన్. 250

కం॥ ఇది పరమము గోప్యంబగు, నిది సిద్ధిద మఖిలశుభసమీహిత తీర్థం
బిది యీపౌరందరకథఁ జదివిన వినఁగనినఁ గలుగు సకలార్థమ్ముల్. 251

వ. అనిన నప్పరమమునీంద్రులా సూతుం గనుంగొని ప్రముదితాంతఃకరణంబుల నిట్లనిరి. 252

*

ఉ॥ నిస్తులితాత్మగౌరవ తృణీకృత భాగ్య! కవీంద్రదేశిక
పరిస్తుతభాగ్య! సంస్తుతిపరాఙ్ముఖ వాఙ్మయభోగి భోగిభూ
షస్తవసంతతప్రవణ! శస్తయశస్తుహినాంశుబింబ! తే
జస్తరుణేందుమండన! వశంవదభాషణ! సత్యభూషణా! ॥ 253

కం॥ శ్రీశైల భ్రమరాంబా ధీశకృపాజాత! సాహితీ పరమేశా
యీశార్చన పరతంత్రా, యాశాంతయశస్క! మల్లికార్జునదేవా! ॥ 254

మాలిని॥ హరచరణభుజిష్యా! అల్లమారాధ్యశిష్యా!
సురుచిరమృదుపద్యా! సూరిహృద్యాత్మవిద్యా!
పరమగుణగరిష్ఠా! భవ్యతేజోవరిష్ఠా!
చిరతర నిజకీర్తీ! శిష్యసౌభాగ్యమూర్తీ! 255

మ॥ వరదాచార్య గురుప్రవర్ధిత జగత్ప్రఖ్యాత విద్యాలయాం
తర విద్వత్పద పద్మభృంగ మధురధ్వాన్యాత్మ కాంచీపురే
శ్వర మాహాత్మ్యమునందునొక్క ప్రథమమాశ్వాసంబు దీనిన్మహే
శ్వరుఁడా సూర్యసుధాకరమ్ముగను శశ్వత్ప్రీతిఁ బాలించుతన్. 256

శివమ్.



# శ్రీ కాంచీఖండము
## రెండవ ఆశ్వాసము.

శ్రీ గుమ్మలూరి సంగమ వాగీశ న్యాయ సార్వభౌమ హృదంత
ర్భాగాస్వామీ! స్వామీ! భోగేశ్వర జనక! విపుల పుణ్యచరిత్రా! 1

—: కాంచికిఁ గరిగిరియను పేరు వచ్చుట :—

వినవయ్య కామహర్షణి మునివర కాంచీ మహాత్మ్యమును విన వినఁగాఁ
దనివోందని మా మనములఁ, దనియింపవె నీ మృదూక్తిధారల ననినన్. 2

వ. తొల్లి మేధావి ప్రసిద్ధుండగు నారాయణుండు హరవామాంగ సంజాతుండై దివ్యవర్ష
సహస్రంబు లీశ్వరు వహించిన, నతఁడు సంతుష్టుండై వత్సా నీయభీష్టంబు వేఁడు మన
వుడు, నతండు దేవా! యీవచ్చు కల్పంబునకు మేఘవాహనసంజ్ఞననుగ్రహింపు మందు
సబ్రహ్మకంబగు జగంబు సృజింపదలఁతు ననుమతింపవే యనిన, నీవు కాంచీనగరంబున
నన్ను యజింపు మందు నీయిష్టార్థంబు సిద్ధించుననిన. నవ్విష్ణుండు పౌరందరమ్మున కరిగి
యచ్చటఁ బుణ్యకోటియను నొక్క సరోవరంబు నిర్మించి నియతుండై ప్రతిదినంబు
సహస్రపత్రంబుల నీశ్వరు నర్చించు నెడల. 3

ఏపూర్వజన్మవాసన, యో! పురహరు పూజకొఱకు నుడుగక రేపుల్
మాపులు డడవులఁబట్టియు, శ్రీపతికోకసింధురమ్ము స్థిరతరభక్తిన్. 4

కనకకరవీరపున్నా, గనమేరూన్మత్త కర్ణికారాశోకా
ర్కన వీనజాతికుసుమములు, దనరంగాఁ దులసిబిల్వదళములతోడన్. 5

మ॥ దిననాథారుణకాంతి సంతతుల కర్ఘన్ స్వాగతంబిచ్చి యీ
యనివారిన్ నిజసౌఖ్యశాయనిక హంసాలాపమాలించి మేల్
కనువానిన్ మధుపశ్యతోహార కరాఘాతంబు శంకించు వా
నిన్ దెచ్చెన్ గపిగంపఁ గంపనము దంతిస్వామి పద్మమ్ములన్. 6

కం॥ తానెచటనుండి వచ్చెనొ యేనాఁడుఁ దపియపూజకించుక యేనిన్
గానీదుకాలహరణం బేనుంగే పుణ్యమహిమ నెనసెనొ కానీ. 7

మ॥ ఒకనాఁడమ్మదభద్రసింధురము దానున్మాదియై లేక యు
త్సుకియై కాని కొలంకులన్ గలఁచుచుం, దుర్వారతుండాహతిన్
వికటాంఘ్రిస్ఫురదుగ్రతాండవములన్ వేధించెఁ బాథోంతర
ప్రకటగ్రాహఝషాళి కుళీరచయముల్ బ్రాణంబులల్లాడఁగన్, 8

మ॥ అది సైరింపక నక్రమొక్కఁడు నిజాహంకారమేపారఁ ద
త్పదమున్ ఘోరనిశాత దంష్ట్రికల చేఁబట్టెం గజేంద్రుండు భీ
ప్రదఘీంకారవిజృంభితుండయి సరఃపారంబుఁ జేరంగ లా
గెఁద దీయోద్ధతి సాగనీయదదియుం గ్రిందయ్యె మీఁదై గడున్. 9

శా॥ తుండమ్మార్చును వాలమార్చును వడిన్ దుర్దాంత పాదత్రయిన్
గండల్వాయఁగఁ ద్రొక్కు వెక్కసపడున్ గాలూఁద నుంకించు న
క్కొండబోని గజంబు డిల్లిపడి యాక్రోశింపఁగా జీలుగుం
బెండుం బోలికఁ దేల్చి యార్చుఁ గొలనన్ బెల్లుబ్బియానక్రమున్. 10

కం॥ జలచరము బారిఁబడియా, జలప్రియము చిక్కువడియెఁ జాతుర్య పదో
జ్జ్వలకవితకు కవిచేఁబలెఁ, గలఁగెనిరంకుశుఁడు రాజుగల రాజ్యమటుల్. 11

మ॥ శివపూజావసరమ్మునయ్యె హరికిన్ సేకూర్చు పుష్పాళి నే
డెవఁడందిత్తురొ యేమిసేతునొ యిదినాకేనాటిప్రారబ్ధమో
యవురా కాల్వడదె త త్తొఱ్ఱిక్కువడియుం బ్రాణంబు లూగించె నీ
చవనాటంబిదియంచు దంతివగచున్ స్వాంతమ్ము ధ్వాంతమ్ముగన్. 12

మ॥ శరణేచ్ఛమ్ములనెల్లఁ దీర్చికొనియో కామేశ్వరుంగొల్వఁగా
హరియే తెంచి యథాప్రకారముగ వేదండమ్ము నేఁడేలకో
యరుదేదింతకు మున్నొకప్పుడును దానాలస్యముం జేయదే
సరిలేవచ్చెడు నింతనంతననుచున్ జర్చించి యర్చాత్వరన్. 13

కం॥ పంచాక్షరీగుహాంతర, సంచారవినోది జననసామజభేదిన్
పంచాస్యు నిజహృదంతర, సంచారినొనర్చి మఱచె సర్వజగమ్మున్. 14

కం॥ ఆవేళనగ్గజేంద్రుఁడు వేవిధములఁ బోరిపోరి విసివి విసివియున్
లా వేదినక్రబంధము, తోఁకింగాలేకమనసు తుకతుకలాడన్. 15

కం॥ ఎన్నాళ్లనుండివచ్చెద, మున్నేనక్రింబు గిక్రిమున్ గనఁబడదే
యిన్నిచునొంపనెట్లగు, నన్నారాయణుని పేర్మి యుబ్బకయున్నన్. 16

కం॥ అని చింతించుచునొక్కట, ననిమిషవల్లభునిఁ బదములంటఁగఁద్రొక్కన్
తనురంధ్రమ్ముల వెలువడు, కినుకయనన్నెత్తురొరలఁ గెరలియురవడిన్. 17

శా॥ నొకంబోనిమహా గజమ్మును జలాంతర్గామి దంష్ట్రిద్వయీ
స్వీకారమ్మున ముంచియెత్తు నెడలన్ భీతిల్లి యాఘాకనున్
జీకాకంబడి తెల్లమోమిడి కనున్ సిగ్గిల్లి నల్దిక్కులం
దాకృష్టమ్ములు దాని నీడలనఁగా నల్లాడెదిఙ్నాగముల్. 18

కం॥ ఉదయాస్తమయము లెఱుఁగని, విదిత స్వారాజ్య మేలువీరుఁడు నింద్రిం
డిది గడు ప్రమాదమనుచున్, బదినూఱులుఁ గనులు తెఱచి భరపడిచూచెన్. 19

కం॥ హుంకారమ్ములడంగెను ఘీంకారమ్ములునుదగ్గెఁ గ్రేవలభృంగీ
ఝుంకారజాతమగున, య్యోంకారమునందు మనసునుంచి గజమ్మున్. 20

ఉ॥ ఓహరిసాహరిన్ బెనఁగియున్ జయమందుట దుర్లభంబు నా
కో హరి! యాదిమత్స్యమగునో యిదియయ్యది కాదయేని యీ
సాహసమీ బలంబు బృథుశౌర్యము సారము నెందుఁగల్గెడిన్
శ్రీహరి కావవే చరణసేవకు నీమకరప్రపీడితున్. 21

మ॥ జగతీరక్షణబద్ధకంకణునిగా సత్త్వప్రధానాత్మగా
నిగమప్రస్తుతుగా నిరంజనునిగా నిర్వ్యాజవాత్సల్యగా
భగవద్వాచ్యునిగాఁ బరాత్పరునిగా బ్రహ్మాండసంఘాతగాఁ
దగ మౌనీశ్వరులందు రెందునెవనిన్ ధ్యానింతు నయ్యీశ్వరున్. 22

మ॥ చిఱుచీకట్లు గ్రసించె నేత్రముల, నొచ్చెన్ మేను హెచ్చెన్ శ్రమం
బొరసెన్ గాలుకలంగె బుద్ధివెడ నిట్టూర్పుల్ చెలంగెన్ శ్రుతుల్
విరిసెన్ గాలము దాపురించె నెపుడో విశ్వేశ రక్షించుటల్
శరణంటిం దొరవంటి నీపదము లివ్వంగొంటిఁ బాలింపవే. 23

శా॥ దైవంబీవని యార్యులందురు దయాదాక్షిణ్యముల్ నీమదిన్
లేవా! నాపదునార్తి సుంతవినఁగా లేవా! జగంబేలఁగా
లేవా! తొల్లిటి వేనిపుణ్యఫలముల్ లేవా! ననుగ్గావఁగా!
నీవే లేవనిపింతు వేటికిటు తండ్రీ విశ్వసంరక్షకా! 24

శా॥ నీపాదమ్ముల భజించితిన్ సతము నే నీగాథలాలించితిన్
నీపై భారము వేసితిన్ మనమున న్నీరూపె భావించితిన్
నీపాలం బడియుంటిఁ జిక్కితి తుదన్నీరాట దంష్ట్రాహతిన్
నీపూజార్థమె దేహమిత్తునిదె దీనిం గొమ్ము విశ్వేశ్వరా! 25

శా॥ నీకల్యాణ కథామృతాంబుధి మునున్నిర్వాణముల్ గాంచితిన్
నీకై ప్రాణములిచ్చికొందు నిదిగో నిర్వాణసామ్రాజ్యమున్
నాకన్నన్ ఘనుఁడైన భక్తు నెవనిన్ గల్పింపఁగాఁ బోకుమీ
నాకున్ జన్మము నీకు మిచ్చునెడలన్ బాలింపు నీభక్తుగా. 26

కం॥ ఆలింతువో పాలింతువో, చాలింతువొ నన్నుఁ గొల్చు సద్భక్తులలో
లాలింతువో తేలింతువో, యేలింతువొ మోక్షలక్ష్మి నీశ్వర నన్నున్. 27

శా॥ పాలింపంగదె మందబుద్ధిని నన్ బ్రహ్మాండభాండోదరా
ఆలింపంగదె నామొఱన్ శ్రుతివచోవ్యాపారదూరస్థితా
లాలింపంగదవయ్య నామనవి కల్యాణస్వరూపా ప్రభూ
నీలో నన్నును జేర్చి కావఁగదవే నీవాడ నన్నేలవే. 28

ఆ॥వె॥ అనుచు నాగజమ్ము హరి నిట్లు ప్రార్థించి, బడలి బడలి బలము సడలి సడలి
విషయవాంఛలెల్ల విడివడ విడివడ, నెడఁదయీశుఁ జేర నొడలు మఱచె. 29

శా॥ ఆ యాక్రోశము వాయులీనమగుచున్ వ్యాపించి విశ్వమ్మునం
దాయబ్జాక్షు శ్రవోగుహాంతరము చాయన్ జొచ్చి మార్మ్రోసినన్
చేయుం బూను శివార్చనాసమయముం జెల్లింతునా లేక నేఁ
డీ నక్రిం బడి మ్రగ్గు నిగ్గజము నిట్లేపోయి రక్షింతునా. 30

మ॥ అనియూహించి శివార్చనాఘటితమర్యాదన్ విలంఘింపఁగా
డనుచున్ దన్నుభజించు నాగవిభుని య్యాలించి పాలింపఁగా
మనముత్కంఠితమూచునుండ శివునిన్ జాతేందుమౌళిన్ గృపా
వనధిన్ భక్తియథావిధిన్ సకలసేవన్ గొల్చి గోవిందుఁడున్. 31

కం॥ కమలాక్షనామధేయము సమర్థమగుఁగాకయంచు సమధికభక్తిన్
గమలములఁబోనికన్నుల, సమర్పణముసేసె హరుని చరణములందున్. 32

కం॥ మెచ్చితిమెచ్చితినిదిగో, వచ్చితినీసాహసంబు వలవదుమిఁకులన్
నచ్చితివనిశివుఁడంటిన, వచ్చెన్ హరికపుడ పుష్పవన్నయసంబున్. 33

ఉ॥ చక్రివిభూషణుండయిన శంకరుఁడంత జలంధరచ్ఛిదా
వక్రపరాక్రమక్రమత వాడిమిఁగాంచినయొక్క చక్ర మా
యక్రము నక్రముం దునుముమా! గజనాథునిఁ గావుమంచు నా
చక్రికినిచ్చె దానిఁగొని శార్ఙ్గి సముజ్జ్వల విక్రమంబునన్. 34

శా॥ దుశ్చారిత్రమదాంధు భక్తగజనాథుంబట్టి పల్లార్చునా
వాశ్చారాధముఁ ద్రుంచుమందఁ బనుపన్ వైకుంఠుఁ డుద్యద్గతిన్
పాశ్చాత్యారుణబింబమోయనఁగఁ దద్వార్మధ్యముంజొచ్చి య
త్యాశ్చర్యమ్ముగ వ్రేల్మిడిం దునిమెనంతం జక్రమా నక్రమున్. 35

సీ॥ కొండనెత్తినవాఁడు కొండనొత్తినవాఁడు, కుండలిమేనిపై నుండువాఁడు
బాణురాచినవాఁడు బాణుగాచినవాఁడు, తనమామయింటిలోఁ దనరువాఁడు
నొడలునల్లనివాఁడు నొడలుతెల్లనివాఁడు, తనజాయఁదనమేనఁ దాల్చువాఁడు
మదనుబెంచినవాఁడు మదనుద్రుంచినవాఁడు, వెలిడాలుతేజిపై వెలయువాఁడు

గీ॥ భిన్నరూపంబులందియభిన్నులయిన, హరియుహరుఁడునుగజరాజునార్తిఁదలఁగి
యంజనాచలహిమశైలమంజుకాంతి, పూరములుచాలుకొలిపెడిమూర్తులలర 36

కం॥ ఎనుఁగం గన్నప్రీతి నెడఁ, దదీయదివ్యప్రసాద ధన్యుమ్మగు న
మ్మదగజము నక్రిబంధము, విడిలించిన పరమవిభులవినుతింతునిటుల్. 37

సీ. నాగు మెట్టితివీవు నాగుఁ జుట్టితివీవు, శరణయ్యమీపాద జలజములకు
శ్రీధరించితివీవు శ్రీభరించితివీవు, శరణయ్యమీపాద జలజములకు
శరధిఁ గట్టితివీవు శరధిఁ బట్టితివీవు, శరణయ్యమీపాద జలజములకు
గంగఁ గంటివినీవు గంగఁ గొంటివినీవు, శరణయ్యమీపాద జలజములకు

గీ॥ హరమహాదేవశంకర శరణుశరణు. హరిమురారాతినరసింహ శరణుశరణు
హరపరాత్పరపురహర శరణుశరణు, శరణుశరణయ్యననుఁగన్న జనకులార. 38

కం॥ అనునెడల నగ్గజేంద్రుని, ననుకంపారసతరంగి తామరతటి నీ
వినిమయకటాక్షరేఖలఁ, గనుఁగొనుహరుఁజూచి హరియుఁగద్గదగళుఁడై. 39

శా॥ కంఠంబందున నీలనీలమగుచుక్ గంధేభచర్మాంకమై
కుంతీభూతతమిస్రమై పరమమై గోరాజవాహంబునై
కంత్రేరావనదీక్షమై, వెలుఁగు నీకల్యాణతేజంబు ను
త్కంఠంగొల్చెద మమ్ముఁబ్రోవఁగదె మాదైవంబ కాంచీశ్వరా. 40

మ॥ మదమత్తాకృతి చంచలాంగకము నిర్మర్యాదవిధ్వంసితా
భ్యుదయాపావక పుణ్యకర్మకదళీకోన్మాదవృత్తమ్ము భీ
ప్రద సంచారకధావితాఖిల సుమృగ్వారంబునౌ మన్మనో
మదహస్తీంద్రము నెక్కి త్రిమ్మరిననుం బాలింపు విశ్వేశ్వరా. 41

శా॥ ఓంకారాద్రిగుహానివాసము శరజ్జ్యోత్స్నాతిశుభ్రాకృతి చంద్రికా
శంకాకారి సటాసమంచితము పాస్తవ్యాఘ్రిగంధేభమున్
పంకధ్వంసము పాలితామరము నా పంచాస్యమున్నిన్ను నా
శంకామార్గము డించి ముక్తి నిడ నశ్రాంతమ్ము సేవించెదన్. 42

సీ. పశువులమన్నలు పశుపతీ నను మున్న, నిమ్ముగా నమ్మగా నేల లేదె
ప్రకృతి నన్ బాలించు పరమమోహినివన్న, నింపు రాణింప మన్నింప లేదె
నారాయణీరూప ధారిణివన్న మేన, సగమిచ్చి తనమెచ్చు పడగ లేదె
చరణసేవకుండంచు గరుణించి యే వేళ, బని వేసముల వోన మనుప లేదె

గీ॥ నేడు హరిం గాచి కరిం గాచి నీదు భక్త, వత్సలత్వంబు చాటవే వరద వరద
వరదయూళుతం బలుమారులరసి యరసి పేర్మి నీపాటి నను జేయ వే మహాత్మ. 43

కం॥ వరదానవహర వరదా, వరదానవిశారదా! విపన్నగ వరదా
వరదాంతహృదయభృంగీ, వర దాసజనప్రసన్న వారణవరదా. 44

కం॥ హరియిట్లు పలువిధమ్ముల వరదా యని తనను దెలుప వరమొండ వగుమీ
హరి నీవు ననుచు నరుండా, కరికిని మోక్షమ్ము నొసంగి కరుణామయుడై. 45

కం॥ కరియున్న గిరియు నీపయిం, గరిగిరియనం బరంగుం గాక కల్పాంతమ్ముల్
నిరతము భక్తులం బ్రోచుచు, హరి నీవిట వరదరాజ వగుమని పలికెన్. 46

కం॥ కరియును హరియును దమతమ, చిరవాంఛితసిద్ధి యుపుడు చెందిరి గానన్
పరమమగు భక్తి కెంతను, బురుడగునే తపము గిపము మునివరులారా. 47



# విఘ్నేశ్వరుఁడు వికటచక్ర వినాయకుఁడగుట.

---

కం॥ గజదైత్యపీడితమ్ములు, త్రిజగమ్ములునొక్కపెట్టఁ ద్రిజగద్గురుఁ జే
రి జగత్క్షోభము నుడువఁగ నదె జగద్వల్లభయటంచు నెంతయు వేడన్. 48

శా॥ ఓంకారమ్మన వారలందనిపియా యోంకారసింహాసనా
లంకారుండగు శంకరుండు ప్రణయోల్లాసంబునం జూచె నా
యోంకారమ్మనుదానఁబుట్టెను మహాహాత్యుగ్రుండు శాంతుండు దా
ఘీంకారించుచు దంతివక్త్రుఁ డొకఁ డక్షీణ ప్రభావంబునన్. 49

ఉ॥ పుట్టుచునాతఁ డీశువనుపుంగొని యంతజగమ్మ బాధలన్
బెట్టెడి రాక్షసాధముని వీటికిఁబోయి, నయమ్మ శ్రేయమున్
మొట్టవచించినన్వినని మోఱకనయ్యసురన్ దురమ్మదన్
బిట్టుగలంచియాడి, విసివించినవించిన యుల్కపెంపునన్. 50

శా॥ తుండాతుండి రదారదిప్రముఖమా దుర్దాంతయుద్ధమ్ములన్
జెండాడంబడియుం గజాసురుఁడు శిక్షింపంగరాకున్న చోఁ
జండక్రోధమునన్ రయోద్ధృత రదస్ఫారైకఘాతమ్మునన్
దంగ్రాహిపురమ్ముఁ జేర్చెనసురన్ దంతానళాస్యుండొగిన్. 51

చం॥ అసురుఁడు మూషకమ్మగుచు నాగజవక్త్రు భజించె దేవతల్
కుసుమపువానలన్ గురిసి కోయనియార్చుచు నాడిరప్సరో
విసరబహుప్రకారకల విస్ఫుటమంజుసినాదమాధురీ
రసములుచిప్పిపెక్కె భువనరంజకుఁడా వెనకమ్ము సన్నిధిన్. 52

కం॥ నటరాజనందనుండట, నటించె లంబోదరుండు, నగియెను శశి య
ప్పటి వికటనృత్తమునకా, కుటిలునిగని విఘ్నవిభుఁడు కోపముతోడన్. 53

మ॥ అపనిందల్ జనియించు నిక్కనినచో నంచా శశిన్ దిట్టినన్
గృపమై నీశుఁడువచ్చి వానినిఁ జతుర్థిం జూచినం గల్గు న
య్యపనిందల్ ధ్రువమవ్వియుక్ దొలఁగుఁగా శాలింపనీగాథలీ
కృపణుం బ్రోవుమటంచు వానికిఁ దదంగీకార మప్పించుమమన్. 54

శా॥ ఆ విక్రాంతుని విఘ్నముల్ మొనవుమయ్యా యంచు శాసించి పైఁ
గావించెన్ బ్రమథాధి రాజ్యపదవీ కల్యాణసేకంబు నా
దేవున్ విఘ్నవినాయకుండనుచుఁ గీర్తించెక్ జగమ్మెల్లఁ ద
త్సేవాతత్పరమాచు వానిని యజించెం జించెఁ బాపౌఘముల్. 55

గీ॥ అష్టసిద్ధులు వరియించె నతని నతఁడు, ప్రాదిపూజ్యుండు విశ్వ విశ్వమునకతని
మహిమలత్యద్భుతమ్ములా మహితుఁడొక్క, వేళవిచ్చేసి సాగర వేళయందు, 56

శా॥ గండూషించెను సాగరాంబువుల విఘ్నస్వామి క్రీడార్థ మా
చండా వేగమునన్ బయోధిశ యనాంచన్నాభి పద్మమ్ము నం
దుండన్ లేక చలించె ధాతసిరి యుబ్బూగెన్ ఫణిస్వామి వే
రొండయ్యెన్ గరుడుండు నిల్చె నెటులో యూఁగాడి తూఁగాడుచున్. 57

సీ॥ వింతయిదేమంచు విష్ణుండు పరికింపఁ, బాంచజన్యమదొండు వలననుండి
ఘోషింపవిని గడు రోషించి దనచక్ర, మావైపునకు వేయ నదియునంత
వికటమై ధ్వనియింప విని యుల్కిపడిలేచి, యాసన్వుడినిబట్టి యచటుచేరి
శంఖమ్మునొత్తుచుఁ జక్రమ్ము ద్రిప్పెడి, విఘ్నేశుఁ గనుగొని విస్మితుఁడయి

గీ॥ దక్షిణావర్త విఘ్నేశ! దంతివదన, వికటచక్రవినాయకా విఘ్ననన్నుఁ
బేర్మి మన్నింపవేయని పెక్కువిధుల, నతనినర్చింపదయపుట్టి యాతఁడనియె. 58

కం॥ ఈచక్రము నీశంఖము, నా చేతికి ఘాటికాటునా! మా జనకుల్
నీచరితమెచ్చి యిచ్చిరి నీచే నివి వీనిచేత నీవును మెఱయన్. 59

కం॥ కావున నీవధరింపుము కావింపుము లోకరక్ష, కదరి భటవనీ
దావంబవగుచు వెలయుము, పావన శివభక్తిభరిత భవ్యచరిత్రా. 60

చం॥ అనిన మహాప్రసాదమని యవ్విభుఁగాంచిఁ బ్రపత్తిఁగొల్చియా
యనితర దుర్గ్రహంబులగు నట్టి సుదర్శన పాంచజన్యముల్
గొని యలవిఘ్ననాయకుని కూరిమిఁ బేరిమిఁజేసి గెల్చెఁ బె
క్కనిమిష వైరికోటుల సురారి యనన్నుతిఁగాంచి వెన్నుఁడున్. 61

కం॥ సాధకములు ముక్తికిని,ర్బాధకములు భక్తతతికి బహుపాపవనీ
మాధకములుశోధకములు, బోధకములునగుచు వెలయుఁబురహరుచరితల్. 62

కం॥ చిత్రములు దురితబంధల, విచిత్రమ్ములు పాత్రములు పవిత్రములు జను
ర్గాత్రమ్ములు శివదేవు చరిత్రమ్ములు భక్తజన పరిత్రాణమ్ముల్. 63

కం॥ బ్రహ్మక్షేత్రమ్మగు నది, బ్రహ్మయు యజ్ఞమ్ముసేయ వరియించినదా
బ్రాహ్మణి యనెడి సూతుని, బ్రహ్మోపాఖ్యాన మిపుడు వచియింపగదే. 64

కం॥ అని మునులు వేడ సూతుం, డనఘులు మున్మూర్తులకును నావాసమ్మై
పెనుపొందు కాంచిమహిమను, వినిపించెద నేర్చినటుల వినుఁడీయనుచున్. 65



# సరస్వతీ బ్రహ్మల వివాదము.

క॥ శ్రీకరమై నిగమసరో, జాకరమై పూని రాజహంసాకరమై
లోకపితామహపాలిత లోకమ్మై వెలయు సత్యలోకమునందున్. 66

మ॥ సకల స్థావరజంగమాత్మక జగజ్జాలంబు సేవింపఁగా
నొకనాఁ డంబుజభర్మపీఠమునఁ దానొడ్డోలగంబుండి లో
క కథాధోరణిఁ దారతమ్యముల వక్కాణించుచున్ బ్రహ్మ యే
మి కళన్ బల్కెను వాణికన్నఁ గడు లక్ష్మీదేవి యన్మాటలన్. 67

క॥ ఆమాటలు ముగిసెనో లేదో మొగములువాంచె విమల దుర్వార తపో
ధీమహితాఖిల విద్యా, ధామములగు నమరసిద్ధ తాపసగణముల్. 68

సీ. తనవేయి పడగలు ధరణికిందికి వాలెఁ, ఫణిరాజు సన్మహాభాష్యకర్త
తలవాల్చి మౌనియై ధరణికిందికిడాఁగఁ, జనెఁ గపిలుఁడు యోగశాస్త్రకర్త
మహతి పలుకమిఁజేసి మతిచెడి నారదుం, డఖిల లోకమ్ముల యందుఁదిరిగెఁ
తనదైవత గురు పదమ్మునుకోసి యా, సురగురుండెచటనో సురుఁగ నరిగె
గీ॥ గౌరి కోపించె శంకరుండౌరయనియె, నగియె విష్ణుండు లక్ష్మి సంతసమునందె
భానుబింబముగడుఁగళాహీనమయ్యె, నఖిలజగంబునుజడమయంబయ్యెనంత. 69

క॥ కుటిలనటద్భ్రుకుటి తట, నిటల పటుప్రణయకోపనిష్ఠుర తాప
స్ఫుటచటుల కటుకటాక్ష, చ్ఛటలంబరఁగించి వాణి జలజాసనుపై. 70

క॥ నదులందునైన నాకు,న్నదియే ఘనతాపదంబనన్విధి నగుచున్
నదులందు ఘనత గంగా,నదియుండఁగ నీకుఁగలుగునా! చెలి యనినన్. 71

క॥ నేనిచ్చిన విద్యలచేఁ, దానింతటి పేరుగాంచి తప్పక నన్నున్
మానించుటకును బదులవమానించునె నాథుఁడనుచు మన మెఱియంగా. 72

క॥ తలలోని నాల్కపతి కని, కలజగములు పొగడఁ బేరుగాంచిన నన్నున్
నలు వెంత కటికమనసో, యలుసుగములు పలుకు లిట్టులాడునె యకటా. 73

క॥ తనమాటబడిని నడచుచు, వనితయు దన్నెంత గొలిచి వలచిన యేనిన్
మనమీరని చనవీయని, మనవిని విననట్టిపతిని మన్నించు టెటుల్. 74

క॥ కానిమ్ము చూతమీతని, నానావిధ సృష్టిలోన నా తోలగుటచే
నైనట్టిగుణము దోషము. తానై యపుడేమి చేయుఁదలచునో యరుదుగన్.75

క॥ మీ మెచ్చని యీనాతో, సామీ! కాపురము సేయఁ జాలరటంచున్
మైమెఱఁగెఁ బద్మగర్భుని, భామినియు సరస్వతీ ప్రవాహమునందున్. 76

వ. అంత. 77

శా॥ లోకుల్మత్తులు సంపదంధులు జడుల్ లుబ్ధాగ్రణుల్ దుష్పద
స్వీకారాదిక గర్వితుల్ కులవధూ విద్రోహకుల్ వంచకుల్
లోకఘ్నుల్ పితృమాతృ సోదర సతీలుంటాకులున్ దేశ గో
లోక ద్రోహులునై కలంచి రొకటన్ లోకమ్ములు న్మత్తులై. 78

సీ. పండితుం డనినచో పరిభవించు టెగాని, రప్పించి మన్నించు రాజు లేఁడు
కవియన్నచోఁ దిరస్కరించు టేగాని, విని గౌరవించెడి విభుఁడు లేఁడు
గాయకుండనఁ దలకాయ ద్రిప్పుటెగాని, యోగాని యిచ్చుట యెఱుఁగఁ డెవఁడు
సత్యమహింసయు శాంతమ్ము దాంతమ్ము, సకలధర్మమ్ములు వికలమయ్యె
తే॥ తనదుసృష్టినిగనుఁగొను ధాతకపుడు. వెఱఁగుపాటయ్యెఁ గృత్రిమవిధులు పెరిగి
సృష్టికెల్లను బ్రతిసృష్టి చెలఁగికలఁచె, భారతీవిరహితము నా బ్రహ్మమనము.79

కం॥ గుసగుసలువోకగానీ పొసఁగం బలుకంగఁజాలు బుధుఁడొక్కఁడు లేఁ
డు సమీక్ష చేసి చూచినఁ, బసులే మానవులకన్న బాగనిపించెన్. 80

కం॥ విజ్ఞానము విజ్ఞానము, విజ్ఞానముగోలతప్ప విశ్వంభరలో
విజ్ఞాని యొకఁడు గలుగం, డజ్ఞుఁడె యాకాలమందుఁ బ్రాజ్ఞుండయ్యెన్. 81

గీ॥ అర్థమార్జింపఁ దలకొని యర్థమిచ్చి కృతకవిద్యలనేర్చి భారతిని విలిచి
పండితమ్మన్యులెల్లెడఁ బ్రబలితుదకుఁ. దాఱుమాఱుగఁ జేసిరి ధర్మములను. 82

గీ॥ తెల్లమొగముల వైచెడు దేబెవెల్ల, సార్వభౌములు నాఁడు గసాయివాఁడె
మంత్రి యక్షరశూన్యుఁడే తంత్రకర్త, యయ్యెనన్యాయవాదిన్యాయాధికారి. 83

గీ॥ ప్రజలరక్తము పీల్చెడు వాఁడు ఱేఁడు, వేషములునేర్చువాఁడెపో పెద్దవాఁడు
వడ్డివ్యాపారములవాఁడెదొడ్డవాఁడు, ధనముగలవానిదాసులు జనములెల్ల. 84

కం॥ ధనహీనుఁడు గుణహీనుఁడు, ధనవంతుఁడు పుణ్యగుణ నిధానమటంచున్
ధనమూలమిదంబని జగ,త్తను వాదము ప్రబలి ప్రజల నలజడిపెట్టెన్. 85

గీ॥ ఐకమత్యము లేదు విద్యానురక్తి, బోధముహుళక్కి గర్వము పుట్టెఁడంత
ధర్మరక్షణకోఱకు నుత్పన్నమైన, యాయుధమ్ములు ధర్మమ్ము నడఁచెనాఁడు. 86

వ. ఇట్లు ధనప్రధానతను విద్యావిహీనతను బుట్టిన జగద్విప్లవంబుఁ గని చింతించి మహా
మునులొక్కనాఁడు గుమిగూడి యవ్విప్లవంబు నడుప సనుకట్టి సత్యలోకంబునకుం జని
సముచితంబుగాఁ గమలాసను దర్శించి. 87

కం॥ గృహలక్ష్మిలేని గృహమై, సహకారలతా విరహిత సాలమునయి దా
నహములను గడపెడు పితామహు నుద్బోధింప నతఁడు మానులతోడన్. 88

కం॥ నిజజనకుఁడయిన వెన్నునిఁ, ద్రిజగత్పాలకుని శైవదీక్షాగురుఁ జే
రఁజనుచు ననఘా యిపుడీ, గజిబిజి నణఁగించి జగము గావవెయనినన్. 89

కం॥ కాంచికిజని జన్నముగా.వించిన నీకలఁక దొలఁగు విద్యాసతి సే
వించు నిను జగమునంతట, నంచితముగఁ బూర్వరీతినగును గుమారా. 90

కం॥ సావిత్రి సూర్యనందిన, నీ వేళఁ బరిగ్రహించి యిదిసేయుమనం
గా వల్లెయనుచు నదియటు, గావించి యతండు క్రతువు గావించునెడన్. 91

సీ. రక్కసులొక కొంద ఱక్కజంబుగ ముని.వేషముల్ ధరియించి వినతులగుచుఁ
జేరి భారతిమ్రొక్కి యూర యేమనితల్లి, చెప్పవారము మేము సిగ్గులేక
విధి యెంతపనిచేసె విడిచినిన్నటుమీఁద, సావిత్రియనియెడి చానఁగూడి
కావించుచున్నాఁడు కాంచిలోయజ్ఞమ్ము, నేము నచటికేగ నెవరుగూడ

గీ॥ చూచిచూడరు విధి తలయూచిమెచ్చ, భారతీయుల నెవ్వరిఁ జీరవలదు
వచ్చువారిని మన్నింపవలదటంచుఁ జెక్కురాశాల ముగసాల శిలలమీఁద, 92

కం॥ కని వెక్కిరించు వారును, గనుబొమచిట్లించువారు కటుభాషణముల్
విని చెడువారును నయి మ,మ్మనను ధిక్కారించిరమ్మ! మునులచ్చోటన్. 93

గీ॥ వరమ సారస్వతాంఘ్రి తత్పరులకచటఁ,జోటులేదంట బళి యిదియేట్రిక్రతువొ,
యనుచునందందు మేమటులరయనరయ,నదియువిష్ణుదుర్మంత్రమనుచుఁదెలిసె94

కం॥ అనవిని విననటులాయమ, కనుగొని యమ్మునుల తెలఁగు కళవళపడియున్
దనమదిఁగన్నది వారలు,వినిచిన దేకార్థమ్మగుచు విశదముగాఁగన్. 95

గీ॥ శోకభీకర మయ్యును సుందరంబు, విరహతప్తంబు నిశ్వాస పరుషితంబు
రోషదుర్లక్షమయ్యునిరూఢశాంత, సుప్రసన్నంబునగు మోము చూపులడర.96

శా॥ మీ కేలా? మునులార! దుఃఖపడఁగా మీయార్తి నాయార్తి కా
దా? కాదంచు జగద్విధాత యిటుసేయంజొచ్చినం జొచ్చుగా
కీ కార్పణ్యము విష్ణుఁడైన మదిలో నెట్లోర్చె, నట్లోర్చెఁగా,
కా కాంచీశ్వరుఁడైనలేఁడె దయసేయన్, లేదె కామాక్షియున్. 97

కం॥ మీ రేమియు ననకుఁడు దు,ర్వారము కోపమ్ము తపముబలము నెఱుఁగనే
యూరకయ చూచుచుండుఁడు, సారస్వతులార నాదు జతనము నింకన్. 98

మ॥ అని మిన్నంది నదీ సరస్వతి ప్రవాహావేగ దుర్వారయై
చనియెన్ జన్నము ముంచియెత్తుటకునో సర్వేశ్వరుం జేరి ప్రమొ
క్కిన వీనామృతవారిధార నభిషేకింపంగనో కాని వే
గ నినాదంబు నటేశనాట్యకృత ఢక్కా-ధ్వాన ధీరమ్ముగా. 99

శా। మిన్నంటంగ సరస్వతీ నది విజృంభించెం గ్రతుధ్వంస మా
సన్నంబయ్యెఁ బితామహా! యని మునుల్ సంభ్రాంతు లుచ్చైర్వచ
స్సాన్నాయ్యంబులు దప్పఁబల్కు-నెడలన్ శంకించి యాధాత యా
సన్నం జన్నము గావఁగా వరదరాజస్వామి నర్థించినన్. 100

సీ. వలగొనెనా! వాణి పలిత జటాజూటు, లలిత గంగానదీ కలితగతుల
నర్థించెనా వాణి యర్ధేందుకోలేరు, ప్రౌఢ మధురశబ్ద భాషణముల
యాచించె నా వాణి యంగీకృతకరికృత్తు, యాదః కలధ్వని వ్యాజమునను
నర్చించె నా వాణి యాగమాంత విహారు. నమలతరంగ హస్తముల కలిమి

గీ॥ ఘోషవెట్టెనా వాణిలోగుట్టునెల్ల, ఘుమఘుమార్భటి వ్యంగమ్ముగూఢముగను
ధ్వనిత మొనరించి పలికెనా పత్తనంబు, ముంచునో యేమొ సర్వతో
ముఖమునగుచు. 101

క॥ ఆవాణీ చతురాస్యులు, కావించిన ప్రార్థనమునఁ గఱఁగిన మదితో
న విశ్వవిభుఁడు కామా,క్షీ వీక్షణ మధురమూర్తి చిఱునగవొలయన్, 102

క॥ హరిఁజూచెనపుడు హరియూ, హరుచూపుల యర్థమెఱిఁగి యతి వేగమునన్
బురి కడ్డపడుచు నిలిచెను, నెఱ వేర్పఁగ క్షేత్రపాల నియమమునంతన్, 103

క॥ ఆవేగవతి సరస్వతి, యూ వేగమునూని కొలిచె నల కామాక్షిన్
దేవి! భవాని! మహేశ్వరి! రావే! రక్షింప దీనురాలినటంచున్, 104

క॥ తనుఁగొలుచు నాసరస్వతి, మనవిని విని మనసు కఱఁగి మానిని యిదిగోఁ
గొనుముభయమింక వెఱవకు,మని గొనియెను వాణిఁదనదునంకమునందున్, 105

ఆ॥వె॥ అభయమిచ్చి వాణి కభవుని వీక్షించి, స్వామి! తగునె పక్షపాతమనిన
వనిత! నాకునేమి పక్షంబు గలదిందు, విధివిధానమిట్లు వెలసెఁజుమ్మ, 106

క॥ తనతల్లిని గాదనునా! తనసోదరిగంగ నేమి తక్కువ యనునా!
వినుమిందు నజుని తప్పిన,మును గలదే! వాణి యింత పౌరవడు నెమునన్, 107

॥ ప్రాణనాయక యీతప్పు వాణిదైనఁ, దాను యాగమ్ముమొదలపెట్టె ధాతయపుడు
భారతినివీడి వేరొక్కవనితఁబెండ్లి, యాడఁజెల్లునెయిదిధర్మమగునెయనుడు,108

క॥ వినుమీ తప్పిరువురి యం,దును గలదా దోషమిపుడు తొలఁగెను నిక్కం
బను భూతమగుచు మనలను, గని సేవించుటను జేసి కల్యాణి యనన్, 109

ఆ॥వె॥ వాణి భవుని పాదపద్మమ్ములకు మ్రొక్కె, వచ్చె హరియు నతని వల్లభయును
అజుఁడు సేరవచ్చె నల్లన సావిత్రి, ఋషులుగూడి రాఁగ నీశుకడకు, 110

ఆ॥వె॥ మోదమ్ము కేలు ఫాలమున గదియించుచు, శివులఁజుట్టివచ్చి చేసిరపుడు
వారునిగమసారవాక్యసన్నుతులను, భయము భక్తివినయము పరిఢవిల్ల. 111

శా॥ దారత్యాగమొనర్చు దుష్టుని ననుఁ దండింపుమఁ బ్రహ్మ నా
నేరమ్ముల్మన్నయిరింపవే యనెడి వాణిఁ గుట్టు రక్తైన సం
సారమ్ముఁ దగదిద్దుమన్న తన యాస్యేందుఁ లక్ష్మీశ్వరున్
స్మేరాస్యుండగు నాథునిం గనుచు నా శ్రీమాత దాఁటిల్లనుఁ. 112

కం॥ హరిసుతవెయ్యైన నగుదురు, హరిసతియేయైన నేమియగుఁగాక భవ
ద్గురుత యిఁకఁజెల్లు భారతి, ధర వీరలకంటెనన నిధనపతిమెచ్చఁ. 113

కం॥ సిరిదాని ననువదించెను హరియుఁ దథాస్తనియెఁ గురిసిరమరులు సుమముల్
ధరమునుపటియట్లయ్యెను, హరుఁడపుడా కొలువుతో నయంతర్హిఁ గనె. 114

కం॥ ఇది సారస్వత విజయము చదివిన వినఁగలుగు విమల సారస్వత సం
పద లాపదలు దొలంగును, బొదలునుబహురూపవిభవములు పుణ్యమ్ముల్. 115

వ. అనిన సూతుంగని యమ్మునులు. 116

కం॥ హరచరణ కమలతీర్థా, దరమానే జంతుకోటి ధన్యంబదియా
పురుషోత్తమ సంభావితు చరితలుదెలుపుము పురాణ చతురాస్యయనఁ. 117



---

మ॥ మునులం గాంచి యతండు పల్కె వినుఁడీ మున్నొక్కనాఁ డబ్జనా
భుని పేరోలగమందు భక్తులు సురల్ భోగీంద్ర పక్షీంద్రులున్
ఘనయోగుల్ విన లోకమాత విభునిన్ నారాయణున్ వేడ్కమై
వినిపింపంగదె నాథ మాకిపుడు శ్రీ విశ్వేశ చారిత్రముల్. 118

వ. అని యడిగిన. 119

కం॥ అతఁ డెల్లవారిఁ గనుఁగొని, స్మితసుందర వదనుఁ డగుచు శివకథలు మహా
ద్భుతములు ముక్తిప్రదములు, వితతములేఁ గనినయంత విని చెదవినుఁడీ. 120

గీ॥ ఏను రుద్రుండు బ్రహ్మ నాకేశ్వరుండు, నేపరాత్పరు కరుణయే తేపగాఁగ
దాటినార మొభంగ దుస్తరమహాబ్ధి నామహేశ్వరు వచియింప నలవియగునె. 121

కం॥ విస్మయకరములు దుర్గతి, ఘస్మరముల నంత పుణ్యకరముల్ పరముల్
అస్మదుపాస్యమ్ములు నామస్మరణ కృతాంత మహోపమర్దన కరముల్. 122

కం॥ పరమములు శివపదమ్ములు, దురితపు చెవలంటరాని దుర్వారాగ్నుల్
శరణమ్ములు స్మయహరములు మరణజరాదూర పరమ మంగళకరముల్ 123



—* మత్స్యావతారము. *—

ఆ॥వె చూఱఁగొనియె మున్ను సోమకుఁ డను నొక్క రక్కసుండు నిగమరాశి నెల్ల
వాని నేర్చి దనుజవర్గమ్ము లోక వి, క్షోభకృత్యములకుఁ జొచ్చె నపుడు. 124

కం॥ మంత్రమ్ములు యంత్రమ్ములు, తంత్రమ్ములు నేర్చి యాతుధానులు జగతీ
తంత్రమ్ము మార్చివేయఁగ, సంత్రస్తములయ్యె నఖిల జగములు నంతన్ 125

ఆ॥వె॥ ఆత్మశక్తులెల్ల నణఁగించి మణఁగించి, యంత్రమయము జేసి యఖిలజగము
నిచ్చవచ్చినట్లు వెసరేఁగి యాడించె సోమకుండు తేఱిచూడరాక. 126

శా॥ సామాన్యమ్ములె యెల్లవారికయినన్ సంద్రమ్ములద్రుల్ వనీ
భూముల్ వారలె కాచిపెంచిన యటుల్ పోషించుచున్నట్టులున్
దామే యేలెడి రాక్షసాధముల యా దౌష్ట్యమ్ము ధార్ష్ట్యమ్మును
ద్దామం బయ్యెఁ గలంగ నెల్లజగముల్ దద్రాజ్య విక్షుబ్ధమై. 127

మ॥ పరితః ప్రావృత సర్వతోముఖ దురాప ద్వీపసంవాసి నా
సురవిద్రోహిని రూపుమాపు వెఱవున్ శోధించి శోధించి యీ
శ్వరు నర్థించితి దైత్యసంహరణ దక్షత్వంబు గాంక్షించి యా
హరుఁడున్నన్నుఁ గృతార్థుఁ జేసె నపుడే యక్షీణ దాక్షిణ్యతన్ 128

మ॥ కనకక్ష్మాధర శృంగధీరమగునీ కౌమోదకిం బూని స
జ్జనతానందకమైన నందకము నీశార్ఙ్గమ్ము, పైనీసుద
ర్శనముం దాలిచి సోమకాసురజిఘాంసం బోయితిన్నాటికిన్
వినతానందనపక్ష ఝాంకరణముల్ నిండంగ బ్రహ్మాండముల్. 129

మ॥ చతురంగ ధ్వజినీ సమేతుఁడయి రక్షస్సార్వభౌముండు ను
ద్ధత సంగ్రామ కుతూహలంబు మెఱయన్ దర్పంబెలర్ప న్నిరా
దృత మత్కార్ముక జృంభణుండయి భుజోత్సేకంబు రూపింప సం
తతనారాచ పరంపరల్ గురిసె నంత న్నేను సన్నాహినై, 130

కం॥ ఈలచ్చియు నచ్చరలును, లోలో వెఱఁగంది చూడ లోకేశ్వరులున్
లీల జగన్మోహినినై, వేలాసైకతమునందు విహరింపంగా. 146

కం॥ నా కేళులకు నా హేలకు, నాలావణ్యమ్మునకును నాసంగతికిన్
నాలలిత విలాసమ్ములకై లోఁగుచు మఱచిరమృతకలశము నంతన్. 147

గీ॥ అభినయమ్ముల కలరుచునల్లనల్లఁ, జేరవచ్చినవారల నోరజూచి
యమృతమును బంచిపెట్టనాయత్తపడితి బారులుగదీరి వారలుకూరుచుండ 148

కం॥ దరహాసామృతపూరము, గిరికొను కేరిగంటిచూపుఁ గిసురింతల నా
సురవిద్రోహు లెఱుంగరు, సురలే యమృతమ్ముగ్రోలుచొప్పొకయింతన్. 149

గీ॥ మాయఁగనుఁగొని రక్కసిమాయఁజేసి, చూఱె నమృతమ్ముసురలలోఁ
జొచ్చి యొకఁడు
తరణి యెఱిఁగింప రెండుగాఁదఱిఁగినాఁడఁ, జక్రధారను వానిదౌష్ట్యమ్ము దెలిసి. 150

మ॥ కలహమ్మయ్యెఁ దదర్థమై యపుడు రక్షస్సంఘమందోడుచున్
గలయంబాఱె శివుండు, వారిదయతోఁ గన్గొంచు సద్వృత్తి నీ
జలధి ప్రోద్భవలింగమున్ గొలుచుచో సాధింతు రిష్టమ్మనెన్
దలకెక్కింపరు సంపదంధులు సురల్ తద్వాక్య మొక్కింతయున్. 151

ఆ॥వె॥ మొదలమోసఁగించి పూర్వదేవతలిట్లు, తుదకు మోసపడిరి దుఃఖపడిరి
అభవుఁ డంతనన్ను నల్లనవీక్షించి, విఘ్ననాథుఁబిలిచి ప్రియముతోడ. 152

గీ॥ తానుబురుషోత్తముండయ్యుఁ దాల్చెనిపుడు, మోహినీరూపమెల్లర దద్భుతపడంగ
వార్ధికన్యక నీతనివశ మొనర్చు, మసిన నాతండుగావించె నభవునాజ్ఞ. 153

వ. అని విష్ణుండు చిఱునగవు చూపిన లక్ష్మి నాలోకించుచుం బలికెన. 154

కం॥ తలలూచిరి యాసభ్యులు, దలవాలిచెలక్ష్మి సిగ్గుదలకొనవంతన్
మెలనవ్వొలయఁగ విష్ణుం, డలఘుమ్మదూత్తులనుబలికె నవ్వలి కథలన్. 155



—♦ వరాహావతారము. ♦—

శా॥ ధాత్రీమండలిఁజూపగా మడఁచు నాదైత్యున్ హిరణ్యాక్షు వి
శ్వాత్రాణార్థముపోత్రినైయరిగి దంష్ట్రిన్ జీల్చి చెండాడి త
ద్గాత్రస్యందికవోష్ణ రక్తఝరులుత్కంఠం గడుం గ్రోలుటన్
ధాత్రిన్బెండియుగాసివెట్టితిని యంతర్జ్ఞాన శూన్యుండనై. 156

శా॥ ఆవేళన్మొఱలెట్టు నీజగము కుయ్యాలించి ఫాలేక్షణుం
డీ విశ్వంభరఁ బ్రోవఁగాఁ దలఁచి దానెత్తెన్ గిరాతాకృతిన్
ఆవేదంబులు జాగిలంబులయి తోకాడించి నిల్చెన్మహా
దేవుండెత్తి పినాకముం దిగిచె భేదిల్లెన్దిశల్లద్వనిన్. 157

శా॥ జ్యాఘోషంబతిభీషణంబయి శ్రివస్సద్యః ప్రవిష్టాశుగ
వ్యాఘాతాధిక దారుణంబయి కలంపన్ ఘుర్ఘురారావముల్
మేఘధ్వాన విడంబనన్ జెలఁగఁగా మేలెంచియేఁ బోయి యా
దాక్షీయస్త్ర దేహునాదిమ కిరాతస్వామి నీక్షించితిన్. 158

కం॥ వీక్షించి యించుకేనియు, లక్షింపక యతనిమీఁద లంఘించితి నే
నాక్షణమ నన్నుబట్టిన, వక్షీణజవంబులైన యాజాగిలముల్. 159

మ॥ విదళింపంబడి మాటిమాటికి ననున్వేగించి తూఁగించి యు
న్మదభాంకార రవంబులన్ మొఱయుచుం బైపై విజృంభించు న
మ్మద కౌలేయక యుగ్మయుగ్మము కడున్మట్టాడి మిట్టాడుచున్
విదళింపన్ విదళించితిన్ బ్రతిభటావేగమ్ము వారించుచున్. 160

కం॥ అదిగని సైరింపకయు, మ్మొదలిటి ముదిబోయనన్ను మొఱకుఁదనమునన్
బొదివి యొక కేల దంష్ట్రము, నదుముచుఁ బెఱకేలఁ బెఱికె నవ్వాలికోరన్. 161

కం॥ ననువిసరి వైచె నంతట, వెనుకొని యే నతనిమీఁద వేగమ దుముకన్
గనుఁగొని కనుఁగవ కెంపున్, దనసొంపున్ దనువుపెంపుఁ దనసతియింపున్. 162

కం॥ మల్లడిగొననా భిల్లుఁడు, పెల్లుగ రక్తంబు దొఱుగ బిట్టడిచె ననున్
భల్లమ్ముగొని కోరను, జెల్లెను రావందియనుచుఁ జేరుచు భిల్లుల్. 163

కం॥ గిరిసరి గరిసరి గడుసరి, కిరికిరి యను మొఱకుబెలుఁగు గీల్కొన నెఱుకుల్
దొరకడకు నన్నుఁ జేర్చిరి, యరుదుర యీపాటిదనుచు నచ్చెరువడుచున్. 164

కం॥ ఆఱసచ్చియున్న ననుఁ దా, నఱచేతంబట్టి యెత్తె నభవుఁడు పేర్మిన్
దొఱఁగెను నాయజ్ఞానము, గుఱుతించితి హరుని నిగమకుల పరివారున్. 165

మ॥ స్పృహణీయోజ్జ్వల దివ్యమంగళతనూ! శ్రీకంఠ! మానీశ్వర
గృహిణీయామల పాదపంకజ! సతీ ప్రాణేశ! విశ్వంభరా!
మహనీయాత్మకథాపవిత్రితజగన్మాలిన్య! లోకేశ్వరా!
సహనీయంబగు గాత నాదురితమీశా! లుబ్ధకాగ్రేసరా! . 166

మ॥ నినుఁ స్థాణుండు స్మశానవాసియనుచు న్నిందుంచు లోకంబు దాఁ
గనదీభూమి మహాస్మశానమనియుం గల్పాంతమందుజ్జ్వల
ద్వణకాకారముఁబూని శాశ్వతముగా రాజిల్లుదీనంచు మం
డనశేషాహి! సుమాయమానవచంద్రా! లుబ్ధకాగ్రేసరా! . 167

కం॥ కిటదంతధారివగుమీ, నిటలాక్షయనుగ్రహింపు నీదానుని నీ
కిటకథవెలయఁగననఁగాఁ,గిఁట నట నా భిల్లవిభుఁడు గీలించెసనుక, 168



—♦ నృసింహావతారము. ♦—

మ॥ నరసింహాకృతితో హిరణ్యకశిపున్మర్దించి తద్రక్త ని
ర్ఝరణింగ్రోలిచరించు నన్ను మిగులం బ్రార్థించెఁ బ్రహ్లాదుఁడుక్
సిరియున్ దేవతలుక బ్రసన్నుఁడగు మీ శ్రీనాథ! యంచున్మదిక్
జోరదా ప్రార్థన దుష్టదైత్య రుధిర స్రోతంబు కై పెక్కుటక. 169

మ॥ హరునర్థించిరివారు వారికభయమ్మాస్వామియిచ్చెన్ గృపా
పరుఁడై సత్వరుఁడై శ్రితార్తిహరుఁడై వచ్చెన్ ననుంజేరఁగా
శరభాకారము సాళువాకృతియు నాచంద్రార్కమై శ్వానర
స్ఫురదక్షిత్రయముక భయంకరవపుస్ఫూర్తిం బ్రవర్తింపుచుక, 170

సీ. ప్రళయకాళియును దుర్గాదేవినిజపక్ష, భాగమ్ములను విజృంభణము మెఱయ
బడబానలుఁడు కాలభైరవుండును జఠ, రమునహృదయమందుఁ గ్రాలుచుండ
వ్యాధియు మృత్యుదేవతయు నొండొంటితో, నూరుభాగమ్ములఁ జేరియాడఁ
బ్రళయజీమూత కర్కశనిస్వనుండును, రోషదుర్లక్ష దారుణముఖుండు

గీ॥ చండమారుతవేగుఁ డష్టాపదుండు, కులిశనిష్ఠురశాతనఖుండు పిలయ
కాలపర్జన్యనీలవిగ్రహుఁడునగుచు, శరభసాళువమూర్తియైహరుఁడువచ్చె. 171

మ॥ అనిదంపూర్వవరప్రభావపటు గర్వాంధాసురేంద్రప్రమా
పణ సంరంభవిజృంభణప్రకటిత బ్రహ్మాండ విద్రావణ
స్వనదుర్లక్షు నృసింహరూపమున విభ్రాజిల్లునన్నుక్ భయాం
గన కై సేసెఁదదీయభీకరకటాక్షు ప్రేరణోన్మత్తుఁడై. 172

మ॥ శివరూపంబునఁజూతు భీషణఫణిశ్రేణీన్ దలన్దాల్చుచోక్
భువనాభీలము కాలకూటము వెసన్ గుక్కిళ్లుగా మ్రింగుచో
వివిధాకారకరాళ వేషములనే వీక్షించితింగాని యా
భవు నెన్నండును జూడనమ్మయి జగద్ధ్వంసంబులం దెవ్వోడక్. 173

మ్యాలిని॥ శమనరహిత కోపస్పందమానాధరోష్ఠుక్
సమధికశిఖినేత్రున్ జంచలాత్యుగ్రజిహ్వుక్
దమితభువనజాలున్ దర్పకధ్వంసినీశున్
శమితసకలదోషున్ జంద్రచూడాలునాద్యుక్. 174

కం॥ కని భయము వెనుకభక్తియుఁ, బెనఁగొన నర్చించినాఁడభిదురశితమ్మల్
కొనగోళ్లఁదనువునింతలు, దునుకలుగాఁజేసిహరుఁడు తుష్టింగనఁగా. 175

చం॥ జయజయ సర్వతోముఖప్రసన్న! మహేశ్వర! దుష్టశిక్షణా!
జయజయ కాలకాల! దివిషత్పరమేశ్వర! శిష్టరక్షణా!
జయజయ యంబరాంబర! కృశానువిలోచన! భక్తపోషణా!
జయజయ పాహిపాహి శివ! శంకర! చంద్రకిశోరమండనా!. 176

మ॥ జయకాకోలనిబర్హణా! పశుపతీ! సర్వాంసహాస్యందనా!
జయకల్యాణధనుర్ధరా! భవహరా! చంద్రార్కవహ్నీక్షణా!
జయగంగాధర! చంద్రమోమకుట! విశ్వక్షేమసంధాయకా!
జయగౌరీశ్వర! సర్వమంగళవిరాజన్మూర్తి! పాపాపహా!, 177

కం॥ శాంతింపుము శరభేశ య,నంతా! యని యభవు వేడ నాతఁడు ప్రీతిన్
శాంతించి యొసఁగె నాకు ని,రంతర తత్పాదసేవ నాసక్తమతిన్. 178



## ❊ వామనావతారము. ❊

ఆ॥వె॥ ఆ హిరణ్యకశిపు నన్వయమ్మునఁ బుట్టి, బలియనంగ దనుజవల్లభుండు
నిత్యసత్యశీలుఁ డత్యంత ధర్మవ,ర్తనుఁడు విశ్వదాతమనువిభుండు. 179

సీ॥ కపటవామనరూపినై కపటరహితు, బలినివంచించి యతని వైభవము నెల్ల
నప్పగించితి నింద్రున కతఁడుగోర, దాని పైపక శివుఁడు భక్తప్రియుండు. 180

కం॥ జంకించిననున్నాదగు, కంకాళముదాల్చి యయ్యెఁ గంకాళధరుం
డంకించి నాకరాళ్మము. బింకముగాఁ జేతికట్టు ప్రోలుపునదాల్చెన్. 181

కం॥ సురలసురల నెడి భేదము, హరునకు లేదెవ్వఁడు ప్రేర్మి నాశ్రితకోటిన్
గరుణించు వరములిచ్చును, బొరపొచ్చెములేక నిఖిలపురుషార్థములన్. 182

కం॥ శిక్షించు నెవరి నైనన్, బక్షము లేదతని కెట్టి వారలపయినిన్
రక్షకుఁడనుట కనిదె యా, దక్షధ్వంసంబు మొదలుదాహరణ మగున్. 183



❊ పరశురామావతారము. ❊

ఉ॥ నన్నుఁ దృణీకరించుచును నాదుసుదర్శన మొక్కనాఁడు నీ
యున్నతియెల్ల నావలననున్నది యేను నొలంగిపోవ నే
మున్నది నీమహత్త్వ మదియుం గనుఁగొందును గాక యంచుఁ దా
జన్నియవట్టియేఁగి సువిశాల విశాలకసూయ పెంపునన్. 184

ఉ॥ హైహయరాజవంశమునయందుదయంబయి యర్జునుండు నా
బాహుసహస్రశాలి విభవస్వరధీశుఁడు గార్త్యవీర్యుఁడు
త్సాహసమగ్రుఁడై గెలిచి చాలెను దీవులు రెండుతొమ్మిదుల్
సాహసవిక్రమక్రమ విసర్పదుదారయశః ప్రశస్తులన్. 185

ఉ॥ రాఘణునంతవానిని జరాలున నారిని బందెగొన్న సం
భావితశౌర్యశాలి నరపాలుఁడతండొకనాఁడు సర్వసై
న్యావళితోడఁగూడి మృగయారతిఁ దేలుచుఁ జేరి యోగవి
ద్యావిభుఁడల్లనల్ల జమదగ్నిమహాముని యాశ్రమమ్మునన్. 186

ఆ॥వె॥ అతిథేయుఁడిచ్చె నతిథిసత్కారమ్ము, రాజదుర్లభమ్ము రాజుగాంచి
కలఁగి కలదు గోవు కామధేనువుబిడ్డ, మునికి దానిమహిమ యనుచుఁ దెలిసి, 187

ఆ॥వె॥ అడిగి దానినెంత నడిగిన నీనన్న, తబిసిఁ గినిసినాడు ధాత్రినున్న
దీనినడుగనేల తేలికగా నేల, కానవనుచు గండకావరమున, 188

కం॥ జడదారి యితఁడునడ చెడుఁ జెడుదారిం దానఁ జేసి చెడుగాకనుచున్
వడిఁగోవుఁబట్టి తనవెంబడిఁ గొనిచనెఁ బురము రాజపాంసనుఁడంతన్, 189

కం॥ వినమ్మసీందుర్ కొమరుఁడనై నేర్చితివిద్యలెల్ల సభవునికరుణన్
నే నింటలేనియపుడీ కానిపనింజేసె నృపతి కావలుఁడగుచున్॥ 190

శా॥ గాత్రిసమ్మంగొని దర్భమోపులు సమిత్కాండమ్ములందాల్చి యే
నాసాయంతనమిల్లుసేరుతఱిఁ దానంభారవంచించ ను
ల్లాసంబందుచు మోరయెత్తుకొని నన్నక్షించియుప్పొంగు నా
శ్రీసర్వస్వము లేదు జన్నియకటీసీమన్ దుర్మాబద్ధమై॥ 191

కం॥ మాయయ్యనన్నుఁజూడరు మాయన్నలుచూచికూడ మాటాడరు నన్
మాయమ్మవెఱచిచూచును మాయురెకోమాతయెందు మాయఁబయ్యెన్॥

మ॥ అనితర్కించివిషాదకోప వివశస్వాంతుడనై యన్నలన్
మునులన్ దల్లినిదండ్రినిన్ సఖజనమ్మన్ శిష్యబృందమ్మనున్
వినయమ్మన్నయమున్ భయమ్మమెఱయ న్వేమారు ప్రశ్నించినన్
వినతాస్యమ్ములనెత్తరున్ గనుదమల్ విప్పారనన్ జూడరున్॥ 193

మ॥ ఒకరుంబల్కరిదేమిచిత్రిమనియే నూహించియూహించి యా
నికటక్షుణ్ణధరావరాగములచే నిశ్చవ్రిచార్ధుండనై
వికటభ్రూకుటిరోషతామ్రినయనస్వేదోల్బణా స్వాంతర
ప్రకటీభూతపటత్పటద్వికటదంష్ట్రాభీషణాభాషినై॥ 194

మ॥ తెలిసెన్నేఁడుమదాంధరాజ్యపదవీతిష్ఠత్పశుద్రోహముల్
దెలియుంగ కిఁకబుణ్యావిప్రజనతా తీవ్రిప్రితాపంబునన్
దలఁడోయర్జునుఁడెంతసేసె నిదియేనా! రాజధర్మంబు గో
వులమాసీందుర్లగాసివెట్టుటలె గాఁబోలున్ మహీపాలనల్॥ 195

మ॥ అని పేరమ్మున గంగ్రజగోష్ఠలి నిజాంసాలంకృతిం జేసి యేఁ
జను వో నాశ్రమవాసులింత వోరవా! చాలించుచాలించునా
ననుమాతల్లియుదండ్రియున్నలదురా! నాయన్న యీరాచవా
రిసి మారోక్క మనకేలయాగుమనుచున్ బ్రేమన్ని వారించినన్॥ 196

శా॥ పేర్మిం గ్రౌంచవిదారణుం గెలువఁగాఁ బెక్కండ్లనిష్ఠన్ శివున్
గూర్మిం గొల్వఁగ మెచ్చియిచ్చెహరుఁడీ కుట్టాకముల్ స్కందుఁడా
దుర్మార్గమ్మునవీడె నిద్దిగలుగన్ దోడేల నేడేలయీ
నిర్మర్యాదునృపాలకీటకము మన్నింపగ గర్వాంధునిన్॥ 197

వ॥ అని వారల నోడంబఱచి యాశ్రమమ్మువీడి మనోవేగమ్మున సైన్యజర్జరిత మార్గమ్మునట్టి యంతర్జంతుసంతానమ్ముతో వెలిపడువిడిసి కదలు కడలిం బోని మాహిష్మతీశ్వరునపారస్కంధావారమ్ము దరియం జొచ్చి యచ్చటి భటులనుద్దేశించి 198

కం॥ ఓహోహోహోమీనరపతి బాహాబలశాలి దళితపార్థివదర్పో
త్సాహుండుసార్వభౌముఁడు హైహయకులవారినిధిశశాంకుఁడునఁటగా॥ 199

ఆ॥వె॥ నేడవలయుఁగాని వేయిచేతులనిచ్చు దానియంటగడునిదానియంట
ఈయఁగలఁడోలేఁడోయీనాదుకోరిక యర్థివచ్చెననుఁడి యతనితోఁడ॥ 200

కం॥ అనవినుచువారునన్నుం గనుఁగొనివిస్మయము స్మయముగడలుకొనంగా
జని యంతఁగార్తవీర్యునకునుదెలుపఁగఁగొంత బెదరు కొసరినపలుకుల్॥ 201

ఆ॥వె॥ వటువుపటువువాని వాక్యసందర్భమ్ము బ్రహ్మతేజమొకటఁబాదుకొనెనొ
కోపమెల్లనొకటఁగూడినదోయన వచ్చినాఁడు వేషవచ్చినాఁడు॥ 202

క॥ అనవినుచునానృపాలుం డనర్ఘరత్నమువతోడ నర్ఘ్యంబిడఁగాఁ
జనుదెంచి దేవయర్ఘ్యము గొనుమని ప్రార్థించెనన్ను గురుతరభక్తిన్॥ 203

క॥ నీమర్యాదకు మెచ్చితి నీమణులేలయర్ఘ్యమాకు నీవలచినమాఁ
గోమాతనిమ్ము కాదనుచో మఱినీబాహుబలము చూపింపుమనన్॥ 204

చ॥ కనలియలంతినవ్వు దొలకన్ జులుకన్ననుఁ జూచిచూచి యి
ట్లనియెను నాదుమాటవినుమా! కనుమా! దయచేసియొందు వి
ప్రనికరమున్నఁ బేర్మిఁ దనరన్మణిరంజితవస్తువీయఁగాఁ
బనుపడు రాచవారిపటుబాహులు సాహసమొందు సేయునే॥ 205

ఆ॥వె॥ ఎంతచక్రవర్తి నేనిఁ బోషింపఁగా వలఁతివలయు వానివెలయనిచ్చి
గోవుమాకుఁగాక కోనలఁగానల ముక్కుమూసికొనెడి మునులకేల॥ 206

క॥ నీవైనవినుము చెడకుము గోవులఁబది వేలనిత్తుఁ గొమ్ము దురాశన్
బోవకుము రిత్తయాగ్రహ మావేశము చూపఁబోకుమా! మాయెదురన్॥ 207

మ॥ అనినన్ గ్రోధవిఘూర్ణమాన నయనవ్యాప్తాగ్నికీలల్ ననున్
మునుకల్పెట్టగ నేమియేమి బళిరా! మూర్ధన్య! రాజన్య! మా
కినుకం జూచెదు బాపశాపముల నీకృత్యమ్ము నాకృత్యమున్
గనుమా! మాకు దురాశయా? నిలుము నీగర్వంబఖర్వంబుగాన్॥ 208

శా॥ శాపమ్మం బెదొ చాపమం బెదొ వృథాచాలించు గర్వోక్తి నే
శాపమ్మంటిన విప్రుడన్న వెఱపా చాపమ్ము రానిమ్ము నీ
రోషమ్ము న్మఱి కోపమున్ జలము నీరోసమ్ము మీసమ్ము నీ
చాపంబద్దసహాస్రబాహువుల యాశౌర్యమ్ము వీక్షించెదన్॥ 209

కం॥ మాయింటఁ గుడిచి పదపడి మాయావృందోచితోన్న మాయావివి నిన్
మాయింపకుండ విడుతునె హాయిగఁ గను కెల్లు పట్టు రా? యటులైనన్॥ 210

మ॥ అనినన్ దిగ్గనలేచి యా నృపతి వంశాంగారుఁ డుద్యద్ఘను
ర్ధ్వనులన్ జక్కఁగ నిల్చి నాకు నొసఁగెం బ్రత్యుత్తరమ్ముల్ మహా
రొక్కా నివర్షించె నిశాతఘోరశరముల్ సుద్ధారుణాధ్వంబులై
ననుముంపన్ జెయివీచె సైన్యములకున్ మర్దింప దుర్దాంతుఁడై॥ 211

శా॥ ముట్టన్వచ్చు శరమ్ములం దునిమి యమ్మూకల్ చికాకెత్తి ప
ర్వెట్టం దోలితి దిట్టవై సెలిచినన్ బిట్టాడి కొట్టాడి చూ
పెట్టన్ రాకచరించు నన్నుగనుచున్ బిట్టుల్కి కట్టల్కఁ జే
నెట్టన్ దాఁకెను గాత్రవీర్యుఁడు బలానీకమ్ము నేకమ్ముగాన్॥ 212

శా॥ వారింద్రుంచుచు నారిఁ ద్రుంచి ధనువుల్ పట్టంగఁ జేయాడనీ
కా రాజన్యసహస్రబాహువులఁ జక్కాడంగ గ్రుక్కాడ కా
భీకుల్ వీగలు పాఱ రా నృపతి కుంభిస్వామిపై దూఁకి నా
బీరమ్మెక్కఁగు తారధార కెఱగా బిట్టేసితిన్ మూర్ధమున్॥ 213

శా॥ డొల్లంబోయి యతండు ద్రెళ్ళిపడె నాటోపంబు దీపింపఁ దాఁ
జెల్లెన్నేఁడు గృశఘ్ను భావమనుచున్ జేయెత్తి యొగ్గెత్తి నా
వల్లన్గ్గొను ధేనువున్విడిచి యంభారావ చైత్రధ్వనుల్
పెల్లైమ్రోయ దిశాదశస్థలములన్ బెల్లుబ్బియుల్ సేరితిన్, 214

కం॥ ఒడలెల్లఁ గనులుగా నా వెడలిన పొడిదారిఁ జూచు పితరులు సఖులున్
జడదారులావు వెంబడి, బడివచ్చెడి నన్నుఁ జూచి పరమ ముదమునన్. 215

ఆ॥వె ఆవుముద్దుగొనుచు నంగరక్షలు వెట్టి, దిష్టిఁదీసి నన్నుఁ దేర్చిరపుడు
సార్వభౌము నేఁడు శాసించినాఁడు మా, పరశురాముఁడనుచు బంధుజనులు 216

వ. ఇట్లు పరమోత్సాహంబునం బ్రవర్తిల్లుచున్న నొక్కనాఁడ కార్తవీర్యనందనులు వనాంతఃగతుండగు నాకుఁ గురుద్రోహంబు సేసిన పొదవిన కోపంబునం జేసి వారల నెల్లర వెదకి వెదకి వధియించి. 217

చం॥ ఇరువది యొక్కమాఱులు దహించితి రాజకకాననంబు వి
స్ఫురిత కుఠారధార, ఋణశుద్ధి నొనర్చితి శాంతిఁ జెందితిన్
గురు వనభూమియందు నొడఁగూర్చి శమంతక పంచకమ్మునీ
ధరణి సమస్తమిచ్చితిని దక్షిణగా నలకశ్యపర్షికిన్. 218

— రామావతారము —

గీ॥ వెలయ భృగుకులమందు నేనొలసి నాఁడు తొల్లి భృగుపత్నిఁ జంపిన దుడుకుతనము
రావనక్లిన్నలోకసంప్రార్థనమ్ము ఫలము దశరథ రామరూపమ్ముగంటి. 219

శా॥ మాయాకర్మవిశారదుండయిన యమ్మారీచుఁ బ్రేరేచి పె
న్మాయన్ సీతను దొంగిలించు దశకంఠచ్ఛేదసంపాదనో
పాయాన్వేషణతత్పరుండనయి యేనందందు వేసారి సు
శ్రేయోదాయకుఁ గాంచిఁ గాంచితిమునిశ్రేష్ఠున్ దపోనిష్ఠునిన్. 220

ఆ॥వె॥ పదవిభంగనహుష పదవీవిభంగుఁడు భ్రుకుటిదమితవింధ్యభూధరుఁడు
శుద్ధజలవిధాయి చుళికితాంబోరాశి కుంభభవుఁడతండు కూర్మి వెలయ. 221

కం॥ కొనుమంచుఁ బాశుపతదీక్షను దయసేసెను జయింపు శత్రులననుచున్
దనుమాడితి రావణు నా మునివరుదివ్యోపదేశమున నస్త్రమతన్. 222

సీ॥ బ్రహ్మమునిమనుమఁడగురావణునిఁజంపు పాపపుంజమ్ములవి పటాపంచలుగను
దక్షిణాంబుధియుత్తర తారమునను శివునిఁబలుచోట్లనేఁ బ్రతిష్ఠించినాఁడ. 223

## — కృష్ణావతారము —

కం॥ కంసాది దనుజసంఘము, హింసింపఁగ బుట్టినాఁడఁ గృష్ణుఁడ నగుచున్
కంసుని మేనల్లుఁడనై, కంసార్థము యాదవీయ చరితముగాఁగన్. 224

ఆ॥వె॥ హరుని కంటిమంట కాహుతియైనయా, మదను గాంచినాఁడ మరలనపుడు
హిమగిరీంద్రమందు నీశ్వరునర్చించి, పదియు రెండునైనవత్సరములు. 225

ఆ॥వె॥ వేదరక్షణమ్ము విబుధపాలనమును, భక్తపోషణమ్ము పాపహింస
బ్రహ్మచర్య మేకపత్నీవ్రతము రాజ, తంత్ర కుశలతయును ధర్మబోధ. 226

కం॥ వెలయింపఁ దలచి వెలసితి, నిలతోఁ బలుమాఱులేను నీశ్వరుకరుణన్
వెలయించితిఁ దద్భక్తిని, వెలయజగంబెల్ల నభవు వీక్షణ మహిమన్. 227

వ. అనుటయుఁ బ్రమోదమానమానసంబులఁ గందళితానంద బిందుసందోహ మరంద
స్యంద తుందిలిత నయనారవిందులయి, 228

ఉ॥ శ్రీపతి నాగలింగ బుధచిత్త సరోరుహ రాజహంసు న
ద్దేపలి సోమనాథ గురుదేవ మనః ప్రియుఁబంశితేంద్ర తా
డేపలి వెంకటప్పయ పటిష్ఠ వచోల హరీనిధాను వి
ద్యాపతి సంగమేశ్వర హృదంబుజబంభరు మల్లికార్జునిన్. 229

కం॥ శ్రీశైలపతిప్రియుతా రాశిని శ్రీ కాశినాథ బ్రహ్మయలింగా
ఖ్యాశ ధృతవిమలదీక్షుని, శ్రీ శంకర భక్తఘటిత చిన్నయదీక్షున్. 230

వసంతతిలకా॥ ఆరాధ్యవంశ తుహినాంశుమనోజ్ఞమూర్తిన్
ధీరాళి సన్నుత కృతిస్థిరచారుకీర్తిన్
గౌరీశ పాదభజన ప్రవణాంతరంగున్
దూరీకృతతుషితదుర్గుణ జాలసంగున్. 231

మ॥ స్థిరవిశ్వేశ్వర పాదపంకజయుగ శ్రీభావనాసంగతాం
తర విద్వత్పదపద్మభృంగ మధుర ధ్వాన్యాత్మ కాంచీపురీ
శ్వర మాహాత్మ్యము నందు రెండవది యాశ్వాసంబు దీనిన్మహే
శ్వరుఁ డాకృష్ణము నా హిమాలయమును వర్ధిల్లఁ బాలించుతన్. 232





# శ్రీ కాంచీ ఖండము.

## తృతీయాశ్వాసము.

కం॥ శ్రీరామలింగ విద్వ, త్సారీంద్రాంకిత మహాప్రబంధ విశేష
శ్రీరూఢ సహజభక్తిస, మారాధ్యుని, మల్లికార్జునారాధ్యు గురున్. 1

క. అట్లు శివకథా కథన చతురుండైన యన్నారాయణుని, 2

కం॥ కని వారలెల్ల ముదమున, వనజాక్షు! భవత్కృపా ప్రభావము వలనన్
వినఁగంటిమివియు నింకన్, వినిపింపవె మీ విచిత్ర విభవములనినన్. 3

చం॥ దరదరవింద నేత్రుఁడు సుధారసధార సహోదరమ్ములై
పరఁగు మృదూక్తులన్ బరమ పావనముల్ శుభకారణమ్ములున్,
దురిత కుఠారముల్ చటుల దుఃఖహారమ్ము లనంత మంగళా
కరములు పల్కెనా శివునిగాథలు లక్ష్మియు మానులుఁన్వినన్. 4

కం॥ హరయన్నన్ భవబంధము, హరియించు హరించుఁబాత కావళినెల్లన్
వరియించు ముక్తికాంతయు, హరునకు నీడెవ్వరయ్య యమరులలోనన్, 5

### — త్రిపురాసురుల మహిమ —

శా॥ అంభోరాసి మథించువేళ నుదయంబయ్యెన్మహాలింగమై
శంభుండీశ్వరుఁడమ్మహేశ్వరు దయన్ సాధించి సాధించి రా
యంభోజాసనసృష్టిదుర్లభము లుద్యత్స్వర్ణరౌప్యాయరస
ద్గుంభమ్ముల్ త్రిపురమ్ములంబ్రబలి రక్షోనాథులక్షోభ్యులై. 6

శా॥ ఆకాశాంతర ధీర ధీరచరముల్ నాకాది లోకావళీ
భీకృత్యమ్ములు సత్యలోక సమముల్ విస్ఫార సౌఖ్యక్రియా
వైకుంఠమ్ములకుం దభక్తజనతా వాల్లభ్యలభ్యాంతర
శ్రీకైలాసములీశ్వరార్చనకళాసిద్ధమ్ములిద్ధమ్ములై. 7

కం॥ పరఁగెడునా పురములలో వారివిక్రములీశ్వరార్చనాఢ్యులుఁ ద్రిపురా
సురులన జగత్ప్రసిద్ధులు పరగర్వితు లఖిలవేదపారగులగుచున్. 8

కం॥ సమధనము సమబలమ్మును సమబుద్ధి సమానరూప సౌభాగ్యమ్ముల్
సమవిక్రమముల వెలయుచు సమానులసమానులైరి సకలమునందున్. 9

కం॥ తమకెదురులేక యెయ్యెడ నమర్త్యపరిపంథికోటి యధిగర్వమునన్
దము నెదిరి నెఱుఁగకుండన్ సమస్తలోకములఁ గలఁచి చరియించి రొగిన్. 10

ఆ॥వె॥ కాన నెండకన్ను వానకన్నెఱుఁగని వారలున్ననుండవచ్చుఁ గాక
దివిజవర్గమందుఁ ద్రిపురాసురులచేతఁ బరిభవింపఁబడనివాఁడు లేఁడు. 11

చం॥ రణమున వారలన్ గెలువరాదనుమాట శిలాక్షరమ్మ మా
రణమెది యో యుపాయమున రక్కసిమూఁకలకైనఁ దత్సతీ
మణులపతివ్రతాత్వమహిమన్ దరియింపనశక్యమిన్నిటన్
గణనకునెక్కురక్కసుల గండడఁగింపనసాధ్య మేరికిన్. 12

కం॥ శివభక్తులైనవారికి దవుదవ్వులఁ దొలఁగిపోవు దండధరుఁడున్
శివభక్తాగ్రేసరులు దైత్యవరుల వధియింపఁగల యుపాయము గలదే. 13

వ॥ అని చింతించి సురలెల్ల నన్నుం జేరి ప్రార్థించిన నేనుం బెద్దతడ వాలోచించి యొక్క మార్గమ్ము నిశ్చయించి తదనుసరణమ్ముగా. 14

# బుద్ధావతారము

కం॥ మునివేషమూని బుద్ధుం డనునామము వెలయ శిష్యుఁడయి నారదుఁడున్
దనువెంటఁ గొలిచి రాఁగాఁ జనినాఁ డను త్రిపురదనుజ సౌధమ్ములకున్॥ 15

తే॥ అర్ఘ్యపాద్యాదివిధుల మమ్మధికభక్తిఁ గొలిచి యర్చించిరా వీటి కువలయాక్షు
లధికగర్జితభీషణమయిన నీలమేఘమిడు జీవనము మించు మెఱుపుతోడ. 16

ఉ॥ తముబంధించెడు ప్రత్తాళ్లమంచెఱుఁగరా దైత్యాంగనల్ మమ్ము ను
త్తమభక్తిన్ భజియించిరే దివిజకాంతల్ సాటిగావత్తురా
కమనీయత్వమునన్ గళాపరిచితిన్ గళ్యాణభావమ్మునన్
శమమందున్ దమమందు శౌచమునెడన్ దాక్షిణ్యధర్మమ్ములన్. 17

కం॥ ఒకయనసూయకు లోఁగితి మొకటది త్రిమూర్తులము గూడియును ననసూయల్
ప్రకచకరాళవ్రతలా యకలన్వంచించు టెట్టు లసురాంగనలన్. 18

తే॥ రాక్షసేశ్వరజీవనరాజధాని పుణ్యజనవీరకేసరుల్ పుట్టుచోటు
అసురసామ్రాజ్యలక్ష్మికి సంగరక్ష దానవాంతఃపురము పుణ్యధర్మభూమి. 19

ఉ॥ ఒకకొన్నాళ్లు వసించియే మచట నెల్లో వారిచిత్తమ్ములిం
చుక మా బోధలపాలు చేసితిమి యా శుద్ధాంతసీమంతినీ
ప్రకరమ్మున్ మముఁ దోడఁబుట్టులనుగాఁ బ్రత్యక్షదైవమ్ముగాఁ
బ్రకటాత్మీయపురాకృతోజ్జ్వల మహాభాగ్యమ్ముగాఁ జూడఁగా. 20

కం॥ పతిభావ మొకటివిడి యా పతివ్రతలు దలఁచిరఖిల భావములందున్
గతిమాకన్నను లేదని చతురతరమదీయవాక్యసంగతివలనన్. 21

వ॥ మఱియు నమ్మహిళామణులకే నొక్కొక్క సమయంబున. 22

## బుద్ధుఁడు త్రిపురాసురులకు బోధించుట

కం॥ శక్తిస్వరూపలగుటయొ శక్తియె మూలమ్మనుచు సంపదలకున
వ్యక్తులయియుండఁదగదీ ప్రాక్తనధర్మమ్ము మిమ్ముఁ బాపాసరించెన్. 23

కం॥ పురుషులకంటెను మిక్కిలి వెరవరు లంగనలు ధైర్యవిభవములందున్
సరిలేనివారలయ్యును దరుణులు గృహగర్భములను దాఁగఁగ నేలా. 24

కం॥ తలకెక్కె హృదయమెక్కెన్ బలికింపన్ దనదుమాటబలిసిని ద్రిమూర్తుల్
వలచితమ వెంటఁబడఁగా వలపించెను జాతి సాటివారలుగలరే. 25

గీ॥ మీరు కనిపెంచఁ బెద్దలై వీరలైన వారు గాళ్లువచ్చినవారు వీరు
పురుషసింహులమంచు వాపోదురకట తలఁపరింతయు మీజాతిఁ గలుగుగొప్ప.

కం॥ లలితాభట్టారిక పదముల గొలిచెడివారెగా త్రిమూర్తులనంగాఁ
గలజగముసృష్టియెల్లను గలుగును మీ సుఘురమైన కనుబొమలసుడిన్. 27

మ॥ వివిధోగ్రాహవవైరి మారణకళా విఖ్యాతుఁడౌ వీరుఁడే
యవుఁగా కింద్రియకుంభికుంభదళనవ్యాపారపారీణుఁడే
యవుఁగా కూర్జితసర్వశాస్త్రనిగమవ్యాసంగనిష్ణాతుఁడే
యవుఁగా కెవ్వరుఁ గాలిబొమ్మలుగదమ్మా మీదు వాల్గంటికిన్. 28

మ॥ జలధిప్రావృతమౌ విశాల ధరణీసామ్రాజ్యముం గూడ జం
చలయున్మత్ప్రణయ ప్రసూనకటిల వీక్షాకాములై వీడు దు
ర్బలులన్ దైవములంచు నీ పురుషులన్ బాటింతురే చేతిలో
పలికీల్బొమ్మలుగారె యెవ్వరయినన్ భావింపస్త్రీజాతికిన్. 29

కం॥ మిము మీ రెఱుఁగక పురుషుల, సమధికభక్తిని భజించి సహజమ్మగు మీ
దు మహిమఁ గోల్పోవుటకన్న, మానభంగమ్మ కలుగునా! సతులారా! 30

కం॥ అనుమాన బాధమగు సుఖ, మునకయి ప్రత్యక్షసుఖము పోవిడుచుటకం
టెను మౌర్ఖ్యమున్నె యిఁక నై, ననుగనువిచ్చేదరు గాక నా మాటబడిన్. 31

కం॥ ఉన్నంతలోనె సౌఖ్యము, నెన్నొవిధమ్ములను జెందుటే మోక్షము గా
కున్నదె బ్రహ్మానంద, మ్మన్నది వేఱొక్కటెందు నైనఁ దలంపన్. 32

కం॥ కేవల సుఖానుభవమున. కై వసుధం బుట్టియుండి యది గాదని యీ
జీవమ్ము తనువుడయ్యం, గావించు వ్రతమ్ము లీయఁగలవె సుఖమ్ముల్. 33

కం॥ పురుషులకుఁ జెల్లుబాటఁట, తరుణులఁ బదునాలు వేలదమిఁ బెండ్లాడన్
దరుణికిఁట పాపమగునఁట, పురుషాంతరయోగ మేమి పుణ్యము చెడెనో, 34

సీ॥ సామ్యమన్నంటఁ గోరు రాక్షసులకకట, మీరు గృహలక్ష్ములైతిరే మేలు మేలు
వారిసామ్యమ్ములిటఁ జెల్లుబాటుగావొ, స్వార్థపరులను గొలిచిన ఫలముగలదె?

ఉ॥ రక్కసపందులంత రుదురాకలు దాల్చిరి నేమి కేవులా
చిక్కని మేనబూది గయిసేసిరి దెక్కడి మంచిగంద మీ
చిక్కిరి బిక్కిరి న్నొగటు చిన్నల వన్నెలఁ జేసియొక్కొ యీ
రక్కసి పేరువచ్చెఁ జతురప్రియమూర్తులు మీకు నక్కటా, 36

మ॥ ఒకనాఁడు న్గనరాని దేవుఁడెవఁడో యున్నాఁడు శిక్షించు నం
చకటా సౌఖ్యములెల్ల రోసి కడుదవ్యమ్మైన ప్రాయమ్ము కొం
చక యీ దుర్భర ఘోర నిష్ఠలకు వెచ్చంబెట్టుచున్నారె వెం
డికనైన న్గనుగొండు మేల్కనుఁడు మీరీ దుఃఖదూరాత్రముల్, 37

చం॥ ఎవరికివార యీశ్వరు లహింసయె ధర్మము కర్మబంధముల్
దవులవు పూర్వజన్మ మనృతమ్ము నిరంతర సౌఖ్యసంగతుల్
భవమున సారముల్ క్షణికభావ విశిష్టము విశ్వవిశ్వమున్
వివిధములైన వేదము లవిశ్వసనీయము లెల్లవారికిన్, 38

మ॥ అని బోధించెడి నాదుపల్కుల నమర్త్యారాతి జీవమ్ములా
వనితాలోకముల న్వయోవిభవ దర్పోద్గంధజృంభించినన్
విని కోపించెడి వృద్ధురాండ్ర పలుకుల్వ్యర్థంబు లేకైరి నా
చనుమానమ్మట చెల్లెనెల్లరు నను న్శ్లాఘించి రౌన్నత్యమ్మికిన్ 39

శా॥ నా మాటల్దలపోయుటల్ సతతము న్నా బోధలాలించుటల్
నా మేధన్ గణుతించుటల్ మనమున న్నారూపెచింతించుటల్
సామాన్యమ్ముగ నిత్యకృత్యమయి యీ సాధ్వీజనుల్ భర్త్రుసే
వా మాంగళ్యమునం బ్రమాదపడుచు న్వర్జించి రాచారముల్, 40

ఉ॥ ఎక్కడి భిక్షుకుండె యతఁడెక్కడి చక్కఁదనమ్ము మాటలా
చిక్కని తేనెలన్ జిలుకు చిమ్మెన గ్రోవుల తేటలా సెబా
సిక్కడి కేగుదెంచె నది యెట్టి పురాకృతపుణ్యమో సి యు
మ్మక్క తదీయమంగళ కటాక్షమున న్దరియింప నేరమే. 41

కం॥ అమ్మంగళ కరవిగ్రహు, నెమ్మనముల యందు నెపుడు నిలుపఁగనఁగృతా
ర్థమ్మగు జన్మమ్మని, నిత్యమ్మను భావింతురచటి దైత్యమదవతుల్. 42

కం॥ ఎక్కడి సన్యాసియొ వీఁడక్కట మనధర్మమెల్ల నణఁగించెను దా
రిక్కితవుఁగొలిచిచెడి ర మ్మక్కలు మనవారలందు రందలివృద్ధుల్. 43

మ॥ సరసాలాపవిభంగముల్ మృదుమనస్స్పర్ధల్ స్ఖలద్గోత్రముల్
పునఃపునాలోకనముల్ దరస్మితములున్ బ్రౌఢాంగ విక్షేపముల్
కరణీయ ప్రియకార్య విస్మరణముల్ శయ్యాంతర స్వీకృతుల్
మురిపింపం దలపోయ రాదితిసుతుల్ ముగ్ధేక్షణాద్రోహముల్. 44

మ॥ వటబీజమ్మయినాఁడె నా పలుకు దేవద్రోహికాంతామనః
పుటభూమిన్ మొలకెత్తెఁ బెట్టెఁ జిగురుల్ పూచెన్ ఫలించెన్ మహా
వటమైయూడలు వేళ్ళుపాదుకొనియెం బ్రాకెన్ సురారాతి వి
స్ఫుటసామ్రాజ్య గరిష్ఠ సౌధతలముల్ చొచ్చెన్ విపాటించుచున్ 45

గీ॥ నాస్తికత్వమ్ము బోధించినాఁడ నాఁడు త్రిపురదైత్యుల నెల్ల వధించుకొఱకు
వారికున్నట్టి యాదైవబలము చెఱచి చేటుకాలమ్ము వారికిఁ జేరుటెఱిఁగి. 46

వ॥ నారదుండు సేవింప నొక్కనాఁ డమ్మానినుల నీక్షించి తద్విరహాసహనమ్ము నటించుచు. 47

కం॥ నేఁ డెల్లి వత్తునని యా చేడెలకున్ నచ్చఁ జెప్పి శివునిఁ బ్రసన్నున్
వేడితి నట చని యమరుల గోడెల్లఁ దలఁగఁగ నభవుఁ గోరితి నంతన్. 48

---

## శ్రీ విష్ణు రాయబారము

ఆ॥వె॥ దుర్జయాత్ములయిన నిర్జరారాతుల, బారిసమరగల యుపాయమరసి
చెడ్డదారిబడిరి శిక్షింపవలెనింక, నసురకోటి ననుచు నాత్మఁదలఁచి. 49

కం॥ నను రాయబారమునకై, పనిచెను శంభుండు దైత్యపతులకడకు నే
నును జని పరమేశ్వరు నా, జ్ఞను వారికిఁ దెలిపినాఁడ సర్వము నిట్టుల్. 50

గీ॥ అక్కచెల్లెండ్ర బిడ్డలేయయ్యు మీర, లక్కవమ్మునఁ బోరాడుచుంట మేలే
వారిస్వారాజ్యమిచ్చి యవ్వారి చెఱల, నిపుడ విడిపుచ్చవలయు మీరింక మీఁద, 51

గీ॥ కలసిమెలసియె బ్రదుకుట కర్జమున్న, యేలనిటు పేదలను జేసి తూలపుత్తు
రమరవసులను వారు మీరుంతవారు, కారె! నిరసింతు రే కండకావరమున. 52

కం॥ విడుఁడీ సురకోటిచెఱల్, విడుఁడీ లేకున్న యాస విభవములందున్
వడి రారండర చేతుల విడి బాణము కదనమునకు నిఁక జాగేలా. 53

మ॥ అను నా పల్కులు ముల్కులై కలఁప దైత్య శ్రేష్ఠులత్యంత కో
పనులు గ్రాక్షువినిర్గమద్గహనులై, ప్రాజ్యైకసామ్రాజ్య పా
లనగర్వమ్మునఁ గ్రిందుమీఁదుఁ గన కేలా! రాయబారమ్ము లిం
కను రానిమ్మవఁ జేగుదెంచినసరే, కన్గొందు మా శౌర్యముల్. 54

మ॥ నిటలాక్షుండిట కెత్తివచ్చినను రానీ! రాజ్యమీనేర్తుమే
పటుదోస్సారము చూపువేళ యిదిగో వచ్చెన్మహాపర్వమీ
భటసంఘమ్ములముందు నెవ్వఁడయినం బాణమ్ములన్గల్గ వాఁ
కిటఁ గాల్పెట్టఁగలాఁడె రుద్రుఁడయినం గ్రేడింప నాడింపమే. 55

ఉ॥ దూతవుగాన నీ పలుకు తుంటరిమాటలు చెల్లిపోయె మా
చేతులతీటవో సమరసీమకు సిద్ధముగమ్ము పొమ్ము మీ
నీతులుగట్టిపెట్టి యని నిల్వు సుధాహరణప్రగల్భ నీ
చేఁత్రలు టక్కుటెక్కులిటఁ జెల్లవు శాంబరకర్మకర్మఠా, 56

గీ॥ ఎల్లకాలమ్ము సురలు దా మేలనలెనె నాకలోకాధికారమ్ము మాకులేదె
ఇదియునొక పెద్దతప్పుగా నెంచి యేల, గుహానునిద్రించుహరుల మేల్కొలిపినారు.

కం॥ మా యేలుబడి నమర్త్యులు, నాయుష్మంతులయి బ్రతుకనాసింతురు గా
కీ యెడ వినాశకాలమ్మె యెదురుట కలిగెనేని యది మేలగునే. 58

ఉ॥ హా మ్మెలు సెటికిశా (బదికిపోయితి రేపటనెల్లి మీాదు బీ
రమ్మునను జూడమూ! యనికి రమ్మనుమూ బలవైరితోడు గై
కొమ్మనుమూ! దిగీశ్వరుల (గొవ్వోకయింత యనంగ దేనియుగా
రమ్మనుమీా దురమ్మునకు, రాకేటుపోయెదు వే జనార్దనా. 59

కం॥ అగిరిభిదురము భిదురము నరికంఠవిదారణమ్మునగుచక్రము సో
దరులకుఁగలవని యెఱుఁగుదు మరుదెండీ! వానిమఱువకచ్యుతుఁనికిన్. 60

కం॥ శివదేవునాజ్ఞగాదను నవివేకులుగారుదనుజు లయినదురమునం
దు వెనుకడుగిడరుసుమీా భవుదిచ్చుఅకంటిమంటపై కొననేనిన్ 61

కం॥ హారుదయనెపెరిగినారము హారుదేహారియింపఁదలఁచునా! యటులైనగా
మరిభాగ్యము న్నెకాక యమరులకురాజ్యమ్మునిత్తుమా! తెక తేరన్. 62

వ॥ అని యిట్లుబహుప్రకారమ్ముల దురాలాపమ్ములాడుచు. 63

మ॥ సంపన్మత్తులు మత్తచిత్తులుదురాశాబంధితుల్ ధైర్య ని
ష్కంపుల్ కంపితవిష్టపత్రితయులున్గర్వాంధులాదానవుల్
కింపాకానుభవమ్ముదగ్గఱు నెడన్ లెక్కింపలేరైరి మా
పంపున్వారల తెంపుఁగాంచి వెఱచెన్ బ్రహ్మాండభాండమ్ములున్. 64

వ॥ అంతనేను సముచితమ్ముగా వారలవీడ్కొని. 65

కం॥ రజతగిరికరిగిశివునకుఁ (దిజగద్గురునకును దేవదేవునకుసరిత్
భుజగునకెఱిఁగించితి నాత్రిజగత్కంటకులదైనవృత్తాంతమ్మున్. 66

కం॥ నాపలుకు లెల్లవినివిని
యా పరమేశ్వరుఁడువలికె నంతకుఁగలరా
పాపాత్ములింక నేలా
శ్రీసతిరణ పరికరమ్ము సిద్ధము సేయున్. 67

గీ॥ కాదు శార్ఙ్గమ్ము చక్రమ్ము కాదు కాదు నా త్రిశూలమ్ము కాదు పినాకమైన
నా పురత్రయీ దనుజ నిర్వాపణమున కితరసాధనముల మాట యెత్తనేల. 68



—※ ఈశ్వరుఁడు త్రిపురాసుర సంహారమునకు సన్నద్ధ[illegible]

వ॥ అని మందస్మిత తరంగితమ్ములగు నపాంగమ్ముల నన్నుం గృతార్థుం గావించు నా నిఖిలేశ్వరుని సంకల్ప ప్రభావమ్మున. 69

సీ॥ సర్వ సర్వంసహా చక్రమ్ము రథముగాఁ దారాద్రి తద్ధ్వజ స్తంభముగను
హిమగిరి నొగలుగా నిరుసు వింధ్యముగాఁగ శ్రీగిరి పీఠమై చెలగుచుండఁ
గాలశతాంగ చక్రములు చక్రములుగా నుదయాస్తగిరిశంకు లొరసియుండ
వాసుకి నారిగా స్వర్ణాద్రి ధనువుగా దర్శనమ్ములు పట్టు త్రొక్కులుగాఁగ
గీ॥ వెలయ వేదాశ్వములఁ బూంచి నళినభవుఁడు ప్రణవతోత్రము చేఁబూని పడగ
మీఁది వృషభభీషణగర్జతో వెనుకఁబడని నేమిఘోషార్భటులతోడ నిలచె
నెదుట. 70

కం॥ ఏణాంకధరుఁడు శరధిం, దూణీరముగాఁగఁ జేసి నొరలేని దయన్
బాణమ్ముగాఁగ నన్నుం, దూణీరమునందు నిలుప దొరయుచుఁ బ్రమథుల్ 71

మ॥ హయహేషల్ ప్రణవప్రచారములు శంఖారావముల్ భేరికా
జయభాంకారములున్మద ప్రమథపజ్యాజాత టంకారముల్
స్మయ దుర్వారభటప్రకాండ ఘటితోచ్చైస్సింహనాదమ్ములున్
జయఘోషమ్ములు మిన్నుముట్ట విజయోత్సాహమ్ము వర్ధిల్లఁగా. 72

వ॥ పరమేశ్వరుం బరివేష్టించి రా సమయమ్మున. 73

కం॥ కైదండ నొసఁగె హరునకు, వేదండాస్యుండు భద్రవేదండగతిన్
పాదుకలు దెచ్చి తొడిగెన్, గాదిలి కొమరుండు గౌరి కనుపండువుగా. 74

ఉ॥ స్యందనమెక్కె శంభుఁడు జయాద్భుతమంగళ సర్వమంగళా
నంద విజృంభితమ్ములగు నవ్యనిరీక్షణ భృంగబృందముల్
మందగతిప్రచారముల మానసపద్మ మరందబిందు ని
ష్యందముఁగ్రోలఁగా మధురహాసవికాసి గభీరవక్త్రుఁడై. 75

సీ॥ నానారుబరపుష్ప నవవసంతవిరాజి శార్దూలవాసోవసానుమధురు
గ్రీష్మభానూజ్జ్వలార్చిష్మద్యోజోమూర్తి కారుణ్యవార్షిక ఘనకటాక్షు
శారదకౌముదీసారవిగ్రహరమ్యు సీమంతహేమంత శీతకరుని
సింధువారాసేక శిశిరోత్తమాంగుని కళ్యాణకోదండ కలితభుజుని
గీ॥ మధురగంభీరదరహాసమంజువదను, సీపదరుణితగండవిశేషకాంతి
భ్రుకుటికౌటిల్యపస్పష్టపురవిదాహ, కోపరేఖాప్రకాశితాటోపుహరుని. 76

గీ॥ కాంచిభయభక్తిభావ విక్లబతనొంది, వడవడవడంకె భూతప్రపంచమెల్ల
జయమహాదేవ హరహరజయగిరీశ, పాహియంచునుజగములుప్రస్తుతించె. 77

సీ॥ మూషకవాహనమ్మును నెక్కి విచ్చేసి వెనకయ్యతనతండ్రి వెనుకనిలిచె
మదశిఖావళమెక్కి ముదమొప్ప నేతెంచి క్రౌంచారిసవ్యభాగమున నిలిచె
సారమేయము నెక్కి భైరవస్వామియా పరమేశుదక్షిణ పార్శ్వమలమె
సింహమ్ము నెక్కి గర్జితభీపణుండయి భద్రుండు ముంగలివై పునిలిచెఁ
గీ॥ బ్రమథవీరులు సకలగీర్వాణపతులు, వచ్చినిలిచిరితమతముపట్టులందు
హరునిముఖభావమరసియాయజుఁడుపణవ, తోత్రమునుగదలించెనుత్సుకత
మెఱయ. 78

వ॥ ఇట్లు సకల సన్నాహంబులు మెఱయ దంతువెకలి యుప్పరమేశ్వరుండు మారుతపథమ్ము
నందొక్కచో పిడిసి రణధర్మమ్ము దలంచి సర్వకార్య సమర్థుఁడగు దూతంబుత్తెంచు
సంకల్పమ్మున నున్నంత సుబ్రహ్మణ్యుండు లేచి పితృచరణమ్ములకు మ్రొక్కి సవిన
యమ్ముగా నిట్లనియె.

## —※ వినాయక దౌత్యము ※—

ం|| ఈపీటనున్న వారలు, గోవిదులని వార్యవిద్యా గురుతేజస్సం
భావితులార్యచరిత్రులు, నావారలకాక యెంచ నన్యులుగలరే. 80

వ|| అయిననొక్కమాట వచింతునని సభ్యులఁ గలయం గనుంగొని. 81

ం|| ఈయున్న వారిలోపల, మాయన్న గజాననుఁడు సమర్థుఁడటంచున్
నాయాత్మఁదోఁచు దౌత్యము జేయంగాఁ బిదపఁదమదు చిత్తమ్మనినన్. 82

ం|| ఆరాజమౌళియిట్లను, హేరంబునిగూడినీవు నేగుకుమారా
పోరునకుఁ గాలుదువ్వెడు, వారిన్వారింపు వధము వదలమదెప్పుడున్. 83

సీ|| అనినను జిత్తమట్లయని యన్నయుఁదమ్ముఁడు భక్తిఁబెంపునన్
వినతశిరస్కులౌచు గురువీడ్కొని తమ్ముసాగనంపు మి
త్రనివహమున్మరల్చి పురదైత్యులపీటికిఁ జేరునంత నా
దనుజులు వారివార్తవిని తాముస్వయమ్ముగవచ్చిభక్తితో. 84

వ|| సముచితమ్ముగా వారలం బూజించి యిట్లనిరి. 85

ం|| మేమెంతపుణ్యజనులము, నోములనవియెట్టివాని నోచితిమో కా
నీమీదర్శనభాగ్యము, సామాన్యమె మమ్ముఁజూడఁజనుదెంచితిరే. 86

|| అల్పులముమాకు వాత్సల్యమధికమగుటఁ, బేరుగలిగింప వచ్చినవారుగాక
కాకపనియే మిగలిగినఁగాకిచేతఁ, గబురుబంపినరామె మీకాళ్లకడకు, 87

ం|| శివనందనులుస్వయమ్ముగ, నవరికిదర్శనమునిచ్చిరే యేయెడలన్
భువిధన్యులు త్రిపురాసురు లవుదురుగాకిటకు మున్నయటుగాకున్నన్. 88

గీ॥ ఏమిపనిగల్గినచ్చితిరెఱుకపడద, యానతీయుఁడు చేయఁగానలవియగునొ
కాదొయనునంత వారలఁగాంచిపలికె, విఘ్ననాథుండు మధురగంభీరభణితి. 89

కం॥ పినతల్లికొమరులంచును, గనికరమునుగనక పెద్దగాఱించుటయే
ఘనముగఁదలంచు వారల, ననఘులుగారనుచుఁబలుకనగునా? మాతుల్. 90

గీ॥ ఏలయమృతాంధసులపైనినింతకనలు, వారిరాజ్యమ్ము వారికిఁబంచియిడుఁడు
పరమపాశుపతవ్రతపట్టభద్రు, లయినవారికి నిదితగినట్టిపనియె?. 91

గీ॥ ఎవనిసేవించి నేఁటికినింతవార, లయితిరో సుంతతలపోయఁ డాత్మలందు
వానిశాసనధిక్కార పాపఫలము, మీకురాకుండుఁగాత సుశ్లోకులార. 92

మ॥ అన రక్తాంధసులుల్కిచూచి తగునయ్యా! యిట్లు శాసింప శం
భునిగాదందుమె యెన్నఁడేని నెపుడీ ముల్లోకముల్ దేవతల్
గానియేలంగనుజూచుచుండఁగలమే గుర్రిక్కిళ్లులన్మ్రింగుచున్
మునుమమ్మెంతయు గాసిపెట్టుసురలంబోనిత్తుమా యింతటన్. 93

మ॥ ఎవరో యొక్కరె యేలఁ గావలయుగాని! మేమునవ్వారు నీ
భువనమ్ముల్ పరిపాలనల్ సలుపుటల్ పొల్లంచు గుర్తింపుఁడీ
యెవఁడాయింద్రుఁడు బ్రహ్మయెవ్వఁడిటఁ దా నెవ్వండు విష్ణుండు నా
భవుఁడైన న్నము నేమిసేయు సురలంబాలింపఁ జేపట్టియున్. 94

గీ॥ శివునిపుత్రకులంచుఁ బూజించినార మవుర వ్రేలాడునీ చేట చెవులవాని
కాఱుమోములకుఱ్ఱని కడలికాదు. భండనము సేయఁగలదేని రండువెఱక, 95

కం॥ అనఁ గినుకగదుమ ననగవునఁ, దనయున్నను నాఁగి యపుఁడు దారకహారణుం
డను నోలుబ్బకులారా, చనిపోదురె యుఱక మీరు సంగ్రామమునన్. 96

క॥ కనుమూసి తెఱచులోపల, జనియించుహరించు సకలజగములు ఫాలా
క్షునితోడి కయ్యమనినఁ, వెనుకాడరు మీరలెట్టి వెరవరులయ్యా. 97

క॥ వెనుకటిరణపరికరమే. యనుకొంటిరొ కాక తెలిసియదిలక్ష్మిపఁ
బనిగొనరొ కాకయీశ్వరు, కనుమంటకుమిడుతదండుగఁ దగవగునే. 98

క॥ సిరి రామోఁ కాలక్షం, బొరకొను మూర్ఖులను గవలిమాఱఁగ నేలా
త్వరపడుడుతరుణమినియే, హరుశరణముఁ జెందిబ్రిదుకఁడసురులు వేగఁ. 99

గీ॥ వెఱపుగల్పించిమైన జీవితములిడఁగఁ, దలఁచిగావించెశంభుండు ధరణిరథము
మేరుకోదండమింకనమేమియుద్ధ, పరికరమ్ములనాబారి బ్రిదుకఁగలరే. 100

వ॥ అని సెనవెడవొదము కినుకంజేసి యంతెనుడుగక. 101

శా॥ తానై వచ్చుగణాధినాథునెమటం దర్పించిభాషించు మీ
మానప్రాణములింతదక్కె నిటుపై మన్నింపఁగావచ్చునే
తానై చంపఁగఁ జేతులాడకిటు వాత్సల్యమ్మునంజేసి యీ
శానుండిచ్చినమానతిం జెఱుపఁగా సంసిద్ధతం గంటిరే. 102

శా॥ విన్నన్నొమ్మన్నను గాళ్లవేళ్లఁబడి మన్నిమైనమాత్రిమ్మునఁ
గన్నుంగానరుగాక దైత్యులిదె యీగర్వమ్ము దూలంగ నా
సన్నమ్మయ్యెనుయుద్ధ మీశ్వరశరజ్యాఘోరనాదమ్మునఁ
విన్నఁబోదురొ, ఖిన్నులేయగుదురో, వీర్యమ్మెచాటింతురో. 103

వ॥ అటుచాలి నిలిచెదరుగాక, యని మఱియు. 104

శా॥ నన్నే మన్నసహించితుగాక తెగువన్నామ్ముం బటం బూజ్య మా
యన్నన్ సర్వకళాస్వరూపుఁ ద్రిజగద్వ్యాపారనిర్వాహ్ను తా
భ్యున్నత్యర్ధసమర్చితాంఘ్రియుగు దంష్ట్రోదారధారాపరి
చ్ఛిన్నక్రివగజేంద్రదైత్యునఘుం జేటాడ సైరింతునే. 105

శా॥ అన్నన్న నవ్వుఁచు వారలిట్లనిరి మీ యన్నయ్యనే కాదు వే
నిన్నుంగూడ నొకింత యేమెఱుఁగమా నీతండ్రియా పౌరుష
మ్మెన్నం జేసియు విస్మరింపఁగలమా యీరోస మేలయ్య మీ
యన్నల్ వేవురు మీరు వేవురును రండయ్యా రణాగ్రమ్మునన్. 106

శా॥ దేవానాంప్రియ శాసనమ్మునకు భీతిల్ లోఁగువారంచు మీ
భావమ్మందును దోఁచెనే మొ త్రిపురీపట్టాభిషేకక్రియా
శ్రీవర్ధిష్ణులు రాక్షసోత్తములు నిస్సీ యెందుగుం దేటికిన్
గ్రీవమ్మిచ్చునె పారమేయశిశువుల్ గిట్టాడిమట్టాడదే. 107

కం॥ వంకరటింకరగుణమా, యంకింపఁగరాని ధర్మమదియొక్కటియా
జంకుటయఱమగతనపుం, బింకమ్మునకౌర యెట్టివింతలుపుట్టెన్. 108

ఆ॥వె॥ అరదమింతయింతయుదుకులప్రోవంట, బడుగుతాతబండిగడుపునంట
నీటఁజిలికియున్న మేటిబాణమ్మంట, బ్రదుకవచ్చునెటుల రాక్షసులకు, 109

ఉ॥ కోపము లేదు మీరు పసికూనలు గావున మీదుమాటకున్
రేపటసంగరమ్మున వరింపఁగ రండు జయేందిరం బదా
టోపము లేల మెక్కుట కుడుంతివినాయక కావపూపముల్
పావకుమార త్రాగుటకుఁ బాలునుగావివి యస్త్రశస్త్రముల్. 110

వ॥ అని యుల్లసమ్ములాడినవారిం గనుంగొని. 111

శా॥ ఈపద్మోపవిష్టుండి తాన్యుఁ డరుణద్వీపాదరస్మేరుఁడై
భాషించెంగజవక్త్రుఁ డీశ్వరకృపావాక్యమ్ము లుల్లమ్మునన్
ఘోషింపన్ ఫణిరాజసుందరఫణా కూర్పరాత్మశుంభాగ్రభా
గేషచ్చాలనపుష్కరధ్వనివచో హేవాకపాకమ్మునన్. 112

శా॥ ఈ యైశ్వర్యము నీబలమ్ము విభవమ్మా సర్వసౌభాగ్య సు
శ్రీయెల్లన్ హరుకంటిమంటగయి యర్పింపగనున్నారె మీ
శ్రేయమ్ముంగణియించిచెప్పెదను విశ్వేశ్రియమొమ్మ వాంఛించుచో
వేయేలాసమరాంగణమ్మున కీఁకన్విచ్చేయుఁ డిష్టార్థమై. 113

ఉ॥ పద్మపదములర్చించుటకు భాలకుఁడీశ్వరశాసనమ్ము మీ
కెల్లనుసమ్మతమ్మగునొ యేర్పడఁజెప్పుఁడు కాదొ కాసిచో
నెల్లయభీష్టముల్ సరిగనివ్వడ మీరలుదీర్చికొందు రం
డెల్లిరణాంగణమ్మున సమీహితకార్యము నిర్వహింపఁగా. 114

కం॥ అనుటయునొంటొరు మొగములఁ, గనుఁగొనిపురదైత్యవరులుకలకలనగుచున్
వెనకయ్యతోడఁబలికిరి, వెనుచూపురుముందుచూపువిశదముగాఁగన్. 115

శా॥ ఓవిఘ్నేశ్వర యెల్లభోగములయం దొక్కింతలోపమ్ములే
కీవిశ్వమ్మున నేక కల్పములు మే మేకాతపత్రమ్ముగా
శ్రీవర్ధిల్ల భవత్కృపావశత శాసింపంగఁ గన్నార మిం
కేవాంఛల్మదిలేవు నున్నదొకఁడే యే తెంచెనాకోర్కెయున్ 116

వ॥ అద్ది యెయ్యది యంటేని. 117

శా॥ ఫాలాక్షుండటులంత వాఁడుదమపై బ్రహ్మాండసిద్మాలనా
భీలమ్మైన మహాప్రయత్నమున దావిచ్చేయయుద్ధార్థియై
తూలంబోరుపురాసురుల్ హరుని యాదోర్దండచండక్రియన్
మేలంచున్ సడిజెందిచచ్చు టయినన్మేలౌను మాబోంట్లకున్. 118

శా॥ సారూప్యమ్మును గోరనెవ్వరమును౯ సాలోక్యసామీప్య వాం
ఛారాగమ్మును లేదు మామనములన్ సాయుజ్యసంసిద్ధియే
కోరంబడ్డది యద్దిగూడ నిటు చేకూరంగనున్నప్డు ని
ష్పారమ్మైన భవమ్ముకై యెవఁడు చేసాఁచు౯ గణాధీశ్వరా. 119

ఉ॥ మాటకుమాటవచ్చి యభిమానముపెంపున మిమ్ముఁబూజ్యులన్
నోటికివచ్చినట్లనిన నూతనదోషము౯ క్షమింపఁగా
మాటికిమాటికియ్యవె నమస్కరణమ్ములు వోయిరండు మా
మాటగనిశ్చితార్థమును మాపతికిం దగవిన్నవింపుడీ. 120

క॥ అనునాదైత్యప్రవరుల, వినిశ్చితార్థమ్ముఁ దెలిసి విస్మయపడుచు౯
దనమది మెచ్చెఁ గుమారుఁడు, వినాయకుఁడును దదీయవిజ్ఞానమ్మున్. 121

ఆ॥వె॥ ఇట్లు మెచ్చి పారలేక వాక్యమ్ముగాఁ, బోయివత్తుమన్నఁ బుణ్యజనులు
వారిగారవించి పనుపంగఁ జేరిరా, హరునిసుతులు వేగ హరునికడకు. 122

ఆ॥వె॥ చేరివిషయమెల్లఁ జెప్పినసర్వజ్ఞుఁ, డేమి యేమియనుచు నెదను మెచ్చె
విస్మయమ్ము పడిరి విబుధులు ప్రమథులు, దైత్యవరుల నిశ్చితమ్ము తెలిసి, 123

— * రక్కసిరాయబారము. * —

వ॥ అంత నావీటివారెల్ల నారేయిఁ ద్రిపురవిశేషమ్ములు, వారిబలగౌరవమ్ములు, భక్తిభావమ్ములు, సదాచారసంపదలును, శివనందనవచోమృతమ్ములందని వారవిని, విని, విస్మయమాన మానసమ్ముల, నిట్టివారిమార్కొనఁగంటిమని తలంచి రంత వేగుటయు సర్వసన్నద్ధులై, యథాచారమ్ముగ యుద్ధమ్మునకు వెడలునెడలఁ, ద్రిపురాసురుల యనుమతమ్మున నొక్కదూతవచ్చి సముచితమ్ముగాఁ బరమేశ్వరు సందర్శించి వినతుండై యిట్లనియె. 124

గీ॥ అర్థులయ్యును మీకుఁ బ్రత్యర్థులయిన దనుజవరులను సైరింపఁ దలఁప మిమ్ము
వేడుచున్నారలే యుద్ధభిక్షనొసఁగ, ననుమతింపఁగ నమిత్రోత్తమాంగులగుచు 125

గుర్వనుభావులెల్లరు, వినూత్నవధూగ్రహణాభిరాములై
పర్వ విలాససంపదలు వర్ధిలఁగా గుమిగూడిరొక్కటన్. 135

మ॥ భవసంఘేశసమిజ్జ్వలద్దహన దుర్వారక్రుధాభీషణీ
భవదాస్యుల్ భవదాస్యబంధహరణప్రౌఢప్రభావోన్నతుల్
భవశంభోజయవాదముల్ సమరభూప్రస్థానభేరీధ్వనుల్
వివిధామ్నాయపదమ్ములొండొకటితో వియ్యమ్ముసంధింపఁగా. 136

మ॥ హరిహేషల్ గజఘీంకృతుల్ సుభట సింహారావముల్ నేమిని
స్స్వరఘోషమ్ములు చాపటంకృతులు విస్ఫూర్జత్కరాళ ప్రభా
తరవారి గ్రహణప్రకార జనితధ్వానమ్ములుఁగన్ క్రమ్మ యా వ
చ్చిరి నాశీరముఖమ్ముఁజేర నసురశ్రేష్ఠుల్ పురాధిష్ఠితుల్॥ 137

వ॥ అంత. 1 8

— ❋ త్రిపురాసుర యుద్ధము ❋ —

కం॥ ఆసైన్యమునీసైన్యము. డాసెంగల్పాంత కటుపటహానా దమ్ముల్
రేసెంబరస్పరమ్మును. భాసిలెపెచీగభీరవారాన్నిధులై॥ 139

శా॥ మున్నెన్నండు నెఱుంగనా దితిసుతప్రోద్దామయుద్ధమ్ము లా
సన్నాహమ్ములు యుద్ధపద్ధతులు శస్త్రశ్రేణు లస్త్రమ్ములా
విన్నాణమ్ములు వింతవింతలగుచు న్వేయేల మాకెల్లనున్
గన్నుల్ చీఁకటిక్రమ్మె నొక్కత్రుటిలో గర్వమ్ముఖర్వమ్ముగా॥ 140

శా॥ ఆవేళన్నగజ వక్త్రుఁడున్మదరణ వ్యాపారధౌరేయుఁడై
గ్రీవమ్మెత్తి పలాయమానసుభటశ్రేణిన్ విగర్హించి శం

డావేగమ్మున ఫూత్కరించి నిలిపెన్నెలింప విద్రోహులన్
దేవజ్యేష్ఠులు నిల్చిరా వెనుకమందీభూతచైతన్యులై॥ 141

మ॥ అదినైరింపక రాక్షసప్రవరులుద్యత్సింహనాదార్భటిన్
మదహస్తీంద్రములెక్కి సంకులశరామర్దమ్ము దుర్దాంతమై
చమువన్విఘ్నవిభుండక్షీణతర శస్త్రిచ్ఛిన్నుఁగావించి స
మ్మదముంజెందె దియోకచ్చిరంత మరలన్మత్తేభవిక్రీడలన్। 142

శా॥ ఆవిఘ్నేశుఁడు నాగజేంద్రములు శుండాఘాతభీతమ్ములై
పోవంద్రోలుచుఁ గలఁగేల రిపులంబోనీక మట్టాడుచున్
చేవంగ్రమ్మఱు వారలస్వసరిపై చెన్ ఘోరవారాశిపై
చీవిక్షోభగతాస్త్రమై చనియనిస్సీమప్రతాపమ్మునన్॥ 143

శా॥ అంభోరాశిని వేయగాఁబడియు మాయాదక్షులా రాక్షసుల్
కుంభీంద్రాస్యుని పైకిదూఁకి శరముల్గుప్పించి నొప్పించి రా
శుంభద్వీర్యము మెచ్చికొంచు మదవచ్ఛుండాసముద్బంధనన్
శంభుజ్యేష్ఠసుతుండు ఖంచిసలిపెన్ శార్దూలవిక్రీడనల్॥ 144

మ॥ శివవిష్ణుప్రధితాంశసంభవుఁడు రాశీభూతకోపాగ్ని భై
రవుఁడుగ్రాహవపండితుండు నఖధారాచ్ఛిన్ననీరేజసం
భవమూర్ధానుఁడు భస్మసాత్కృతమహాబ్రహ్మాండభాండుండు భై
రవవాహమ్మును నెక్కి దా వెడలె సంగ్రామక్షమాసీమకున్॥ 145

ఆ॥వె॥ గ్రామసింహమెక్కి కదనమ్ముఁ జేయఁగా, వచ్చెననుచు దైత్యవారణేంద్రు
లొక్కపెట్టుదాఁక నుక్కడగించె సం, గ్రామసింహుఁడగుచు స్వామియంత॥ 146

కం॥ ద్విరదములరదములయ్యెను నరదములరుదయ్యె హరులుహారములయ్యెన్
సురవైరియసురులాసం గరముగరమ్మగుచుఁగవదు కదనము నెందున్॥ 154

ఉ॥ చచ్చిరిచచ్చిరన్న నిశిచారులెక్కమ్మఱి వచ్చుచుండఁగాఁ
నచ్చెరువయ్యె నాపురములందుఁగలట్టి సుధాసరస్సులోఁ
జొచ్చెనుమాయధేనువయి చొచ్చిసుధారసమెల్లఁగ్రోలె నా
మచ్చులమాయలాడు బలమర్దనుఁడీశ్వరశాసనమ్మునన్॥ 155

చం॥ అలసెఁగుమారుఁడించుక గజాననుఁడుండల యూరగించెఁదా
సొలసెను గాలభైరవుఁడుచూపొకయింత మరల్చెఁభద్రుఁడా
కలకలమందురాక్షసులు గర్వితులై మినుముట్టఁదాఁకుచోఁ
బలపలనయ్యె భూతభటవారముశంభుఁడు నంతనవ్వుచున్॥ 156

—※ త్రిపురాసుర సంహారము ※—

శా॥ రక్షోవీరులకామితమ్ము నిజవేర్పంబూని, తానై, సమిత్
భిక్షాదానముసేయఁగానరిఁగె నుర్వీస్యందనారూఢుఁడై
చక్షుఃక్రూర సువర్ణచాపవిలసచ్ఛ్రుతిశ్శ్రవోజ్యాధ్వనుల్
రక్షఃకుక్షి విదారణమ్ములగుచున్ బ్రహ్మాండముల్ నిండఁగా॥ 157

సీ॥ కనుమూయఁగారాదు,కనుమూయజగమెల్లఁ, బ్రళయాంధకారనిర్మగ్నమగును
గనువిప్పఁగారాదు కనువిప్పబ్రళయాగ్ని మండునుబ్రహ్మాండభాండపటలి
చేసాఁపగారాదు, చేసాఁచెనేనియు, నాశాగజమ్ములల్లాడిపోవు
హుంకరింపఁగరాదు, హుంకరించెనయేని, గళకాలకూటమ్ముకాల్చుజగము.

గీ॥ చిత్రమే లోకమునుగస్తిఁజెందకుండఁ, ద్రిపురదానవ సహాయుద్ధకపటకోష
వేషభీషణుఁడయ్యెన శేషభువన, కందుకక్రీడనాగార గర్భభరుడు॥ 158

శా॥ ఘోరమ్మైన తదీయయుద్ధమున నాక్రూరాత్ములారాచ్చరుల్
దోరుత్క్షిప్త మహాస్త్రశస్త్రనిచయుల్ దుర్వారవీర్యక్రముల్
వైరమ్మింతటఁ దీరెఁ బొమ్మనుచు శుంభద్వేగులై తాఁకి రా
శూరుల్ శాంభవవాహినీంద్రి రుధిరస్రోతమ్ములన్దేలుచున్॥ 159

సీ॥ వేదాశ్వముల నెక్కి విటతాటనమ్ముగాఁ, దాండవమ్మాడెడు మండగేంద్రు
తాతగడ్డముదువ్వి, చేతితోత్త్రములాగి, పరిహాసించెడుపోటుబంటుమగలు
రథచక్రములు కూబరముబట్టి యాడింపఁ, బంతగించెడివింత హొంతకారు
లా వేగమునఁ గేతనాగ్రమ్ముపై దూకిఁ, విఱుగఁద్రొక్కఁగఁ జూచు మొఱకువారు

గీ॥ నయిన తిగఁబ్రోలిరక్కసియాగడములు, గడవ శక్యము గాదయ్యెఁ గలనిలోన
వీరవారమ్మునందునెవ్వారికేని, శంభుఁ డేమంచుఁ బలఁచెనో స్వాంతమందు॥ 160

గీ॥ కానిపౌరుష మెక్కడ లేనిబలముఁ, బూనిమూఁగిరి యామూకఁ మొగ్గతిలగ
వీరభైరవహేరంబ తారకాద్యు, లధికసంరంభకటుఘోష విఘుసులగుచు 161

కం॥ సైరింప రించుకేనియు, వారింపరు వారిధాటి వరదర్పమునన్
గారింపరు దారించరు, వారలవీరమ్ము దైత్యవరులయ్యెడలన్॥ 162

కం॥ అదిమకోదండగురుం, డా దైత్యులబలముచలము నటుచెల్లంగాఁ
గాదని సువర్ణపర్వత, కోదండము నెత్తి కురిసె ఘోరశరమ్ముల్॥ 163

కం॥ కురిసినఁ బిఱుదివిజులకయా, గిరికోదండమ్ము నెక్కి క్రీడించిరియా,
పురదైత్యులెంతవారో, విరించనుఁడు నొగలిమీఁద వ్రేలెవివశుఁడై॥ 164

వ॥ ఇట్లుఃక్క విఁగిలిన యా రక్కసులను గంటిమి, మా కక్కజమ్ముగను వెక్కసమునయ్యెఁ. నయ్యెడ ధనుశ్చాలనమ్మున వారిం దూరమ్ముగాఁబడవైచి మెచ్చినచిత్తమ్మున, నొచ్చిన తనువున, మచ్చరమ్ముచ్చుపడుచుఁ పుల్దూపుఁగయికొని. 165

కం॥ దరహాససుందరుండై, యరదము పైనున్న యసుర లఱవఱబఱవన్
శరవర్షమ్ములఁ గురియుచు. విరించి లేనెత్తి, తేర్చి పినుమాళికరున్॥ 166

వ॥ వేగంటి వింటిఁ ద్రాఁటివెంటఁ బాఱగి హాలాహలజ్వాలాభీలమ్ములగు శరజాలమ్ములం గుప్పిన, విచ్చియు, నొచ్చియు, వెఱచియు, జఱచియు, గనుకనిన్వైను వెనుకొఁడిగియు చీకాకైన నా రాకాసి మూకలం జోకాఱ్చు మహామమ్మ హరసియమ్మ హామోగీశ్వరుండు. 167

కం॥ హుంకారమ్మొనరింప న, హంకారము దక్కి చొచ్చిర సురులు పురముల్
టంకారభీషణుండై, శంకరుఁడా వెంటఁ దగిలె జయ వెట్టసురల్॥ 168

చం॥ పురములఁ జొచ్చి గొల్చిరల పుణ్యజనుల్ శరధిప్రభూత, మీ
శ్వరకరుణాప్రసాదితము శాంకరలింగ మనంతభక్తిమై
పురదనుజాంగనల్ దమదు పుణ్యసతీత్వము రిత్తఱటాటకున్
గరముభయమ్ముఁ జెంది క్రతుఘస్మరు సంస్మరియించిరత్తరిన్॥ 169

కం॥ ఆవేళ నొకటఁ జేరిన, దైవద్రోహుల పురీవిదాహము సేయన్
భావించి సన్నువింటన్, గావించెను సజ్జమపుడు గరగళుఁడంతన్॥ 170

చం॥ పురములనుండి ఘోరశరపూరముఁ జిమ్ముచు దానవేశ్వరుల్
గిరివరకార్ముకుం గదియఁ గేవలపీవరసోజ్జ్వలాకృతిన్
స్మరపరిపంథినేత్రితటజాజ్వలదగ్ని సమగ్రముగ్ శ్రీవః
పరిచితమూలమున్ దిగిచి వైచెను మన్మయమైన బాణమున్॥ 171

కం॥ కోపమ్మొక్రతుఘస్మరు, కోపము చాపమ్ము, వెడలి, కుటిలారిఘటా
టోపప్రతాపశమ, యమ, రూపము త్రిపురములఁ గాల్చె రూపణఁగించెన్॥

శా॥ అందా రాక్షసపూజితమ్మయిన లింగాకారమొప్పెన్మధు
స్యంది శ్రీదళ కుందపుష్పతులసీ స్రక్చంద నాలంకృతుల్

కంఠమ్ముఁగా సఫలమ్ముసేయఁబురరక్షస్సంఘతేజమ్ము, నా
యిందూత్తంసుని యందుఁడిందెనప్పుడే మెంతేని మోదమ్మునన్॥ 173

కం॥ మంగళముసర్వమంగళ, మంగళవిగ్రహునకమృత మయమధురకృపా
పొంగునకు నంగజారికి, గంగాసంగోత్తమాంగ కమనీయునకున్॥ 174

సీ॥ మంగళంతేసర్వ మంగళాహృదయాబ్జ, మధుకరేంద్రాయ, నమశ్శివాయ
వందనమస్తు తే, వందారుజనబృంద, మందారతరవే. నమశ్శివాయ,
ఫణిఫణామణిరత్న భాసురదేహాయ, స్మరశాసనాయ, నమశ్శివాయ,
ముగ్ధేందుచూడాయ మునిమనస్సంగాయ, మదరితుకాయ, నమశ్శివాయ,
గీ॥ మత్తదనుజేభహరయే నమశ్శివాయ, మలినతామిస్రహరయే, నమశ్శివాయ.
మార్గణీభూతహరయే నమశ్శివాయ, సుకటకేష్టితహరయే నమశ్శివాయ॥ 175

కం॥ నిట్టూర్పులు తురగములా, పట్టెను. యరచమ్మ! కడపుమానిసి తాతా
ముట్టినబస్సను గుణమా, యెట్టుజయించితివి దేవ! యీత్రిపురములన్॥ 176

ఉ॥ పట్టినయట్టికొండయొక బంగరువిల్లయిపోయె, దానికిన్
గట్టిగనత్రాడు జిహ్మగజగత్పతియయ్యెను, నెక్కుపెట్టగన్
దొట్టునజిహ్మగమ్మదియు ద్దనుజాంతకమైనలక్ష్యమా
పట్టణముల్ విభిన్నమయి భస్మముగావె పురాణధన్వికిన్॥ 177

కం॥ అచలరథమచలధనువును, నచలేశ్వరమైనశరము నాఘాతమునన్
బ్రచలత్పురములఁగాల్పఁగ, నచలేశ్వరు నిల్లటికపుటల్లునకెతగున్॥ 178

కం॥ వేదండాననగురుఁడవు, కోదండాగమపురాణ గురుఁడవ్రనగునీ
పాదాంభోజమరందా, స్వాదముదయసేయఁగదవె శంకరమామకున్॥ 179

కం॥ శరధిశరధియనియన, నం, బరాంబరుండనఁగ మదనమదనుండనఁగా
సరికాలకాలుఁడనఁ బుర, హర, హర, నీసాటినీవె యగుదువు రుద్రా॥ 180

కం॥ స్తుతియింప నెంతవారము నుతియింపఁగనెంచినంత మాటలెకానీ
కృతసుర రక్షణునకు నూ, కృతజ్ఞతాసూచకములు కేవలముశివా॥ 181

శా॥ సంప్రార్థింతు మజస్ర శ్రావకపదాప్త్యాషాఢ హృన్నానిరాట్
సంప్రీత్యమ్ముల, పుణ్యహైమవత వాస్సంతానవీచీయశ
స్సంపత్తిన్నమ్ముల శేషలోకసుచిరశ్రేయసమ్ముల్ నమత్
కింపాత్రష్ఠహరమ్ములా వెలుఁగులందింపంగ విశ్వేశ్వరా. 182

మ॥ సభరమ్ముల్భవసంగతుల్ శివనమశ్శబ్దార్థముల్ బాడ దే
వ భవత్పాదము నందనిత్తుము యవపాపమ్ముగా మోహామో
యభవా! నీకు నిరంతరస్మరణతో వ్యాపార మంత్రార్థముల్
శుభవస్త్వర్థము వీనిఁ గైకొనుము మెచ్చంజూపు సర్వేశ్వరా!॥ 183

శా॥ నీ యిల్లాలికిఁ గాన్కలిచ్చెదము తండ్రీ! చిత్రశాస్త్రాలముల్
మాయాకూరవిహారముల్ కృతమనోమంత్రార్థ సఖ్యమ్ములున్
శ్రేయఃకాముగ వీవిదారణములున్ శిక్షించి మన్నింపుఁడీ
మీయంఘ్రిస్థిరపుణ్యసంగమిడి సామీ! మమ్ము మీ దాసులన్॥ 184

సీ॥ స్వామిమీముఖచంద్రదర్శనమువలనఁ దనరుమాముఖకుముదకాననము విడిచి
చెలఁగిమీపాదపద్మముల్ చేసు తేటి తేటగీతులు చిత్రాబ్జతృప్తినిడవె॥ 185

ఉ॥ చంపకనాస పద్మముఖ, సారసగంధి, నవోత్పలాక్షి, సే
వింపఁగ మిమ్ము వచ్చె రసవిశ్రుతవృత్తి! భవన్మనమ్ము రం
జింపఁగఁ జాలు నా విబుధశేఖర! రాజవతంస! యైన మ
న్నింపఁగదయ్య మా పలుకు నిర్మలభక్తిభరన్ సరస్వతిన్॥ 186

శా॥ అంచుం బ్రస్తుతియించుచుమ్ముదయతో నాశీర్వదించెం దథా
స్తంచు న్రాక్షసపూజితమ్మగుచుఁ బున్నామ్మైనలింగమ్మును౯
బంచబ్రహ్మమనుస్వరూపమును మన్నాభగించెనత్రమ్మునన్
బంచారామములందు నిల్చియుషియున్భక్తాళికల్పాళిగా॥ 187

కం॥ ఉపసంహారించెనీశుఁడు త్రిపురాసురహరణకృతపరికరము నెల్లన్
గపటముని వేషదోషము నపుడే గాంచీశుఁ గొలువనడఁగెను బిదపన్॥ 188

కం॥ ఇదిత్రిపురాసురవిజయము విదితమునిఖిలాగమాంతవిశ్రుతమగుటన్
జదువవినఁగనినవారల కొదవించునఖండవిజయమున్నతపదముల్. 189

చం॥ అమలినమౌనివృత్తినిగమాగమకోవిదలింగయూనధా
న్యమృతపయోధిజాతకమలాలయదార్ఢ్యచరిత్రదుర్గమా
విమలమనోంబువాహపదవీశరనాగమపారకౌముదీ
రమణునితోడభవ్యగుణరత్నమహోదధితో సుధీంద్రుతో॥ 190

కం॥ కింకవికరిపంచానన వేంకటసుకవీంద్రహృదయవీథీగగనా
లంకారశారదీయమృగాంకునితో మల్లికార్జునారాధ్యునితో॥ 191

స్వాగతము:— శీలరమ్యగుణసింధునితోడన్
బాలచంద్రధరభక్తునితోడన్
శాలవేళితనుభ సురలక్ష్మీ
శాలితో మతివిశాలునితోడన్॥ 192

మ॥ హరపూజాపరమేశ్వరుండయిన మల్లారాధ్యపౌత్రుండు, సు
స్థిరభక్తిం దమతండ్రిపాదములవాసింగూర్చి కాంచీపురీ
శ్వరమాహాత్మ్యమునందు మూఁడవడియాశ్వాసమ్ము దీనిన్మహే
శ్వరుఁడాసూర్యమునాసముద్రమును, శశ్వత్ప్రీతిఁ బాలించుతన్॥ 193



# కాంచీఖండము.

చతుర్థ ఆశ్వాసము – 224 పద్యములు.



కం॥ శ్రీమహితబహుళశిష్య, ప్రేమార్ద్రపదాంబుజాతరేఖాఘటిత
శ్రీమహితవిభవుతోడన్, శ్రీమల్లారాధ్యపుత్రసింహముతోడన్. 1

కం॥ అని హరి చెప్పినయీకథ, మునులకువినుపించు సూతమునిఁగనుఁగొని య
మ్మునివృషభులనిరి యనఘా యనంతరకథావిధానమది తెలుపఁగదే. 2

కం॥ హరిచరితపుణ్యకరమై, హరచరిత పవిత్రకరమునై యిర్వుర శ్రీ
కరచరిత మోక్షసామ్రాజ్యకరమాలింగన విశేషసౌఖ్యముసఁడదే. 3

వ॥ అని యడిగిన వారలకా కథకుండిట్లనియె. 4

చం॥ ఘనతరభక్తిఁబొంగుచు జగత్పతివిష్ణుఁడు శంభుగాథలన్
ననిచిన వేడ్కఁబల్కునెడ, నవ్వు మొగమ్మున భక్తిభావముల్
మునుకొనవాహినీశ్వరుని ముద్దులపట్టి. మునీంద్రసంఘముల్
గనుఁగొని యాత్మవల్లభుని కాంతచరిత్ర మెఱుంగ వేఁడుచున్. 5

కం॥ వల్లభుఁగనిలజ్జారుణ, ఫుల్లాంబుజవదన మధ్యమున వెడలు నుడుల్
మల్లడిగొనుచూడ్కులతో, నుల్లాసము మెఱసి యింత యొదిగినయమునన్. 6

కం॥ పురుషోత్తమనామమ్మది, చరితార్థమునీదుపాల జగతీశ్వర నీ
పురిటాలితనము మెఱసిన, చరిత్రవచియింపఁగదవె జలజాక్షయనన్. 7

## —◆ ❊ దారుకావన విహారము. ❊ ◆—

కం॥ చిఱునగవు తెఱలుగ్రమ్మం, గిఱికొను చూడ్కులను మెఱసి కృష్ణుఁడు విష్ణుం
డఱమగమగనాలగుతన, తెఱఁగిటు లౌఱఁగించెఁ దేట తెల్లము గాఁగన్. 8

చం॥ మునులకు మూలకందము తపోవిభవమ్ముల కాటపట్టు శాం
తినిధి గుణాలయము తేజము రూపము గన్నచోటు ధ
ర్మనిలయమాగమశ్రుతి మరాళనివాసము దారుకావన
మ్మననొక యాశ్రమమ్ముగల దాశ్రయమైసకలర్థికోటికిన్. 9

కం॥ కర్మప్రధానవాదులు, నిర్మోహులు విమలనిఖిలనిగమార్థగవి
మర్మజ్ఞుల చటివానులు, దుర్మదలలితేతుఱుతపో విభూమాన్వహులుగుటన్. 10

కం॥ ఆఋషిపత్నీయుధర్మాచారాధారలు పవిత్రచరితలు దారల్
దారలు వారికిపారయగు, వారలునహిరూపపుణ్యభానములందున్. 11

గీ॥ ఎల్లవేదార్థముల యెల్లలెఱిఁగి యెఱిఁగి, పరమశాస్త్రార్థసారమ్ము లరసియరసి
వివిధజపతపమ్ములఁజాలవిసివి విసివి, కర్మబంధమ్ము మానులు గడవరైరి. 12

కం॥ కర్మములంత్యమ్మెవరికిఁ, గర్మమె సమకూర్చుసుఖము కష్టము నిందున్
గర్మమె దైవమ్మని కడు, దుర్మత్సరులయిరి దైవదూషకులగుచున్. 13

గీ॥ వారిబోధమ్ముతలపట్టి వారువారు, కర్మబద్ధులు దైవధిక్కారపరులు
ఘోరకర్ములు హింసాప్రకాశులగుచు. విప్లవముఁదెచ్చిపెట్టిరి విశ్వమునకు. 14

శా॥ వామాచారపరాయణుల్ నిజసుఖవ్యాపారకర్మక్రియల్
కామక్రోధవికారవంచితులు దుష్కాముల్ వికారాకృతుల్

స్వామిద్రోహులు వంచనాత్ములు పరస్వ స్వార్థవిధ్వంసకుల్
సామాన్యప్రజనొంచిరంతముని రక్షసుల్ నిరాఘాటులై. 15

కం॥ అళికమునఁ గన్నుగలయా, లలితా ప్రాణేశునైనఁ లక్షింపవు మా
కొలఁదులవియేల గుడిలో, పలి లింగము గుడిని మింగు వానికి భరమా. 16

గీ॥ అసుర మోహినులకు గేస్తురాండ్రితమ్మె, గార్హ్యవర్తనఁ దమ మాటవణఁగి మణఁగి
చెల గి గృహలక్ష్ములగుచు రంజింపమనము. బలసి లెక్కింపరటఁ ద్రిమూర్తులను
మునులు, 17

గీ॥ వారిగర్వమ్ము త్రిలోకబాధనణపఁ, దలఁచియీశుఁడు దనసన్నిధానమునకుఁ
జేయనను వెంటఁగొని దుర్విశిష్టమునుల, యాశ్రమమ్మునకొకయింతయంతలోన. 18

గీ॥ ఏనుజూచు చునుంటి దానింతలోన. సర్వసత్వాభిరమ్యమ్ము సత్త్వమయము
పురుషసుందర మోహనమూర్తిఁ దాల్చె, సుందరేశుఁడు సుందరసుందరుండు. 19

గీ॥ అల్లదా తొయణింబెండ్లియాడునపుడు కోరిహిమవంతుకూఁతు మైఁగొన్నయపుడు
తనదుశిరమున గంగమ్మఁ దాల్చునపుడు. నెక్కడేనియు లేదట్టి చక్కదనము. 20

గీ॥ ఎత్తినాఁడసురులకై యేమునున్న, మోహినీరూపమును జగన్మోహనమ్మె
లెన్ని యవతారములుగన్న నేలయచట, నపిపదాఅవకళకైన నగునొకావొ, 21

గీ॥ ఎందుఁగనుఁగొన్న నాకున సుందరేశు, మదనమదనమ్ము రూపసంపదలె తోఁచె
స్తంభమునఁగన్న నరసింహ దంభమిల్ల, నుడిగెఁబురుషోత్తమఖ్యాతి యొదిగి
నిలిచె. 22

గీ॥ చెప్పసిగ్గగు మన్న దాచి న్నిలిపుడు, హాసియర్ధాంగిపుణ్యమేమా! యటంచు
నేటిపౌరుషమును నుడుచు నెంచుకొంటి, వింత కోర్కెలు మదివిజృంభించెనపుడు 23

కం॥ ఆకాననమపుష్పమ్మఘు, రాకారము, ముద్దుగొనఁగ నలరుచు రాఁగ
మేన్మేకాగ్రమైన చిగురుం, జేకొనచాపుటలుతోఁ జెఁజిత్రమ్మగుచున్. 24

కం॥ అదిగని సైరింపనిమది, మదనోన్మాదమ్ము చెలఁగ మైమఱచివడిన్
గదియించి బిగువు కౌఁగిటఁ, బొదివితినా సుందరేశు ముగ్ధత్వమునన్. 25

గీ॥ ఒక్కకలకంఠపతిప్రియ యొదిగి యొదిగి, సేయు నాలాపములు మదిఁ జేరనీక
యెగచినను గాంచి కాంచి గొంతెత్తి కూసె, మదను పూచిన పువ్వువిల్లు చెదరినట్లు. 26

వ॥ అప్పుడా సుందరేశ్వరుండు. 27

కం॥ నగుమోమున శశిరమ్యుంటుచు, మొగముంబయికెత్తితగును బురుషోత్తమ! నా
మగువతనముఁ దెలిపెదు నా, నిగనిగలన్మేనఁ జూచి నివ్వెఱపడితిన్. 28

కం॥ కనిమగువతనము గంటినొ, కనకేయుబులైతినేమొ, కనికౌఁగిటికిం
గొనిపోయితినొ, కొనక్కైతినొ. మును వెనుకల నెఱుఁగనైతి మోహపుఁ బలిమిన్. 29

గీ॥ పరమపావనగంగాప్రవాహలలిత, ధవళధవళమ్ము శివుని సౌందర్యమందు
మలినమము నాపవిత్రహసంపదము బోలెఁ, దనివినిడదయ్యె నాదు సౌందర్య
మపుడు. 30

గీ॥ ఉండుఁగాకేమి గౌరి తానుండుఁగాక, గంగయేనియుఁ గాంతుఁడొక్కరిధనమ్మె
యా మహేశ్వరునర్ధాంగినగుట కేమి, దగుమనము గొంటి దాంపత్యధర్మమునకు 31

శా॥ మోహావేశము పొంగిపొర్లనపుడా ముగ్ధేందుకోటీరు, నా
బాహాబద్ధునొనర్చి వక్షమునపయిం బాలింగ్లు హత్తించి, నా
మోహమ్మింతయుఁ దీఱమింబలుమఱున్ముద్దాడుచు న్నాథ, యీ
దేహమ్మున్ స్థిరమంబొనర్చుమని యర్థింపం గృపాశీలుఁడై. 32

శా॥ కాని మోహనపురుషోత్తమా! ప్రకృతమీగర్వాంధులౌ, దారుకా
వానిద్రోహుల గర్వభంగము నొనర్పం బోవున్న నేనింతలో
నీనిష్ఠాపరధర్మపత్నులమన మ్మెట్లుండునో చూతు, నా
పైనిన్నీ మనభీష్టసిద్ధియనుచుం బల్కెం బరారాతియున్॥ 33

వ॥ అంత నేనును. 34

—※ మోహిని దారుకామునీంద్రుల వంచించుట ※—

సీ॥ బోఁగాదనఁగరాని యాజ్ఞనుదలఁబూని, విడియును విడనట్టి యొడలితోడ
నడుగుముందుకు లాగ నెడఁదవెనకకు ద్రోయుచుఁ, దోడిబడుగ మనమ్మునములతోడ
నఱచూపు వెనుబడ నఱచూపు ముందుకొన, మెఱుఁగులీను మోము తెఱఁగుతోడఁ
గౌఁగిలి యెడబాటుగనుటకోర్వనిరీతిఁ, బరికించు చనుదోయి యురువుతోడ 35

గీ॥ మునులమానసగాంభీర్యమును హరించు, మించు మెఱుఁగనూరిక నక్కతో, నిందుకాలి
యుంచకల కలరవము నొంచి పలుకఁ, బలుకఁ బూవులమునులున్న తావుసారఁగ।

గీ॥ శివుని యెడబాసి సైఁపని చిత్తమంత, నభవుఁడలపోసి గీతమ్ము నాలపించె
నాథదయ నేలునీ దాననన్న ననుచుఁ, బులకరింతలనొడలెల్లఁ బలదరింప॥ 36

కం॥ నాగానమ్మును వినునెడ, రాగము మొలకెత్తి హృదయ రంగము నెల్లన్
లోఁగొనుచుం బల్లవించిన, జోగులు విడితపము నిక్కిచొక్కి నిమదులన్॥ 37

కం॥ ఇది యెవతె యొయ్యారమిడి, పొదరింటంబాడు పూవుబోణి యెవరిదే
మిదినన్ను నాథయని యెడు, నదియీ చెలిగాననితపమునా! తమిదీఱన్ 38

కం॥ ఆడుదియు ననిదిగదయ్యా, పోడిమి మనయాఁడువారి పోలిక లేలా
యీ కేఱుఁగర్మఫలమీ, పాడినపాట యెయ్యదార్ధ భావమ్మనన్॥ 39

కం॥ తడఁబడు నడల చెడఁగునను, సుడిఁబడు వెడలింటి యేపుచూపుం దూపుల్
వెడఁద యెడమిట్టిపడు పోగ, రుడుగని చనుగబ్బిగుబ్బ యొప్పిదమవురా॥ 40

కం॥ అనినన్నుఁ దాఁకి మరలని, మనములు జడ నైనచూపు మఱచిన మాటల్ ॥
పనుపడని చెవులు ననిచిన, తనువుల వారగుచు నంతఁ దపసుల్ తేఁడున్ ॥ 41

సీ॥ యోగదండము పైని నొఱఁగి యూఁపలు మువ్వం యొయ్యారముగఁ జూచు నొక్క మౌని
తన చంకఁ గకపాల దగిలించి మొగ మెత్తి, నిక్కి దిక్కులు జూచు నొక్క మౌని
మెడ యెత్తి జడ లొత్తి పైఁ జట్టి కేలూఁగ, నోడ లావులించెడు నొక్క మౌని
జపమాలఁ బెడకేలఁ సవరించి వేలూని, ముక్కు ననిట్టూర్చు నొక్క మౌని

గీ॥ గోచిసరిచూచుకొని లేచి కొంకి నొక్కఁ డాఁచి మునుకుంచి వెనుఁజూచి యూఁగు నొక్కఁడు
పలుకనుంకించి తడఁబడి యులుకు నొక్కఁ డా మదను మిడి నేటఁబడ్డ యమ్మౌనివరులు ॥ 42

కం॥ ముసిముసినవ్వుల రువ్వుల, మిసమిసమను మేని సొగసు మించి సెడు గుబ్బల్
గుసగుసమను పిఱుఁదులపస, యుసురుసురనఁ దుము బెడఁగు నుఱ్ఱూగింపన్ ॥ 43

కం॥ ఒకరొకరి నెఱుఁగకుండన్, వికలమతుల్ మునులు నాదు వెంబడి రంతన్
దెకతేరఁగ దొరకినయీ, వికచాక్షి గ్రహింతుమనెడి వెడఁగుఁదనమునన్ ॥ 44

కం॥ ఈపొదరిని యాపొదరి, నైఁ పదమని కలికి కన్నుసన్నల వారిన్
త్రిప్పుచుఁ దమి రెట్టించుచుఁ, జూపెఁ జెలువింత వింత సొగసులు గుమ్ముల్ ॥ 45

సీ॥ సరిదాఁకఁ జనుదెంచి జడదారి యొకఁడు నా, పైఁ టమీటిన నీటుకోటువడియెఁ
జెయిఁబట్టఁ జెయి సాఁచి చెనకిన ముని నాదు, చేతి తామర వేఁత వ్రేఁతఁబడియె
నాలింగనము సేయ నభిముఖమ్ముగ వచ్చి, తపసి నా చూపులఁ దటపటించె
వెనుబాటునను బట్టు లేచి పొంచిన మౌని, వేణి తాఁకున కింత వెనుకకొదగె

గీ॥ నగవుమోమున వారలనవ్వఁజేసి, యభినయమ్ములవారినాయట్లఁద్రిప్పి
యుబ్బునెడఁదలవారిఁదబ్బిబ్బుపరచి, మించివగలాటపాటలాడించినాఁడు। 46

సీ॥ ఆలింగనముసేయనరిగినట్టులఁ బ్రవాలి, వలయితపాణిఁ గై వారమిచ్చి
యాసక్తిచెలిదండకరిగినట్టులపోయి, యొయ్యారముగఁ బ్రక్కకోసరిల్లి
వెడఁదయురమ్మోమ్మరవిచ్చి వెక్కసుసిక్కి, బెదరుచూపులగుబ్బలదరనిలిచి
కట్టినవెలిసన్నపట్టునించుకయెత్తి, పట్టుచుఁజక్రరూపమునఁదిరిగి

తే॥ చుట్టివచ్చితిమునులురాచట్టులట్లు పెట్టుగుబ్బలమురిపెంపుఁబెంపుసొంపుఁ 47
దెంపుఁగనలేనిచూపులఁదృష్ణమునుఁగు, మదులనాచేతలకుఁదెల్పిమాటుమణఁగ

కం॥ ఒత్తిగిలివారిసటుచని, చిత్తరులగువారిమదులు చివురెత్తఁగనే
నొత్తిరముమీఁదొలినుడి, నొత్తుచుబిత్తరపుఁజూపులోలయుంబాడన్. 48

కం॥ తత్తరపడిమొత్తరపడి, చిత్తజవమ్మునను లేచి చిడిముడిపడుచున్
మత్తిల్లినచిత్తమ్ముల, నెత్తినతమినొకరినొకరు నెఱుఁగకవారల్, 49

సీ॥ ఇదె గా వె మోహినీ! యెందుబో యెదవంచు, జడదారినొకమునియొడసిపట్టఁ
బట్టినఁజెలినాదుపజ్జకువచ్చితే, వెడలెదుసుమ్మని ప్రియముబలికె
పదవెబిత్తరియుల్ల పొదరింటమనయాట, పాటనియొకఁడొకపాణిఁబట్టె
నాటపాటలకేమి యటుపోయివత్తమం, చతఁడాతనికరమ్ముహత్తిలాగె

గీ॥ రా వెదకుచూడ వేలవ రాకుపడకె యనుచుఁబలువింతపలుకులఁ బెనఁగికొనుచు
నొడలెఱుంగనిమదమున జడనుగొనుచుఁగలసితిరిగిరియాకోనకెలఁకులందు. 50

గీ॥ తాముపలికెడుశబ్దమర్థమ్ముగనుక, తలరివర్తించు కర్మసిద్ధాంతపరులు 51
మూఢచిత్తులుపొందుసంపూర్ణఫలము, మోహినీరూపమునమునుల్ పొందిరపుడు

వ|| మాకొల్ల నక్కజమ్ముగా నొక్కకలస్వనమ్ము వీతెంచిన నిక్కిన మెడలఁగౌతుకమ్ము
కడలొత్తు చూపుల నలుగడలంబరికించు నెడల.

సీ|| ప్రష్ఠౌహాగోధేనుపరివృతోన్మదమహో. వృషభసుందరదర ప్రేంఖణమ్ము
కలభీసముహానుగమ్యనూనాభ్రము, కలభమంధరగతివిలసితమ్ము
సింహీపరీవారసేవ్యమానమృగేంద్ర, సరభసగంభీరచంక్రమణము
హరిణీవిలోలనేత్రాంచలలక్ష్యసా. రంగచారణచారుభంగిమమ్ము
గీ|| రాజహంసీవిశిష్టమరాళరాజ, గమనమధురమ్ములగు వింతగతులసతుల
వెంటనిడుకొనియంతంత విభుఁడువచ్చె. దారుమునులున్న పూఁదోఁటచేరువకును 53

గీ|| మధురగంభీరధీరమాన్మథమనోజ్ఞ. మూర్తివలగొనివచ్చు నమ్ముద్దరాండ్రు
తమదుమోహినులంబట్టఁ దలఁచివచ్చు, నలజగన్మోహనులొ యనియాత్మఁ
దలఁకి. 54

కం|| దారుమునీంద్రులు మోహిని, తారకు తారకుమటంచుఁ దమకము వెఱఁగు౯
గూరుకొనబిగువుకౌఁగిటఁ, దారిచిరోఁడౌనుల వేఱుతలఁపనిమదుల౯. 55

కం|| అదియెట్టిచిత్రమో యు, మ్మదనారింజూటియున్న మదవతులంత౯
బొదువుచుఁ బరస్పరమ్మును, బొదరింప్లం దూఱితూఱి పొదలిరి వేడ్కల్. 56

కం|| అంగనలంగనలటులా, లింగనములఁ దేఱితేఱి లీలలు మెఱయం
జెంగటఁబురుషులు పురుషులు, సంగతినాలింగనైకసౌఖ్యమునంద౯. 57

వ|| వారలమ్మహేశ్వరు మాయాప్రభావమ్మునఁ దమతలఁచినచందమ్మున తమతమయాడుఁ
దనమ్ములు మగతనమ్ములు మారుటఁ నేర్పఱింపనేరని తమకమ్ములంబొదలి రట్టియెడ. 58

—※ మునులు మునిపత్నులు పరస్పరము భ్రాంతినందుట. ※—

కం|| తమపత్నిక్కఁబూవుఁబొదగుల, సమదస్మరసమర సృమరఝాంకరణధ్వా
నమణితకలరవములువిని, తమలోనయ్యాలుమగలు తబ్బిబ్బులుగా౯, 59

మ॥ ఇదియేమా! యనిచూచి, చూచెనపుడాయిల్లాలు ప్రాణేశునా
ప్పిదము న్విస్మయచిత్రభావకుతుకా వేగాశ్రుకోపారుణో
న్మదవీక్షావళి, మోహినీకుచయుగోన్మత్తుం బ్రియాలాపునిన్
విదితోద్వృత్తుని. విస్మృతాఖిలకృతీ విస్రబ్ధచారిత్రునిన్. 60

శా॥ ఆహా! నీంద్రుఁడు చూచియాసుదతిఁ దానల్లంత, నిల్లాలిదే
టా మోమున్ గని యెంచి. యెంచికొని కుత్సద్విప్రశాస్త్రాలకే
ఖాముద్రమ్మగుఁ గాద్రి భీషణకటాక్షశ్రేణిఁ బర్వించియా
యేమీ! పాంసుల యెంత దానవయితో సీ యంచు గర్జించుచున్. 61

శా॥ లేవంబోయిన మాని, బాహువులచే లేనీక కౌనూని, యో
పూవుంబోడిరో! యేమియింతయి నీపోకల్ దురూహమ్ములో
నీ వేలాయిటువింత రోసపడెదే మే దోసమిందయ్యెనా?
పూవుల్కానికకైకలత్వమగునన్ బోవంగదే, కోమలీ. 62

కం॥ అనియభిముఖముగ నుండిన, మునియమ్మనిఁ గదలిప్రిదలి పోనీక కడుం
బెనఁగినఁ బెనగుచు నతఁడున్ దనమదిఁ గలవంత నులువఁ దలఁచుచు నుడికెన్. 63

సీ। ఆసతి ప్రాణేశు నదిమి పట్టినయల్ల, మోహాసిరూపమ్ము సాహసమ్ముఁ
దనపతి విధమునుఁ దప్పక గనుగొని, రోసమ్ము బెదరును రూపుగొన్న
మేనిచందముతోడ మెఱపుతోఁచినరీతిఁ, గౌఁగిలిఁ గొనుమనః కాంతు నెడఁగ
నెట్టుచు నట్టిట్టు పట్టినఁ బట్టిన, పట్టును సాధించి బయలు వెడలి

గీ॥ పట్టుదప్పిన యలనాగ భామవోల్కెఁ గట్టుదప్పిన మిట్టు చప్పట్టు నెగయ
నెగచి ముందడుగిడి యెదునింతల్లోన, వెనుకకొంగూని పైకొని వెనుకఁ ద్రిప్పి. 64

శా॥ శ్రీప్రాణేశ్వర! రమా మనోహర! వృథాయుద్యోగమేలయ్య, యీ
నా ప్రాణమ్ములమీఁదనాన, యిటు నేఁ, డన్నిపుగాదన్నచో
దీప్తిమ్ముల్ స్మరబాణముల్ మిగుల ఛేదించెం దమున్నమ్ము, నా
యీప్రాణమ్ములనిల్పు మంజలియిదే, యీయల్క చాలింపుమా. 65

మ॥ అనియాత్మేశ్వరి, బాహాబంధమున నుద్యత్ప్రేమ ముద్దాడు. న
య్యనఘాకారు మనోజ్ఞవేషుఁ బరకాంతాలింగనప్రౌఢునిం
గని క్రుద్ధుండయి మానిరాజవిభుమా కల్యాణియీచెంత, నా
వనితం బట్టినవానిమర్మద మడంపం బోదునం చాడినన్. 66

మ॥ ఎవరో పాపమ దెట్టిజాతకయొ వృథా యేబాధుఁ డే నాతినిం
దవులం బోయినఁ బోవుఁగాక, తరుణీ! దర్పమ్మునీకేల, యీ
యివురుం బోఁడులనమ్మరాదనుట యింతేసత్యమౌఁగాక. నీ
వ్యవసాయమ్మను మానుమంచతనిఁదా నాఁగెం బ్రియాలాపియై. 67

మ॥ అపుడా కామిని యారయీసోదరిలో నావంకఁదా నెవ్వఁడో
యపురూపమ్మగనొక్కకాంతఁదనలో నాడంగఁబీకించు, వాఁ
డిపుడేవచ్చెదనిందుఁదప్పెవరిదో యేర్పాటుగావించి, యా
కృపణస్వాంతు నదల్పఁగావలయు లేదేఁగీడువాటిల్లదే. 68

చం॥ అనుటయు నాథ నీవు తమి నచ్చటి కేఁగెదొ, యొట్టుసుమ్మ, యా
వనితయదెవ్వరో మతియు వాఁడెవఁడో మనకేలయింక, నీ
మనమున నీసుదక్కుమను మానమునన్ననుఁ బ్రోవుమంచు, నం
గనప్రియుఁ గౌఁగిలించె నిజగాఢకుచద్వయి హత్తిమెత్తనన్. 69

చం॥ అదిగని మానిని న్సైఁపక తివా! వినుపూరుషుఁడైనవాఁడు, దా
నెదుటఁబరాంగనన్ బలిమి నత్తిన వానిని సైఁచు టెట్టులీ,

యిఁకనునఁ బాపమాయనద కార్తిఁ దలంగ నెపంబుగల్గు, నీ
పిదె యటు చూడుమంచుఁ దనయింతికిఁ జూపన తండు చూచియుఁ౯. 70

వ॥ తనవంద చెలికి గన్పించిన యమ్మిథునమ్ము స్త్రీపురుషభావములు దనకు విజ్ఞోదుపడంగా
న్పించుట యుండదనుకొనమ్మాగా. 71

చం॥ సరిసరి నీమతిభ్రమము చక్కఁగనున్నది, కాంత యెవ్వరో
పురుషుని గాదు కూడదని పోవగనున్న నుబోవనీక, తాఁ
గదకరిఁ గౌఁగిలించినది, కాంతుజెడంగునకోడి నీవు, నా
సరసను బాయఁజాచెదవు చాతురి నొక్కెనెపమ్ము వన్నుచు౯. 72

కం॥ ఒకనిఁగని యొకనిఁ దలచుచు, నొకనికిఁ జేయూచి మఱియు నొకనిఁబిలిచి తా
నొకనికిఁ దలయూచుచు, వే ఱొకనిం గవగూడు కాంత లొక్కరివశమే. 73

మ॥ అనుచుం బెక్కులు పల్కుచున్న యెడ నయ్యబ్జాక్షి, యోమోహనా!
కనుమీ వైనను నొక్కనాతి నిటులంగారించు దుష్టాత్మ, నే
మనుమానించెదొ నేనుబోవు నెడ నంచా కాంతకుం జూపె, నా
విని యోద్వృత్తుల మానిదంపతులఁ దాపీక్షించి యబ్జాస్యయు౯. 74

మ॥ మునియెవ్వండో యొకండు పైకొని యొసమ్ముగ్ధాక్షి నొఁగాఁకయు
మ్మునినింగాదన నేరదాయువతి యునోర్మిహమ్ము పెట్టింప, నీ
మన కేలాయిది చూడరాని పని యామల్లీనికుంజమ్ము చే
రను రారమ్మటు పోదమంచు సతిని నాఁగొంచుఁ బోఁజూచిన౯. 75

మ॥ కనికోపించి యతండు చూడు సుదతీ గర్వించి యా కోమలి౯
గానిపోఁజూచెడి నింక వాసిసయిపన్ బొమ్మంచు హుమ్మంచు లే

చినమానిఁగని తోసిమామడికి వచ్చెన్నీదుకార్యమ్ము. నా
ఘనునింగాంతయె తోడికొంచుఁ జనె నీస్తనమ్మంచు రెట్టించినన్ 76

కం॥ ఆడుఁదియెవరో యటముగ, వాఁడెవరో తెలియనట్టె వల్లభ వింకనీ
పోఁడిమి తెలియన్వచ్చెను, జూడుము చూడుమయటంచుఁ జూపిననతఁడున్. 77

కం॥ కడు లెస్సబలికితి దెనీ, గడుసరిమగతనము తెలియఁగా వచ్చెనిఁకన్
నడునడుమీ యీచిత్రము, నెడదృష్టిం జెదరనీక యీక్షింపవలెన్. 78

కం॥ అదియాఁడుదిగ కన్ననో, యిదిమగదియుఁగాక యున్న నేమియొ పండె
మ్మది తెలియక డుగుపెట్టను. బదరింపకముందె చెప్ప వలెనని పలుకన్. 79

కం॥ అదియాఁడుదిగాకున్నం, బోదలుఁడు దంపతులుగాఁగఁ బురుషుం డేనన్
బోదలుఁడు దంపతులుగనని, మదిమది రెట్టించి కలుకు మాటలతోడన్. 80

కం॥ పరిహాసమ్ముగ వారలు, పరస్పరమ్ముం బలపలికి పంతము మీఱులన్
బౌరసిరియయ్యె యుజంటలు, సిరస్తసమిపాతులగుచు సిలిచినయంతన్. 81

గీ॥ వారు మోహనరూపభావములయందె, స్త్రీత్వపుంస్త్వమ్ము తెలియుసిసిగ్గు కాక
పిలువఁబడియు నుబలుమాఱు పలుకులందు, నెఱుఁగలేరైరి భేదమ్ము కింతయేని. 82

గీ॥ సాఁగియేసంతసుందరేశ్వరుని జేరి, దేవయీబన్నమిఁక ఁజాలదే మటన్న
నగుచు గరమూని చూడు మోమగు వయింక, వచ్చు చిత్రమ్ము విస్మయావహము
ననియె. 83

వ॥ అట్లు నిలిచిన యమ్మిథునదంపతులు పరస్పరమ్ము నుబరికించి పరికించి తనుతముచందమ్ములకు
వెఱగుపడుచు నిక్కమ్ము నిర్ణయింప నేరక పలు విధమ్ములగు మోహమ్ములకు బొల్పడుచు. 84

మ॥ కలయంజూచెడివారిదంపతుల కాకారన్ జగన్మోహినీ
కలితుల్ సుందరసుందరుల్ నవనవాకారుల్ జగన్మోహనుల్
తిలకింపంబడవిస్మయమ్మెపను మందృష్టుల్ మొగుడ్పంగ ని
శ్చలులై చిత్తరులై యొకింతకలుగన్ జ్ఞానమ్మెవంతెంతటన్. 85

కం॥ తనపతిని జగన్మోహిని, గొనెనని గుర్తించె నొక్క కులకాంతయటన్
గొనెసతిని జగన్మోహనుఁ, డని యెఱిఁగెను మాని యొక్కఁడతికష్టమునన్. 86

కం॥ ఎఱిఁగియు మఱియేపలుకుల, కఱుకకతమపంతమూలకు నులుకుచుమిగులన్
వెఱఁగుపడియుండిరెంతగఁ, దఱచినఁదమనివ్యదృష్టి తపముఱగాఁగన్. 87

కం॥ కులసతియొక్కతెతనపతిఁ, గలిసినమోహినినిజూచి గాసిలియోసీ
తులువతనమ్మనవెంతకు, దలపడితే నిలుమునిలుము దర్పమ్మనుచున్. 88

కం॥ గమకించిననా మోహిని, రమణీపరిచూడుమిా! పరాకునబడకే
రమణునిగూడితినేయ, క్రమమున మోహినిది, తప్పుగాఁబలుకదు వే. 89

కం॥ అను నెడ నొకయుంగనదాఁ, గనలుచు ముందునకు వచ్చి గయ్యాళిగ దే
మును వెనుకకనక నాపతి, ననియెదె మోహినియటంచు నటుచూడుమనెన్. 90

కం॥ పసితలు వనితలు తమపతు, లను నెఱుఁగుమమిగుల మదుల లజ్జించియుఁడా
మొనసిరికమ్ముముదమలో, ననచిత్రవిచిత్రవాక్య నైపుణ్యములన్. 91

కం॥ మునులును సతులజగన్మో, హను లెంతయుఁజెఱచిరనుచు నాగ్రహవశుచున్
మును వెనుకఁగనకయొంటొరు, లనుగదిసిరి మోహవివశ లఘుతరవృత్తిన్. 92

కం॥ వల్లభులు పోరుచుండఁగ, వల్లభలడ్డమ్ముపొచ్చి వారించిన, వా
రెల్లరు మనెట్ట కేలకు, నల్లంతనపోరు విడిచి యాగిరిపుంతన్. 93

శా॥ ప్రత్యక్షస్థితమోహినీశ్వర వపుఃప్రాగల్భ్య మాహాత్మ్యమ్మునున్
స్వత్రాత్మాగూఢకులాంగనాప్రియవచో రేఖావిశేషమ్మునున్,
బ్రత్యేకప్రధనమ్మునల్పు నెడలన్ భావించియున్నష్టవై
యాత్ముల్వారలు నిక్కముం దెలియలేరై రంత నొక్కింతలో. 94

క॥ ఉడుగని మోహమున వా, రొడఁబడి యొడఁబడక ప్రియల యుపలాపములన్
గడు జృంభించిరి తిరిగియు, జడదారులు సతులఁ గొనెడి సంరంభమునన్. 95

సీ॥ పిడికిలించుచు నొక్క జడదారి నా సతి, మునసె దేమని యాడు పురుషుఁ బొదివెఁ
బొదివినఁ దత్ప్రియ పోదువపు నా ప్రియ, మోహినీమునిపతి నొమ్మహరించె
నోసి! నీ ప్రియుఁ డెట్టు గోపించుచూచెద, నాఁగఁ గాఁగవుమని తూఁగివచ్చె
వచ్చిన నడ్డమ్ము వచ్చి యొత్తిలి పట్టి, ప్రియ నెట్లు నీవునో వెలది యనియె 96
గీ॥ అంతన యేమిచిత్రమో యడఁగెనపుడ, నారిమాయా స్వరూపము ల్వరుసతోడఁ
గలఁగుజ్ఞానమ్ము తొలఁగ నిక్కమ్ము గనుచు, మౌనిదంపతు లధిక విస్మయము పడుచు

మ॥ కలయో, మాయయొ, సత్యమో తమదుదుష్కర్మప్రభావమ్మొ, మా
నులు గారోటు పతివ్రతామణులును నోర్మహామ్మ లిట్లుండునా
తెలియన్నేలగుఁ గాకతట్టశద కెందేనిన్ యథారీతి గా
మెలఁగంగాఁ దల లెత్తు టెట్లు పనులా నేర్మిమ్ము గావింపదే. 67

మ॥ అనిలజ్జించుచు ఖిన్నులౌచును బ్రియావ్యాపారము ల్మెచ్చ రా
మునులున్ దివ్యపతివ్రతల్ సడలనా మోహమ్ము మందాత్ము, భా
రనతాంగుల్ వినతాస్యలై మునిపతుల్ ప్రాణేశ్వరాంఘ్రిద్వయా
వినతల్ చిత్తరులౌచు నిల్చిరట నిర్విణ్ణైకచిత్తమ్ములన్. 98

శా॥ కూసెందానట ధూర్తకోకిలము లేఁగొమ్మన్ బ్రియాచుంచు,లీ
లాసందానితమర్ధభుక్తముకి సాలగ్రాసముం గ్రక్కుచున్
డాసెన్మౌనియొకండు వెంటనె ప్రియన్ డాకేల నేకమ్ముగాఁ
గసిల్లంబడి మన్మథోద్ధృతశరాఘాతమ్ము సైరంపమిన్. 99

శా। మానుల్గాంతలు నెల్లరొక్కత్రుటిలో మదాత్మమందాక్షులై
సూనాస్త్రప్రథమానబాణపటలిం జొక్కంగనా వెంటనే
యోనాథా దయ నేఁటి మన్ననుడుల ఝ్యాంకారఘంటాధ్వనుల్
వీనుల్ చూడినయట్లుగా వినఁబడన్విభ్రాంత చేతస్కలై. 100

మ। చకితక్రోధ విషాదహాసభయ లజ్జామజ్జదాస్యాన్నమత్
భ్రుకుటిస్ఫూర్త కరాళవీక్షణములన్, మోహమ్ముగల్పించి, కాం
చకతమ్ముట్టులగాసిపెట్టుఖలులన్ శాసింతుమన్నట్లు లూ
రక దిక్కుల్ నలుమూలలున్గనిరి నేత్రమ్ముల్ పినాళించుచున్. 101

సీ॥ ఎవరినెందునుగానకెల్లరునారయే, మూలనోయీపాడుమోసకత్తె
యేమయ్యె నేగంటయీమూలవినవచ్చె, వచ్చెనా మనయింటిబిచ్చగాఁడు
యీమనయిల్లాడ్రనింతింతయనరాని, గాసిపెట్టెనెవండుగానరాఁడె
యింతింతవారలనింత చేసినజంత, యెంతవుఁగాదిపుడెందుఁబోయెఁ

గీ। బడఁడుపడఁడింక వారలఁబట్టవలయుఁ బలుకుసవ్వడిఁబట్టియూకలికితనము
బిలుకుమార్చ్చదమంచునుబలసివెడలి, వెదకి రాకాన యెల్లెడవినుఁగుగొనక, 102

గీ। ఎంతవెదకినఁగనరారువింతవారు, మనలనింతలు చేసిన చెనటివారు
వారుభూతమ్ములో యెట్టివారలైన, విడువవచ్చునెవిడుతుమేకడకుముట్ట. 102

— ※ మునులు మోహినీ మోహనుల జంప నెంచుట ※ —

కం॥ మనమాటయటుండఁగనీ, మనకాంతుల మోసపుచ్చి మనవచ్చునటే
మనకాంతలపరిభవమును మనదేగద దానిసైఁప మగతనమగునే. 104

వ॥ అని కోపించి యమ్మునీశ్వరులు దమకాంతల వంచించినవారలం బరిమార్పం దలంచి ఘోరమ్ములగు నాభిచారకహోమమ్ములం గావించుటయు నందుండి. 105

మ॥ ఒదవెన్ భీషణభీషణమ్ము, గజదైత్యోగ్రమ్ము దిఙ్నాగభీ
ప్రదముం జాలితఘంటికాంచిత జగద్భద్రమ్ము నుచ్చైస్స్రవ
న్మదధారాప్రశమత్కృపీటభవసన్నాహమ్ము, స్వాహారవో
న్మదమౌనీశ్వరచోద్యమానమగుచు న్మత్తేభము గ్రాకృతిన్. 106

వ॥ అట్లొదవి యమ్మహాగజమ్ము. 107

మ॥ ఘీంకారించిన ఘూర్ణిలెన్ జలధులుద్గ్రీవోద్ధ శుండాహతిన్
జంకెం దారకమండలమ్ము పదవిన్యాసాతి భారమ్మునన్
గ్రుంకెం దివ్యపురాణభోగిఫణముల్ గోపమ్ము రూపమ్ముగా
ఘీంకారించుచు వెండియుం గదలె విక్షేపించి వాలమ్మొగిన్. 108

వ॥ అంతట నయ్యపశకునమ్మునకు శంకించుచువారు వెండియు హోమమ్ములు గావించుటయు గ్రమమ్ముగా. 109

శా॥ సాధీయస్సమిదుగ్రమంత్రకలనాజాజ్వల్యమానాగ్ని మ
ధ్యేధామమ్మున, వక్త్రగహ్వరచలజ్జిహ్వామహాభోగి, భూ
రోధస్తాడితవాలమగ్నిదృశ ముద్యద్దగ్ధశార్దూలి తత్
క్రోధమ్మెల్లను మూర్తిమంతమనఁగాఁ గుప్పించె మిన్నందుచున్. 110

శా॥ ఆకాశాంతరలీయమానపటుకీలాటోపధూమావళీ
నీకాశమ్ములనేకభోగములు వహ్నిక్రూర నిర్యద్విష

వ్యాకీర్ణాఖిలకాననమ్ములు సముద్రాంతర్లురద్ఘోర, వీ
చీకమ్ముల్వెడలె న్రియమ్మున ఫణిశ్రేణుల్ బుసారించుచున్. 111

శా। మౌనీంద్రాసురనిష్ఠలుం దపములున్మానమ్ము లాకారభా
గ్యైనఃపుంజము లేకమై వెడలెనా, వ్యాళమ్ములే కార్థముల్
నానాకారములుగ్రసంహరణ సన్నాహమ్ము దీపింప నా
లోనన్ డగ్గఱఁ జూచి బెగ్గడిలి కల్లోలన్మనోవృత్తులన్. 112

శా। సామీ! కావవె దీనురాలి ననుచున్ సాష్టాంగనమ్రాననన్
గా మధ్వంసుని శుభ్రదభ్రతనురేఖన్ జంచలాకారతన్
నా మేనింబొదివించి నిల్చునెడల న్మందస్మితజ్యోత్స్నకా
రామమ్మైనకృపాపయోధికి వళీరమ్యమ్ములౌ చూపులన్. 113

కం। వెఱవకు వెఱవకుమనుచున్ దరఁగంగొను కడలిబోలెఁ దన మేననన్
నెఱినిఱికికొనుచుఁ గ్రచ్చఱ జుఱచుఱనా వ్యాళములను జూచినయంతన్. 114

శా। సాహంకారతవచ్చి పైఁబడెడు నా వ్యాళమ్ములేమయ్యెనో
త్రాహి త్రాహియటంచు నమ్మునులు దత్పత్నుల్ పరిధావన్మృగ
వ్యూహమ్ముల్ వడిఁ బాఱి పాఱి యెటకుం బోనీని యా వ్యాళసం
దోహమ్ముం గని భీతభీతులయి యుత్క్రోశించి రుద్బాహులై. 115

శా। దీనత్రాణపరాయణుండు శివుఁడర్థిన్వారి మన్నింపఁగాఁ
దానన్గర్జనసేయఁ జచ్చెగజశార్దూలమ్ములా సర్పముల్
మానివ్రాతముఁ జుట్టి త్రుళ్ళపడియె నమ్మందాత్మ చేష్టమ్ములై
మానుల్లూడఁగ విస్మయంపడితి నా మాహాత్మ్యమూహించుచున్. 116

మ॥ మధురాలాపముఁ జేసెనీశుఁడు శ్రీవామాస్యమ్మున న్వేళ సం
శిథిలమ్మయ్యెను నాగబంధములు నాస్త్రీలున్మనుల్గాంచి ర
వ్విధుచూళిన్రమణీయ విగ్రహుఁగృపాబ్ధిన్మహా మనోమోహినీ
మధురాలాపనివిష్టమానసు, జగన్మాంగళ్య మాంగళ్యునిన్. 117

కం॥ ఆపరమేశ్వరుఁగనుటన్, బాపమ్ములపటలిపంచ బంగాళముగాఁ
దాపసులెల్లరునంతటఁ బ్రాపింపనపూర్వబుద్ధి పరిపాకమ్మల్. 118

కం॥ మాద్రోహము మన్నింపుజ, గద్రికుక పేర్మినచుఁ గడుభక్తిమెయిన్
రుద్రునినను బ్రార్థించిరి, భద్రశ్రుతివచనవిమల పాండిత్యమునన్. 119

గీ॥ వచనపరిపాటికందఁగావలను గాని, రూపభేదమ్ము నిహమమ్ము రూపుగొన్న 120
మిమ్ము నెఱుఁగఁ జాలఁడు పాపకర్మ, మణఁగ వేడెద మష్టాంగములను.

సీ॥ శారదకౌముదీసారాభిరామమ్ము, కోమలేందీవరశ్యామలమ్ము
రాజతగిరిపుణ్య రాజీవిరాజమ్ము, నింద్రనీలోజ్జ్వలదిందిరమ్ము
కలహంసకహ్లారగంగాప్రభాసమ్ము, కోకిలాళీకేకినీకలమ్ము
సౌదామనీచ్ఛటాసర్వసర్వస్వమ్ము, కాలనీలాంబుదనీలిమమ్ము
గీ॥ క్షీరపాథోధిదర్పణస్నిగ్ధబింబ. గగనసంకాశమగుమూర్తిఁగాంచఁగలిగె
నెల్లపాపమ్ములణఁగె మమ్మెల్లఁ బేర్మిఁగావగదరయ్య మీదాసగుణముఁ జేర్చి. 121

శా॥ కర్మజ్ఞేష్టులమంచు నెంచిమిగులన్గర్వించి లోకమ్ములన్
దుర్మోహమ్మునగాసి వెట్టితిమి మాద్రోహమ్ము సామాన్యమే
నిర్మోహాత్వ మొసంగిమమ్ము మనుపన్వేచ్ఛేయు టే కాక యీ
కర్మందుల్ భవదుగ్రశాసన పరీక్షన్నిల్చి సాధింతురే. 122

శా॥ ఆభీలమ్మగు నొక్కహుంకృతికె యీవ్యాళమ్ములిట్లయ్యె దు
ర్లోభగ్రస్తుల మత్తచిత్తులమమున్ రోషింపకే కాచుటల్
నీభక్తస్థిరపాదసేవనమునింతే నీయఁగాఁగోరి శ్రీ
దా, భావింపగ నెంతవారికి భవద్వ్యాపారవిజ్ఞానముల్. 123

కం॥ చెడుగులె చేసిన మేమును, బెడఁగుఁదనంబిట్లుకలిగి వెడలగఁనసురుల్
పుడమింబడిమీకరుణం, బొడఁగంటిమి యొండుజన్మమును బుణ్యమ్ముల్. 124

శా॥ మాదుష్కర్మము మమ్ముఁగొట్టెనను నమ్మాటల్ యథార్థమ్ములై
యీదృశ్యమ్మున స్పష్టమయ్యెఁ గలఁడా యీశుండు శిక్షింపఁగాఁ
గాదంచుం గరుణించెఁగానను చు మాకర్మమ్ము భంగించి మా
యీదౌష్ట్యమ్మును సైచి కావఁగదరే యీశానుకే దాసులే. 125

సీ॥ ఈమోహినీరూపమే నాఁటిగంటిమే, యెఱుగమే కాంతలు నిట్టివారె
యీజగన్మోహనునేం దేఁగంటిమా, మాఁతీర్థము పేర్మి మనిచెఁగాక
యీరూపములతోడ నిందుండియే వేళ, మమ్ము మన్నింప రే నెమ్మితోడ
నేమాయఁగా నేస్తమేనాఁడు మామనః, పద్మమునంతమీఁదు పాదసవిధి 126
తే॥ ననుచు బహురూపములభక్తి నానిచివారు, కొలిచియర్చించిరటముప్పుఁదలచితలఁచి
యంతనొకకాంత వెఱపడియుచటుఁజూచెఁ బాలుకాఱంగఁదన చిన్నిపాపకొఱకు.

దారుకామునుల నీశ్వరుఁడనుగ్రహించుట.

వ. అంత నాజగన్మోహనుండు చిఱునవ్వు మెఱయ వారలంగనుంగొని. 127

శా॥ పాతివ్రత్యనిధుల్ సతీమణులు నిష్పాపల్ మనమ్మందుమ
త్పాతివ్రత్యము గోరిరీమునులునున్ భావించిరీ మోహినీ
చాతుర్యమ్ములు వారిలోనిదె యభీష్టమ్మందుఁడీ వెన్కమీ
రీతుల్ సర్వముసిద్ధమై నిజనిజప్రీతిందదర్హమ్ముగా. 128

కం॥ నాగవ్యాఘ్రాజినములు, నాగమ్ములుమీఱియొసంగునవి కాన్కలు మా
కీగాధశాశ్వతమ్మగ, నేఁగొనియెదననుచుఁ దాల్చినిజదేహమునన్. 129

కం॥ మునిసంతానముఁగొనుడఁని, మునిసంతానమ్ముమనిచి పురహరుఁడంతన్
దనునటుపాసూయముగాఁ, గనుఁజూచెడినన్నుఁజూచి కనలకుమనుచున్. 130

కం॥ ధర్మమువిడువకుఁడనియా, కర్మందులఁగ అపిహరుఁడు గను మొఱగిననా
దుర్మదమడఁగివారలు. శర్మముగనిరఖిలజగము సంతుష్టిగనన్. 131

వ. ఇవ్విధమున నమ్మునీంద్రుల గర్వమ్మణంచి యుపరమేశ్వరుండు తిరోహితుండగుటయు 132

## ఆంధక జలంధర సంహారము.

కం॥ వడిననువిడిచను నీశ్వరుఁ, బోడఁగానక యెంత మోసమును జేయుఁ దోడం
బడితను వెడవెడకినుకన్, వెడలితిన చోటువిడిచి విపినమ్ములకున్. 133

కం॥ ఎదఁగల్లుమదనునణఁపఁగ, మదనారింగోరి వెదికి మఱుగుమనమునన్
దుదకపుడు నిశ్చయించితి, సదయుండగునతఁడు తపముసంగతిననుచున్, 134

వ. అట్లునిశ్చయించియే నకాన్కనొక్కకోన నాశ్రమమ్ము నిర్మించి, విమలకఠోరమ్మగు
తాపసీవ్రత మ్మనుష్ఠించు నెడల. 135

గీ॥ అలహిరణ్యాక్షుకొడుకంధకాసురుండు, పెక్కువరములఁగనిచాలనుక్కుమీఱి
విష్ణువధియింతుననినన్ను వెదకికొనుచు, వచ్చెనొకనాటిసంధ్యనాప్రాంతమునకు.

గీ॥ వచ్చిననుఁజూచి వాఁడంతటిచ్చనడుచు, బచ్చవిలుతునితూపులనొచ్చినొచ్చి
యిచ్చనను దేర్ప వే మోహినీయటంచు దాసెదాసిన నేనంతరోసపడుచు. 137

కం॥ తొలఁగుముతొలఁగుమనంగాఁ దొలఁగెదలెమ్మనుచు వాఁడు దుసుసుతనమునన్
బలిమిన్ననుఁగైకొనఁగ, దలఁచియు వెనుకడుగువైచి తలఁకుచునిలిచెన్. 138

మ॥ వినవచ్చెన్ శ్రుతిభేదనమ్మగుచు గంభీరస్వరమ్మొందు, మో
హినిభీతిల్లకు మేనువచ్చితిని దే యీరక్కసుం దున్మదన్
సనుఁ జేపట్టుమటంచు నుట్టిపడియె న్నామధ్యనొక్కండు, దు
ర్జనుఁడెవ్వాఁడొ యపూర్వరూపవిభవ శ్లాఘ్యుండు గర్జించుచున్. 139

మ॥ అతనిం గాంచి జలంధరాయుడు సురా, యాయింతినాయింతి, నీ
చత రాఁబోకుమటన్న వాఁడు నగుచున్ శాంతించి యో యంధకా
యితరుండంచుఁ దలంచినాఁడ నెపుడీవిచ్చోట కీవచ్చితీ
ప్సితమేమయ్యెను నీవిరోధియగునా విష్ణుండు కాన్పించెనా. 140

మ॥ అనిన న్వాఁడొక వెఱ్ఱినవ్వునగి పోమామ్మాటల కేమింక నీ
చనుకార్యమ్మదియేమియయ్యె హరునిన్ సాధించితే యన్నవాఁ
డనె లేఁడా హరుఁడేమియయ్యె హరియో, యాతండు లేఁడంచు నం
తనికాటుల్ ననుఁ జూచి నవ్వికొనుచున్ దర్పమ్ముదీపింపఁగా. 141

కం॥ హరియును హరుఁడును లేరట చరాచరజగమ్మునేలు శక్తులమఁటయీ
తరుణియుట మనకు దారకట, యురుతరపుణ్యమ్ముగాదె యోజింపంగా. 142

కం॥ అనినన్నడాయువచ్చినఁ, జనుచనుఁడీ యుఱకమీరు చచ్చెదరనుఁడీ
నను, హరునర్ధాంగిని జే, రనువచ్చిన, నవిన నగుచు రక్తాంధసులున్. 143

కం॥ నినుబలిమిఁ బట్టికొన్నం, జనుదెంచెడి హరుని శక్తి సర్వమ్మునిదే
గనుగొందుమనుచు నన్నుం, జెనకుటకును వారొకింత సిద్ధుపడఁగా. 144

మ॥ వినవయ్యెం జెవిఁ కేదొ బుద్ధియదియున్ వ్యాపించె నాకృష్టముల్
గనులయ్యెం బులకించె దేహము మదింగల్గెన్మహాహర్ష, మొ

య్యానగర్జద్వృషభేంద్రకంఠ మణిఘంటారావముల్ మ్రోయఁగ బె
ల్చననుగ్రాకృతి సుందరేశ్వరుఁడటన్ సాక్షాత్కరించెందయన్. 145

వ॥ అట్లుసాక్షాత్కరించి యవ్విశ్వేశ్వరుండు చిఱునగవు చూపులనన్నుంగటాక్షించుచు. 146

మ॥ ననుఁజేసాఁచి పదమ్మనాత్రి యిడుచు న్రిమ్మించు నెక్కించెనో
య్యన హైమాచలసానురమ్యమగు నయ్యాతేని పృష్ఠాగ్రభూ
మినిఁ బాణిగ్రహవేళ గౌరి పదముం బెట్టింప లేనవ్వుతో
సనికల్ ద్రొక్కుటలయ్యె నాకుదరలజ్జాహాసముల్ దాటిరిలన్. 147

క॥ ఎక్కించి యేమనకుమీ, రక్కసికయ్యమ్మునందు రమణీయనుచున్.
దక్కఁగొని పాణిభుజములఁ, జొక్కించుచు విడువకనుచుఁ జూచెనసురులన్. 148

క॥ తమువెదకెడు పరివారము, సమకూఱఁగ దైత్యవరులు సన్నాహమునన్
గ్రమమెఱుగ కెదురునడచిరి, సమయింపగఁ హారునివిపుల సంరంభమునన్. 149

వ॥ అన్నిశాటుల యాటోపమ్ము లెక్కింపక యప్పదమ్మహావృషభమ్ము. 150

శా॥ ఆక్కించెం జెవులింతలింతలుగనుల్ ద్రెట్టించె వాలమ్ముగిన్
నిక్కించెన్మెడగంగడోలు మెఱయన్నిట్టించెఁ జంద్రార్ధమా
నుక్కుంగొమ్ములు వ్రిక్కటిల్లుతలతో నుంకించి గుప్పించె మై
యొక్కింతోరఁగవంచి రక్కసులపై హుఁమంచు గర్జించుచున్. 151

శా॥ ఆటోపమ్మునవచ్చునమ్మద వృషవ్యాపారముల్ సైపకా
స్ఫోటించెందితిసేన, నందినతడుంబ్రోత్క్షిప్త వాలాగ్రుఁడై
పాటించెన్నిజఘాటలన్ ఖురహతిన్ వజ్రాగ్ర శృంగాగ్రముల్
కోటుల్ద్రిప్పుచు నస్రపాస్రజ మహాకూలంకషల్ పార్లగా. 1i2

క౦|| ఈయెద్దుపొగరుకొనుటకు, నీయయ్యలుచాలరనుచు నీసునురోస
మ్మామతమైరాకాసులు, కాయములుప్పొంగ వెడఁబకాలుసనగుమఱ. 153

వ|| అయ్యంధక జలంధరులొక్కుమ్మడిం బరాక్రమించిన సహింపక యమ్మహోక్షమ్మురవడి మెఱవడి నొక్కయుమటువరంబగ సాధింపనుంకించి బ్రహ్మాండ విదారణమ్ముగ ఘణిల్లని ఱంకించిన నప్పరమేశ్వరుండు నిజవామ హస్తమ్మున నవ్వృషస్కంధము నంజనగిరి శిఖరమ్ము నంబోని మూఁపురమ్ము నిమురుచు. 154

శా|| విల్లెత్తెన్ సమరాగ్రభీషణము చాపెన్ రోపమ్మెక్కించె, నా
యుల్లాసమ్మునఁ బొంగి నేః బుజను పైనూదన్మదాస్యమ్ము, భే
దిల్లందిక్కులు బాణమున్విడచె సందీప్తాగ్నికీలమ్ము, వా
రుల్లమ్ము న్మెచ్చియు దొల్లఁబోయి ధరఁగాలూదించి నక్తంచరుల్. 155

క౦|| పెల్లుబ్బఁబోకుమిదెయీ భల్లమ్ములకాగుమనుచు బరవస మొప్పం
దుర్భ్యచువిసరినవానిని జల్లులుగావించె హరుఁడు శితవిశిఖములన్. 156

వ|| అంత మహాదారుణమ్మగు సమరమ్ము ప్రవర్తిల్లుటయు నాదానవులు సకలసైన్యములు తెప్పపాటుకాలమ్మున మంత్రించి దైవికముల మహీతలమ్మునం దొరఁగుటయుం దమయమోఘాస్త్ర శస్త్రజాలమ్ములు మంటఁ జొచ్చిన మిడుతలమాడ్కి రూపఱుటయు నుపలక్షించి రోషమ్ము వేషమ్ము దాల్చిన చందంబున యుగపత్సంజాత యుగాంత దండధర యుగళమ్మంబోలె విజృంభించి. 157

మ|| పరిఘంబూనిజలంధరుండును గదాబాహుండు నయ్యంధకుం
డురువేగమ్మున శంభువక్షమునఁ దారొక్కుమ్మడిన్ వ్రేచిరా
హరుఁడొక్కించుకసొమ్మసిల్ల నపుడే వాత్మీయ బాహాంతర
స్థిరపర్యంకమునొనర్చుచున్ రయమునన్ జేకొంచుఁ గోదండమున్. 158

చ|| నిలునిలుఁడేను దాంభులని నిష్ఠురచాపముగ్రిక్కి తూపులన్
గళుకుతళుకు జూపుఁను దెత్తుఁలగుంటెను నీసుసేయఁగెం

పొలసినలేఁతనవ్వుసరియొప్పుచు నెత్తురుటేఱులుపాఱె, నా
బలియులు నేఁటియాటదివి బాణములాయని దద్దరిల్లుచున్. 159

ఉ॥ ఒప్పులకుప్పయీమగువ యుద్ధముసేయుచు మారుబాణముల్
చొప్పడఁజేసెదీనిమది నొప్పునెఱుంగక మారుబాణముల్
గుప్పగరాదటంచు నటుగుప్పకయుండిన తెప్పపాటులో
నొప్పరికించునే యుసురులూడ్పక యుంచురు దత్తరమ్మునన్. 160

ఉ। ఎత్తినవిండులెత్తినటులే తునుమాడెను చేతినేర్పు కెం
పెత్తిననవ్వుమోము చెమరెత్తులలాటముగ్రమ్మ ముంగురుల్
రొత్తరికించ చన్నుఁగవయొప్పసియాడుబెడంగుకౌనుసున్
జిత్తముచూఱవెట్టి హరునిందముకించుచు నాతఁడత్తఱిన్. 161

గీ। ఓతలోదరియాడుగుమీయుద్యమమ్ము, మెచ్చవచ్చితివనినన్నుఁగ్రుచ్చికొనియెఁ
జనవుసాకిమ్మ యీనిశాచరులఁ దునుమ, నంచు వేసితిశివుని నేనంతలోన. 162

ఉ। ఉగ్రితనొప్పబాణముల యోజనసేయుఁగ విష్ణుఁడంచుఁ గ
ర్ణాగ్రముదూసి పోఁబఱపె సంధకుఁడొక్కశరమ్ము నాపయిన్
దృగ్రుధిరప్రవాహములనించి జలంధరుఁడత్తె శక్తి నా
యుగ్రుఁడువారిఁజూచి వృషభోత్తముసించుకత్తొఁ దట్టినన్. 163

శా। గర్జించెన్ సహావతుమేరుగిరి రేఖ దూఁకె నయ్యంధకున్
స్ఫూర్జద్వజ్రకఠోర ఘోరఖురలన్ గ్రుచ్చెన్ మొగమ్మెత్తియా
దుర్జేయుఁడు జలంధరుందునుమఁగా దూఁకెన్ హరుండంతటన్
నిర్జించెన్ వృషభమ్మటంచును ననుస్వీక్షించె నారాక్షసున్. 164

శా॥ వాఁడాశక్తినినైవశృంగములచేఁ బాటించెనుక్షుమ్నవాఁ
డేడంబోవక యొండుశక్తిఁగొనఁగా నీశుండుచక్రమ్మచే
వాఁడీల్పైచిన వాఁడు త్రెళ్ళిపడెఁ బుష్పశ్రేణివర్షించి వే
నాఁడెందైవతవారయోవతము చిందంగానమాధుర్యముల్. 165

వ. అంత సమస్తకల్యాణనిలయుండగు నాకల్యాణధనుర్ధరుండు. 166

మ॥ నిజవాహమ్మును నన్నుడించి దిగుచుఁ మేవ్రాల్చియుక్షుమ్నపై
నిజమూర్ధస్థితజాహ్నవీల హరులస్థేలించి ముద్దాడుచుఁ
ద్రిజగన్నాథుఁడు భద్రవాహనము నద్ధిస్నీరుదాళ్వించి నీ
నిజవాంఛాఫలసిద్ధినందుమని యన్నెన్నన్నుఁజేపట్టుచుఁ. 167

మ॥ తరుణీవల్కలధారణమ్మతగునే ధమ్మిల్లమీచిక్కులఁ
బొరయంధర్మమె యెంతికందెకరముల్ మోమెంతగాసిల్లె మే
మరయన్నేరముకార్యభారమున నీయాతప్పసైరించి మ
మ్మరయంగఁదగునంచునన్నుఁదమితో నందందుముద్దాడినఁ. 168

కం॥ మునుపతులగాము మేమూ, మునిసతులనుకొంటి రేమి మోహాముపెఱుగఁ
జెనకకుచెనకకుఁడనియూ, మును వేలుపు నెడగఁదలఁగి ముట్టెతిఁబడముల్. 169

ఉ॥ ముట్టినగుచ్చియెత్తికొని మోహినినీకిటులాడఁజెల్లునే
గట్టిగనట్టితాపసునిగా నను నెంచితెయుంచుఁ జెక్కిలిం
గొట్టుచుఁ గందెనేమొకునిపుందు నెపమ్మున ముద్దువెట్టుచుఁ
బట్టిపెనంగునన్ను నెదఁబాయఁగనీయక హత్తిపట్టుచుఁ. 170

మ॥ అవియేలావచియింపనీశుదయ నేనానాఁడుగంటిస్మనో
జవసున్ భైరవుజాతరూవనుని, శాస్తన్ మోహినీ రూపముఁ

దవులం బాఱెనుబిడ్డనింగనెడి నాతాత్పర్యమూహించి, శం
భువు సేకూర్చెను వానికంతటమహాభూతాధిపత్యమ్మొగిన్. 171

శా॥ ఏనంతంజనికాంచికాపురికి నయ్యేకామ్రనాథున్ మదీ
యానూనస్థిరపూర్వపుణ్యవిభవున్ ధ్యానించి యాదేవతా
సేనానాయకు దక్షిణమ్మునఁ బ్రతిష్ఠింప న్నను న్మెచ్చి, యీ
శానుండిచ్చెను గృష్ణజన్మమునఁ దత్సౌభాగ్యసంపత్తులన్. 172

కం॥ అనిపలికి హరియుఁ దనసతిఁ గనుఁగొని వెడనవ్వుతోఁ గమలాక్షిరో నీ
యనుమానమెల్ల బాసెనె, యయని మ్మునివరులఁ జూచి యలరుచుఁ బలికెన్. 173

కం॥ మోహమ్మునడఁచుఁ గలివి, ద్రోహమ్మునడఁచుఁ ద్రోలఁచు దురితార్థమ్ముల్
భీహరమగునీహరకథ, యీహార్థములెల్లనిచ్చు నీశ్వరుకరుణన్. 174

కం॥ ఒక్కొక్కకల్పమందుల, నొక్కొక మెయిఁ గ్రీడసలుపుచుండు హరుని నే
నొక్కొక క్షేత్రమునంగని, తక్కఁగఁ బూజించియిట్టి ధన్యతఁ గంటిన్. 175

గీ॥ నిగ్రహానుగ్రహమ్మునను గ్రహమ్మ, నాడునవతారదశకమునన్మహేశు
వలనఁ గాంచితిసివిగాక పరమశివునిఁ, బెక్కుతెఱఁగుల నేను సేవించుచుందు. 176

కం॥ పరమాద్భుతములు హరకథ, లరయఁగ నిదమిత్థమనఁగ నగునెవ్వరికిన్
జరితమిది యెల్లనాదగు. స్మరణకుఁ దోఁచినది జెప్పఁ జాలితినవినన్. 177

గీ॥ సంయమీశ్వరులెల్ల విస్మయముపడుచు, నెఱుఁగమీకథయిదియిట్టులింత దాక
కలిగెవినుభాగ్యమీలక్ష్మివలన మాకు, ననుచు నుతియించి రప్పుడాయనఘమతుల.

వ॥ అంత నయ్యిందిరాదేవి సలజ్జాదరహాసారుణితకపోలయగుచు కరమ్ములు మొగిచి, మహాత్మా! సుందరేశ్వరుండు దారుకావనసతులతో వచ్చుటచెప్పితి రదితుదగామిము

వీడుట మొదలుగా జరిగినవృత్తమ్ము నిందాకనడుగ నవసరమ్ము కలుగదయిప్పుడానతీ వలయుననుటయు నమ్మునీశ్వరులు నదియెట్టిదయని యన్నారాయణుం బ్రార్థింపనతం డల్లన నగుచు నిట్లనియె. 179

—శివుఁడు మునిపత్నుల వంచించుట.—

కం॥ దైవద్రోహులగర్వముఁ బోవెడలఁగ నడఁచు నెడలఁ బురసంహరు సం
భావన నెఱిఁగితి నామది, కేవలమా శివునియంద కీల్కొనుకతనన్. 180

ఉత్సాహము॥ సుందరేశ్వరుండు భువన సుందరుండు పార్వతీ
సుందరుండు దారుకవన సుందరీహృదంతర
స్పందనపరిభావిభావ భావసుందరాత్ముఁడై
మందమందమధురగతుల మౌనిపల్లెఁ జేరుచున్. 181

చౌపదము॥ స్నిగ్ధకముదము చెందియుఁ జెందని
నిగ్గులు దేఱెడి నిద్దపుఁ రూపుల్
డగ్గఱుసాగ సుతడంబడుకన్నెల్
ముగ్గులు వెట్టెడి ముంగిలిచెంతన్. 182

వనమయూరము॥ బారులగు పొన్నలును బ్రాకినలతాశా
ఖారచితచీరలలగాలికసియాడన్
జేరిమృగశాబములు చేకొనఁగ దూఁకన్
గేరికొను బాలకుల క్రీడలొకవంకన్. 183

చౌపదము॥ కనుచును గుమ్మము కడనిలఁబడి చే
తనుగల పనివిడి తనయులయాటల్
తనయుల తేటల్ తమకమునిడఁ జెం
గునఁ బయిఁబడు పసికూనలఁ బేర్మిన్. 184

వనమయూరము! చంకనిడిచన్గుడుపు సారసదళాక్షుల్
వంకనిడిలోఁజను పద్మమధుగంధుల్
అంకమున గ్రక్కొనుచునార్చు మృదుగాత్రిల్
బొంకితమకార్యమునఁ బోవుహరిమధ్యల్. 185

కం॥ మెఱసెడుకుటీరములఁగడుఁ, దఱచగుమునిపల్లెనడిమి దారినిజనుచి
చ్చఱకంటిమేటిదేవర, కుఱకుఱగనిలిచియొక్క గుమ్మమునొద్దన్. 186

కం॥ పరిణవస్వరూపమాయం, గణమునశంఖమ్మునొత్తి కడులలితముగా
ఘణఘణమనఁ జేగంటన్, గణగణవాయించెఁబసిఁడి గంటన్మఱియున్. 187

గీ॥ బెదరెఁ బెంపుడులేడియాబెదరుచూపు, తోడవచ్చినదాయింటి తోయజాక్షి
నక్కిగెంతిడునెమలినానొక్కయడుగు, గడపదాటించిగుమ్మమ్ముకమ్మనొఱగి

వ॥ అట్లొఱఁగి యొయ్యారమ్ముగ నిలిచి వింతవింతచూపుల నుపలక్షించుచున్న. 189

కం॥ అతివంగనుఁగొని దేవర, మతిమెత్తన చుఱుకుపలుకు, మధురపుఁజూపుల్
సతిమతిఁజొఱఁబాఱంగ భ, వతీ బిక్షాం దేహియనుచుఁ బలికెఁబలికినన్. 190

గీ॥ అబలముందెందుఁదనచూడనట్టివాఁడు, అందమునడెందముందెల్లఁజిందువాఁడు
పలుకుపలుకునఁ దేనెలుచిలుకువాఁడు, ఏమియుత్తరమిచ్చుటో యెఱుఁగదయ్యె.

గీ॥ బిచ్చగాండ్రెవ్వరచ్చటవచ్చుజాడ, యెఱుగదా బాలశిశిరమ్ములెన్నియేఁగ
నిల్లుఁద్రొక్కుచువచ్చినయల్లవాని, కెట్లుమర్యాదసేయుటో యేమియెఱుఁగు 192

సీ॥ పోయివచ్చెదఁబొద్దెక్కిపోయెనపుడె బిచ్చమేదేనిగొందునీయిచ్చినంత
కాకనాపాటవిననీకుఁగలదొ యేమొ యనియెఁజిరునవ్వుతో హరుఁడప్పుడబల.

క॥ ఉలికిపడియతనివలుకులఁ, దెలిసియునొకకొంతకలఁగి తెలియక మైఁగ్రొం
బులకలు చెలంగ గద్గద, గళమున్ సవరించుకొనుచుఁ గడకిట్లనియెన్. 194

సీ॥ ఏదిమీాయూరు పోయెదవెచటికిప్పు, డేమికావలె నీబిచ్చమేమి? చెపుమ
బిచ్చమిడరెవ్వరిచటనీయిచ్చయేని, యిదియెగైకొమ్మునీవెయీాయిల్లుగుల్ల. 195

వ॥ అని తన్నెఱుంగనీయని మనోవికారమ్మున. నమ్మెలంత పలుకుటయునమ్మా యాభిక్షుకుండు. 196

క॥ జడదారిపడఁతినుమగుం, దడబాటుకుగబ్బెగుబ్బ తడబాటునకున్
వెడనగి పిడికెడుబిచ్చ, మ్మిడబోయెడినాకునీదు నిల్లేలనుచున్. 197

క॥ మొఱకుఁదనమ్మునబొమముడి, గిఱుకున వెనుదిరిగిపోవఁ గెరలినయట్టుల్
చఱచఱరెండడుగులుముం, దఱికిడుసొగసరినిజూచి తత్తరపడుచున్. 198

క॥ పఱవకుపఱవకుమోాయీా, యఱవకునీయిచ్చవచ్చినట్టులెయనుచున్
గఱకంతువెనుకకొంగును, బిఱబిఱఁదరళాక్షి పట్టి వెనుకకులాఁగెన్. 199

క॥ లాఁగిననాఁగినయట్టులె, యాఁగుచుఁదలఁద్రిప్పినన్న నంటకుమనుచున్
రాగిల్లునెలఁత మోామునఁ, దోఁగెడుభావమ్మురసము తొట్రిల్లంగా. 200

క॥ నీవిచ్చుబిచ్చమేమియు, నేవలవను నేనుబోక నిముసమ్మైనన్
నావల్లభ,గినియును.నా, తావల్లదె తెల్లకొండ, దాటెనసుమ్మా. 201

గీ॥ అనినఁజఱచుఱఁజూచి యల్లంతయొఱఁగి, కనులఁదడివెట్టి పెడకేలఁగబఱిఁజట్టి
జాఱుపయ్యెదఁజనుకట్టుసందడింప, బదనుమించినతొడుకయిభామపలికె, 202

క॥ నీయిల్లిదెకాకున్నదె, పోయెదననితల్లడిల్లి పోయెదవేలా
నీయిల్లాలనబెదరెద, వా!గయ్యాళివిడిచి బ్రిదుకగఁలేవా?. 203

కం॥ రారమ్మిదె సైఁపఁగఁగడు, భారమ్మీమదన బాధ పలుకకుమనుచున్
గేరుకొనుచుఁ దరుణిబలా, త్కారమునఁ గుటీరముఖము గాఁదిప్పె నెడన్. 204

కం॥ విడువిడు తరుణీమనలన్, బెడవారలు చూచినప్డు విధమిది యేలా
నడునడుమని నడపించుచు, నడ జెడ్డఁగున నెడగ విడిచి నవ్వుచు ననియెన్. 205

ఆ॥ వె॥ ఇంటివారు వచ్చిరేని దిమేలౌనె, తోడివారలేమి చూడకొనరె
రమణి చిలుక, కోటరమ్మునఁ జూడుమీ, చిత్తగించె మనదు చేష్టలెల్ల. 206

కం॥ అనవినికని తనమనమున, వనితయు బలపడిన మదన భరమున ననియెన్
ననుఁగొని చనుమిఁకఁ బదపడు మనయునికికి వెలవక చట మని యెదమనుచున్ 207

వ॥ అనుటయు నాకపహానాభిక్షుకుండు గరువంపు నగవు చెన్నున వింతయొఱపగు మోముఁ
నొకింత మలంచి యెత్తి. 208

ఆ॥ వె॥ వెలఁది నీకునింత గలదె ధైర్యమ్ముగ, యవ్వ లోగిఁగంపవాదు నాలిసుమ్ము
చెప్పలేదటంచు దెప్పెదవో యేమొ, కొండదొరలబిడ్డ చండికాళి. 209

మ॥ అనియింకేమియొ పల్కుచున్న యెడ నయ్యాజ్ఞాక్షి వారించి, నా
చనవింతైనను జెల్లనిమ్మదియె మీ స్వాంతమ్ము బాధింప, నా
యనుమానమ్ము నమానుమన్న నగియెల్లైనన్ సరే దీనికై
కొనుమంచుం దనసంచి యామె మెడఁగీల్కొల్పెన్ హసద్వక్త్రయై. 210

కం॥ నాసంగతిగాదని, దా, నాసంగతినొప్పి వెంట నటుగొనిపోఁగా
నీసొదలెనపుడు నామది, నాసంగతి యిపుడు చెప్ప నదిసిగ్గయ్యెన్. 211

కం॥ అటులా కుటిలాలకదన, నటనకులోఁబడుచు వెంట నడచెదు నెడలన్
బటునట నాఘటనాలం, పటుఁడావయి పలయుపనియుఁ బరిపూర్తిగనన్. 212

శా॥ ఆలాపించెను రాగ మాళ్రిమమువారాబాల గోపాలముల్
గేలోక్కించుకయె త్రివీనులను జిక్కింపంజలింపన్మతుల్
వేలందాకెడువార్ధివీచికలటుల్ విచ్చేసి రచ్చోటికా
వేళంగొందఱభాగ్యలాత్మ గృహకుంభీపాక మందుండినన్. 213

సీ॥ జాఱుకోకలవారుమారు పైటలవారు, తేఱిచూచుచునోరుతెఱచువారు
చంకబిడ్డలవారులంకెపేరులవారు, ముక్కున వ్రేలిడితక్కువారు
సగమునిచ్చినపాలనెగ చేపుతల్లుల, వెంబడుపసులకదంబములును
నాలవెంబడిలేడికాలితొ్రొక్కులవచ్చి, యత్తెత్తిచూచువనాంతరులును

గీ॥ చిత్తరువులట్లునిల్చి చూచెదరెకాని, పూనియొకరైన నాబిచ్చగానిఁగాని
వెనుకనిల్చినమునిపత్నివిధముగని, కనరు తలపఁరు నౌనుగాదనరు చనరు.214

గీ॥ అదిజగన్మోహనమునిత్యమద్భుతమ్ము, సత్యమానందజడము నిష్కంపసుఖము
నేమిపుణ్యమ్ముచేసెనో యేమొకాని, తొంటిమునిపత్నిమూలమీపంటకెల్ల. 215

సీ॥ తమభర్తలనెకాని తక్కినవారిమో, మెఱుఁగనివారలే యెల్లవారు
నాశ్రిమమ్మునువీడి యడుగటుపెట్టని, యతిసుకుమారలే యచటివారు
పుణ్యమ్మనకుబిచ్చమును బిల్లికేనియుఁ, బెట్టనివారె యావీటనెల్ల
వసమానలసమాన కుసుమాస్త్రశస్త్రరం, పదవెఱయాయున్న సౌభాగ్యవతులు

గీ॥ వీరికెల్లర కెల్లతె పీకుమీఱు, వారలెల్లరునిండ్లనున్నారు వారి
వెంటఁగొనిరాఁగవీరలువెంటరాఁగ, నేఁగెఁబరమేశ్వరుఁడువారియిండ్లకపుడు.216

సీ॥ తనమతిచెడకుండఁ దలుపువేసినసాధ్వి, దొడ్డిపై మదురూఁకి దూఁకివచ్చెఁ
దనచెవిఁబడకుండఁ దలచుట్టుకొ్రొత్తడి. చూచువారలునవ్వఁ దో్రొచివచ్చెఁ
దనసోయగమ్ముమాలఁ దాఁచినయెలనాగ, ముడివీడువలువల ముందునిలిచెఁ
దనపేరుగాపాడికొాన డాఁగుభామిని, బట్టబయలుగవచ్చి నిట్టనిలిచె

గీ॥ నెవ్వరెవ్వరుసుకృతమ్ము నెంతచేసి, రంతకంతయెకాకింక నంతకంత
కతిశయమ్మయి ఫలియించెనపుడుహరుని,కపటభిక్షుకవేషసంఘటనమందు.217

గీ॥ ఉన్నవారున్నయటు లింటనున్నవసుల, విడిచి రోఁకలి, పిడులు, దువ్వెనలు, జడలు
విడకవచ్చిరి వంటింటిపడతులుమఱి, తడుపుమడిబట్టలటుచుట్టితడలికొనుచు. 218

ఉ॥ వచ్చిరిమత్తకాశినులు వైళమ పచ్చడిసేయుబండలన్
గుచ్చియ ఘీతకృతుల్ వెలయఁగొప్పవిడం జిఱుగందుమేనులన్
బచ్చిఘటమ్ము నీరుబుకివచ్చినరీతిఁ జలత్కుచమ్ములన్
దచ్చనలాడునప్పితిఁది తల్కుతళుక్కులు పిచ్చలింపఁగా. 219

వ॥ ఇత్తెఱంగున వెలువడిన యత్తపోధనులా సుందరేశ్వరుని వెంపడిం దారుకామునీంద్రులఁ
జేరుటయాదిగాఁ గడమవృత్తాంతమ్ము మీ విన్నయది కాదె యని పలుకుటయు నమ్మహా
మునులచ్చెరువంది పలువిధమ్ముల నాగోవిందు నుతించిరంత. 220

మ॥ అసిధారావ్రతశీలశాలికి శివధ్యానైకసంసీలికిన్
వ్యసనాస్పృశ్యపవిత్రవృత్తునకు నిత్యప్రౌఢసారస్వత
వ్యసనాధీనునకుం గవీంద్రగురుదేవామోఘదాశీర్వచః
ప్రసవోత్తంసితకావ్యసంతతిమహాభాగ్యైకవిభ్రాజికిన్. 221

కం॥ భ్రమరాంబానందనునకుఁ, గుమారకవితావినోదగోష్ఠీనిరత
ప్రముదితచిత్తాంబుజునకు, సమస్తకల్యాణనిలయ సౌజన్యునకున్. 222

మంజుభాషిణి॥ రమణీయ భవ్యగుణ రాజధానికిన్
సుమనశ్శిరస్సుమితసూక్తిధానికిన్
గమనీయ దుర్గకును గావ్యకన్యకన్
రమణుండుతండ్రికవిరాజమౌళికిన్, 223

మ॥ వరదుర్గాపద పూజనాకలితసౌభాగ్యాబ్ధియౌతల్లి యా
వరదుర్గాంబికపట్టి భక్తినొసరింపంబూని కాంచీపురీ
శ్వరమాహాత్మ్యమునందు నాలవది యాశ్వాసమ్ము దీనిన్మహే
శ్వరుఁ డాచంద్రము నాహిమాలయముగ న్వర్ధిల్లఁబోషించుతన్. 224



# కాంచీఖండము.

## పంచమ ఆశ్వాసము — 147 పద్యములు.



కం॥ శ్రీవిశ్వనాథనరపతి, సేవితునకు మధురరసవిస్ఫూర్జకవితా
ప్రావీణ్యునకును సంతత భావితశివపాదభక్తి పరతంత్రునకున్. 1

వ॥ అమ్మహావిష్ణునకు నమస్కరించి, యాలోకమాత. 2

ఉ॥ చెప్పఁగరానియప్పలుకు చెప్పకయుండుట లెస్సయెంతయున్
జెప్పక చెప్పుచున్నదటఁ జెందినయట్టిమహత్త్వమెల్ల మీ
యిప్పటిమాపురేఖ వచియింపుఁడి, యీపయి నేమి సేసె, మీ
యప్పసివాఁడు వాసికథ లద్భుతమంచును విందు నెప్పుడున్. 3

వ॥ అనియడిగిన, నన్నారాయణుండు శాస్త్రవైభవకథాశ్రవణకుతూహలుల నామహలంగముం
గొని సకౌతుకమ్ముగా నిందిరనుపలక్షించి యిట్లనియె, తొల్లి మేరువున ముంచమంతమ్మను
పర్వతమ్మున మునులు ఘోరమ్ముగ తపమ్మొనరించుచున్నవారికిం బంచముఖుండగు బ్రహ్మ
సాక్షాత్కరించిన వారలయ్యనఘు యథార్హమ్ముగఁ బూజించి. 4

— ※ బ్రహ్మకు వేదమునీశ్వరుమహిమ చెప్పుట ※ —

కం॥ ఎవ్వఁడు సృజించు జగముల, నెవ్వనియందణఁగు, ముక్తి నిడుటకునీశుం
డెవ్వఁడు పరాత్పరుండగు, నవ్విభుఁ దెలియంగఁ బలుకుమయ్య మహాత్మా. 5

వ॥ అని యమ్మహాత్ముం బ్రార్థించిన. 6

కం॥ నాయందకలుగు నిఖిలము, నాయందయణంగు, లేఁడు నాకన్నఁ బరుం
డేయెడల నన్నుఁ గొలిచిన, బాయున్ భవబంధమనియెఁ బంకజభవుఁడున్. 7

వ|| వారలప్పలుకులాదరింపక వేదమ్ములక్షించుటయు నవిమూర్తిమంతమ్ములై. 8

కం|| కేవలరాజస,మోహాస మావిష్టములజునినుడులు మన్నింపక,తా
మావిర్భవించి వేదము, లావిధికింబల్కె విమల మగునర్థమ్మున్. 9

గీ|| అందుబుగ్వేదమనియెవిశ్వాధిపుండు, నధ్వరమ్ములు వేల్పులకతఁడువిభుఁడు
నీశ్వరేశ్వరుఁడగునమ్మహేశుకనుల, ముందునిన మొన్నఁబుట్టినబుడుతవీవు. 10

గీ|| వేదములలోననా పేరువెలసెరుద్ర, మందుశివదేవుఁబలుకుపుణ్యమ్ముకతన
నంశములచేత శాసించెనఖిలమతఁడ, విశ్వకారణుఁడనియుజుర్వేదమనియె. 11

గీ|| ఎవనియాజ్ఞాబలమ్మునకెదురుపలుక, వెఱచునీపంచభూతముల్ వినతుఁడయ్యె
వజ్రియొకగడ్డిపోఁచ శాపరమశివుఁడు, విశ్వకారణుఁడనిసామ వేదమనియె. 12

గీ|| ఆకసమ్మునుజర్మమ్మునట్లుదాల్ప, నయినయప్పుడు మోక్షమ్మునందవచ్చు
హరునివిడనాడియితరులనర్చచేసి,యనుచుహసియించెనపుడథర్వణమువిధిని. 13

వ|| ఇట్లు వేర్వేరఁ బలికియుండాలి చదువులొక్కమొగి నప్పితామహుంగని యొక్కటిగా
నిట్లనియె. 14

గీ|| వేదశాస్త్రపురాణముల్ వెడలియెందు, నెవనిబోధించుసకలమ్మునీశుఁడనుచు
నాతఁడొక్కఁడయారాధ్యుఁడగునుగాదె, చేరమోక్షార్థులైనయెవ్వారికేని. 15

కం|| జ్యోతిర్మయుండుబ్రహ్మము, ధాతుఁడుపరతత్త్వమాదికారణుఁడమరుం
డాతండయీశ్వరేశ్వరుఁ, డేతన్మాత్రులకుమనకు నిట్లనదగునా?. 16

వ|| అనినవెడనవ్వునగి యహంకారవిమోహితుండై యయ్యజుండు. 17

గీ|| ప్రణవరూపమ్మునిష్కళబ్రహ్మమేడ, తామసుండునుసకలవిధ్వంసకుండు
రుద్రుఁడెక్కడపొమ్మనిరోసపడియె, నంతనొకవింత తేజమత్యంతమగుచు. 18

క॥ ప్రాదుర్భవించిప్రణవము, కాదనిబోధించెఁగమల గర్భునితోఁడున్
గాడసియె నేనుఁజని, యు న్మాదము గాదన్నఁబట్టు వదలఁడయ్యెంతన్. 19

—※ భైరవుఁడు బ్రహ్మశిరము ఖండించుట. ※—

క॥ ఆదిత్యజాతవేదో, వేదింబలుజాతిరూపపరిగ్రహము మహా
వేదార్థమళికనేత్రము, ప్రాదుర్భావమ్ముఁ జెందె భాసురమగుచున్. 20

క॥ ఆరూపమ్మునుబుత్రిక, రారమ్మని పిలిచె విధియుఁ గ్రొవ్వున నచ్చెన్
ఘోరమ్ము శూలముఁ గొని, భైరవుఁడంతం దిభయదభాంకారమునన్. 21

శా॥ బ్రహ్మాస్త్రమ్మును బైచె వారిపయిననా శ్రీవగర్భుండు నా
బ్రహ్మాస్త్రమ్మును మ్రింగి వాఁడుజక్షై పైవచ్చి చేకోల నా
బ్రహ్మద్రోహిశిరమ్ముఁ ద్రుంచె నచటం బ్రత్యక్షమై యీశుఁడా
బ్రహ్మన్ మృత్యువుబారినుండి తలఁగన్వారించి యాభైరవున్. 22

శా॥ మోహమ్మెల్లనడంగి సాఁగిపడి యాముక్కంటి పాదమ్ములన్
బాహాద్రోహిణముంచు వేడుమ్రొక్కు బాలించియాభైరవున్
సాహంకారులరక్తభిక్షఁ గొని రమ్మంచుం దశాసించె నా
స్వాహానాథలలాటుఁ డాతఁడుచనెన్ బ్రహ్మాండముల్ఘూర్ణిల్లన్. 23

మ॥ ఒకలిప్తంబనుదెంచె వాఁడుమరలన్ హుమ్మంచు పెన్మూల్ విరిం
చికపాలమ్ములుదండలై వికటవృత్తిన్ నటింపం గుభి
త్సుకతాస్వీకృతరక్తభాండ భరణోద్యద్బాహుసంతుంగాకృతిన్
వికటాంఘ్రిన్యసనమ్ములన్ ధరణికంపింపంగ నర్తించుచున్. 24

గీ॥ రమ్మపుత్రిక! రమ్మరారమ్మటంచు, వానిఁ దనకౌఁగిటికిఁ జేర్చి పట్టుకొనుచుఁ
గాలభైరవకోపమ్ము చాలునను చు, నుగ్రరూపమ్ము హరియించె నుగ్రుఁ డపుడు. 25

గీ॥ అనుపమానమ్ము దివ్యమత్యద్భుతమ్ము, బ్రహ్మహత్యాపహరణముగ్రమ్ము శాస్త
భైరవుని లీలఁ గాంచి సంభ్రమముతోడ, నేనువలనొని శివదేవు నలమిమ్రొక్కి 26

గీ॥ నీవ భవుఁడవు నీవల్ల నిఖిల మొదవు, నభవుఁడవు నీవు జనిమనీక భ్రమము
హరుఁడవఖిలమ్ములను మృత్యుహరుఁడ వీవు శంకరాభిఖ్య నీయందె సార్థకమ్ము. 26

సీ॥ అంగీకృతుండును నంగీకృతుండయ్యె, మదనుఁ డెవ్వని చూపుఁ గదియ నంత
శ్వీకృతమ్ములును నశ్వీకృతమ్ములునయ్యె, నిగమమ్ము లెవ్వాని నికటమందు
స్త్రీభావమందియు స్త్రీభావమందితి, నేను మున్నవని నిరీక్షణమునఁ
బరమవాగర్థప్రపంచోపమేయమ్ము, దాంపత్యమెచ్చోట నింపు మీఱు 28

గీ॥ మెట్టుగుట్టలు దాను జేపట్టుకొండ, లయినఁ గలఫాతమయము లౌనట్టి విభుని
శివుని వామాంగజాని నచింత్యమహిము నిన్ను సేవింతు మయ్యయోనిటలనయన.

కం॥ అనిమునులు నజుఁడు నేనుం, వినుతించితిమ భవుఁ బెక్కువిధముల శివుఁడుం
గనికరము చిలుకు చూపుల, ననుగ్రహించు మనుమమ్మనటఁగనుఁ దొలఁగెన్. 29

మ॥ అపుడా భైరవుఁ డేగి కాంచిపురి కేకామ్రేశుఁ బూజించి వి
శ్వపతిన్ శంకరు నాదిదేవుని ప్రతిష్ఠం గొల్చియుయ్యాశు సత్
కృపకుం బాత్రుఁడునై వసించె నచటం దివ్యాబ్దముల్ భక్తులన్
గృపరక్షించుచునుండు వాఁడె నిజశాస్తృత్వమ్మమోఘమ్ముగా. 30

గీ॥ అంట నేరవు స్వప్నమందైనఁ గాని, చోరవిషవహ్నితస్కరక్రూరజంతు
శాకినీగ్రహబాధ లెచ్చటను గాని, భైరవస్వామి భజియించు భక్తులకును. 31

కం॥ దాక్షాయణీవినోదికి, దక్షిణభుజమతఁడు విశ్వదహనమునందున్
శిక్షింపుట రక్షించుట, భిక్షించుట వానిపనులు విశ్వప్రజలన్. 32

గీ॥ ఆదిభిక్షుకునకు నాకు నల్లనాఁడు, దారుకావనిఁ బుట్టిన వీరుఁడగుటఁ
దెలుపుమైచాయ నత్తెఁజిత్రింపె మునను, హరిహరాద్వైతరూపసిద్ధాంతమతఁడు. 33

వ॥ కాలభైరవుండును, వటుకభైరవుండును శాస్తభైరవుండును, నివి మొదలుగాఁ బెక్కునామమ్ములం
బెక్కురూపమ్ముల భక్తప్రియంకరుఁడై వెలయు. 34

చం॥ అనుటయు మునిచంద్రులు, మహాత్మ కడుంగడు విస్మయావహ
మ్మనితరసామ్యమున్ గిరిసమంచుఁ బ్రసిద్ధము నైన వీరభ
ద్రుని చరితమ్ము చెప్పఁగదె ముందుకు కేమి యొనర్చె దక్షుఁడా
తని సృజనమ్ము భగ్నమగు తత్త్రిమవృద్ధియనంగ వెన్నుఁడున్. 35

కం॥ కనులెస్సయడిగితిరి నా, నుడులకు శక్యమ్ము గాదు నొడువఁగ దీనిన్
దడఁబడకుండఁగ నయినను, నొడివెద మీకోర్కె తీర వినుఁడని పలికెన్. 36

—※ దక్షునికొడుకులకు నారదుఁడు శివభక్తి బోధించుట ※—

గీ॥ బ్రహ్మపనుపున, దక్షుండు ప్రజసృజింప, నానవెట్టె సుతులహర్యశ్వముఖుల
వారలొకచోట సర్గోపాయ మరయ, మదివిచారించు నెడల నారదుఁడు వచ్చె. 37

గీ॥ బ్రహ్మసుతులు సభఁ దీర్చి పరమనిష్ఠ, నేనిసాధింపఁదలఁచిరో తెలియఁ గోరి
యడిగెఁ జెప్పుడి మీరలో యయ్యలార, చెప్పెదగు నేని మీ చేయు చింతనమ్ము. 38

గీ॥ అనిన వారెల్ల రతనితో ననిరి మమ్ముఁ, బ్రజలసృజియింప మా యయ్య పనిచె నదియు
మొదలుపెట్టంగ నొకచోట మూఁగి దాని, కగు నుపాయమ్ము నరసెద మయ్య యిపుడు.

గీ॥ ఒకనిమార్గమ్ము నచ్చదింకొకనికిందు, నరయఁగ ర్తవ్య మిదమిత్థమనఁగ రాదు
పేర్మి దయగలవేని యావిధము సెప్పి, మమ్ముఁ గరుణింపుమన్న నమ్మౌని నగుచు. 40

కం॥ ఓహోహోదక్షునిసుతు, లాహా మీయంతవార లరయనియదినే
నూహించిచెప్పవారలకౌన, నాహాసమోఁగాదె బ్రహ్మచారులకరయున్. 41

గీ॥ ఎల్లలోకమ్ములనుజంపదక్కుత్తుఁడైన, హానునిచేఁబడుచేఁబరాత్పరునిచేత
నగునుమీకేలతేసియూయూసపడుట, మమము క్రొక్కఁగ నేల కాల్గ మగ నేల. 42

గీ॥ బంధమునను౦డి వేఱొక్కబంధమునకుఁ బోలుపడునట్టిమూర్ఖులెవ్వారుగలరె
యల్లశివపూజవిడిచిన నెల్లయువియు, బంధకారణములుగదా ప్రాజ్ఞులార. 43

కం॥ పురుషార్థమ్ములయందుం, బరమముపరమమ్ము మోక్ష సంగతియగుటన్
బరికించిదుఃఖకారక, మురుతరకర్మమ్ము విడుచుటొప్పగు నెందున్. 44

గీ॥ ఒక్కయమృతమ్ము నిలుప వేఱొక్కయమృతమాడు దుష్కర్మపట్టుల పాడికప్పి
యపురమీయంతవారలు నరయకుఁటక, కర్మబంధమ్ము దవులుట కార్యమగునె 45

కం॥ శివకరము శివతరమ్మను, శివరూపము చిన్మయమ్ము శ్రీకరమగుటన్
భవముడుఁగ మీరలునను, శ్శివాయమంత్రిమ్ము నెఱిఁగి చేరుఁడు శివునిన్. 46

కం॥ అనునారదువచనమ్ములు, వినివారలు సృష్టిపథము విడిచి, శివధ్యా
ననిరతులగుటను విని కడుఁ, గనలుచు దక్షుండు పిలిచి కయ్యపుఁ దపసిన్. 47

—※ దక్షుఁడు నారదుని శపించుట ※—

శా॥ ఓరీనారద క్రొవ్వి నా సుతుల కేదో మంత్రిముం జెప్పి సం
సారస్ఫారసుఖమ్ములుం జెడ నిటుల్ సన్న్యాసమిప్పించి, నా
వేరా, దిమ్మరి దీనికిన్ ఫలము నీకీ జీవితమ్మందిఁకన్
నారీసౌఖ్యము లేక కందుమనుచున్ శాపమ్ము సంధించినన్. 48

కం॥ కలకలనగియుతఁడిట్లను నలుకం గొనియలుకవడకు నంతలేమిారల్
తెలియఁగనాతప్పిదమిం, దులవమ్మనుగలదె పలుకు దుడుకులు తగునే. 49

ఉ॥ తిట్టినఁదిట్టవచ్చు గురుదేవులుమిారలు నాకుఁగాన మిా
తిట్టినతిట్టు నాచరితదిద్ది కళంకము బాపి యెంతయుం
బెట్టనికోటయయ్యెఁ దనపెంపుగణించెడి పెద్దలొక్కటం
దిట్టినతిట్టులుం దిరిగి దీవెనలౌఁగద పిన్నవారికిన్, 50

గీ॥ ఆశ్రియాశునిబోలియా యలుకమిమ్ము, దగ్ధమొనరించుగాక నాతమముసడఁచి
వెలుఁగఁజేసెనునాదుజీవితమునరయ, నింటికినిజ్యేష్ఠయగుపొరుగింటిలక్ష్మి. 51

ఉ॥ ఏమిటనాదోసంగు పరమేశ్వరుఁజేస్పు టదేమిదోసమా
తామసమాసినీవు తెగుదారితెనమ్మన నాడఁజెల్లునే
తామసియెందునుంగనఁగఁదామసి యన్నదెఱుంగవోటు ని
న్నేమననేల నీకనులనీవె కరాంగుళిఁజొన్పిచీరఁగన్, 52

కం॥ వినుమిదిభవితవ్యమునీ, వొనరువఁ దలపెట్టుయాగముగ్రనిరీక్షా
కనదగ్నిబూదియగునని, పనివినియెనునారదుండు వచ్చినత్రోవన్. 53

వ॥ అప్పుడాదక్షప్రజాపతియు. 54

గీ॥ పురుషసంతతి వమ్మయిపోవుకతనఁ, గనియెనేఁబండ్రికూఁతుఁల ననుపమాన
రూపసౌభాగ్యలావణ్య దీపితలను, గీర్తిముఖ్యులఁగని సృష్టికృత్యమునకు, 55

కం॥ పదుగురఁ బదమూవుర నిరు, వదియేడ్వుర ధర్ముఁడనఁగఁబడు మనువునకున్
విదితుఁడుగశ్యపునకు, స, మ్మదమునఁజందురుఁడు విబుధమాన్యునకిచ్చెన్. 56

వ॥ వారివలన, వాదిత్యులు, దైత్యులు, కాద్రవేయులుం, మున్నుగానీనిఖిల విశ్వమునెల్ల వెలసెంత. 57

గీ॥ దక్షునిల్లాలు గావించు తపము మెచ్చి, యామె కాత్మజ యయి పుట్టి యాదిశక్తి
భవుని భర్తృనిగ వలచి చేపట్టెనంత, సతియు దాక్షాయణియు నాఁ బ్రశస్తిఁ గాంచి. 58

— ❋ దక్షుని యజ్ఞము ❋ —

మ॥ తన దౌహిత్రియయున్న విశ్వజగముం దక్షుండు దానన్నిటన్
దనకంబూజ్యుఁడొకండు లేఁడనికడుం, దర్పించి బ్రహ్మాత్మజుం
డొనరింపం దలపెట్టె యాగ మొకఁ డత్యుత్సాహియై, పిల్చె, దే
వనికాయమ్ముల నెల్లలోకముల, నాహ్వానింపఁ డయ్యీశ్వరున్. 59

ఉ॥ భావము లేని వాక్యము, విభావము లేని రసమ్ము, సత్యసం
భావన లేని కూర్మి, యనుభావము లేని ప్రియోపగూహమై
కేవలశబ్దసుందరము, కించిదపశ్రుతిగీత, గీత రా
గావిలమయ్యె జన్నమది యాయఖిలేశు నసన్నిధానతన్. 60

గీ॥ అరయ సర్వాంగసుందరియయిన చెలువ తిలకహీనమ్ము మొగము నా వెలుఁగఁబాఱె
నఖిలవస్తుసమృద్ధమ్మ యయినఁగాని, చంద్రశేఖరు లేని యాజన్నమపుడు. 61

గీ॥ అఖిలపదములయందును వ్యాప్తమైన, స్పష్టపడనట్టి ధ్వనిగల పద్యమయ్యె
నఖిలవస్తునిరూఢుఁడౌ నభవుమూర్తి, స్పష్టముగ లేని యాదక్షుజన్నమపుడు. 62

వ॥ ప్రణవరహితమ్మైన శ్రుతివ్యాహారమ్మును, నగ్రగహీతంబైన దర్భయుంబలె నా యాగసం
విధానమ్ము శివవిహీనమ్ముగుటకుం గుందుచు దధీచిమహాముని దక్షునింజేరి 63

మ॥ సురమాతామహ! యేమి యాగమిది, యాశూలింగపాలిన్మహే
శ్వరు రప్పింపఁగదయ్య, యీయెడను, యజ్ఞస్వామి లేకున్న, యీ
సురకార్యమ్మది యెట్లు సాగు, దమలో శోకించియు న్నిక్కమై
మఱుమాటాడరు దేవతల్మునులు నా మాటన్విచారింపుమా. 64

మ॥ అనవా మాటలకల్గి దక్షుఁ డపుడా హా, యెంత లోనెంతబు
ద్ధినిగన్నావుర! నాకు ధర్మములనుం దెల్పంగ విచ్చేసితే
చనుమా జన్న మశంకరమ్మగను నే సాగించి సాధింతు, మిం
చినమాటల్వచియింపఁ బోకుర దధీచీ! యంచు దూషించినన్. 65

శా॥ పెద్దల్ మీరలు పిన్నవారలపయిం బెంపేద ఆసిల్లుచున్
గద్దింపంబని లేదు నేను, ఋతముల్ మంటాపథవ్యాక్తి మీ
యొద్దం బల్కెదఁ దప్పులున్న యెడ మీరొప్పించి శిక్షించి మీ
పెద్దర్కమ్మునసిల్వఁ ద్రొక్కకొనుఁడీ, వేయేల వాదింపఁగన్. 66

కం॥ చేసెద నశంకరమ్ముగ, నీసవనమునంచు మీర లింతకుముందే
యీసున మును వెనుగానక, రోసిలి యూయన్న పలికె రూఢమ్ముగఁ దన్. 67

వ॥ యజ్ఞేశ్వరుండును సర్వజగత్కారణుండగు నీశ్వరు నిరాకరించి, నీ చేయుయాగమ్ము, శుభా
వహమ్ము గానేర దదియట్లుండె. 68

కం॥ పిలిచినవచ్చితి ముప్పుడు, తెలియక నీదుష్టచేష్ట తెలిసినపిదపన్
నిలువంగఁ గాదు మూకిటఁ, దెలిపెదఁ దెలిసినది చెప్పి తీఱఁగవలయున్. 69

కం॥ అనుచు సదస్యుల మొగమై, వినుఁడీ మోపూజ్యులార, వేగమ జన్న
మ్మును వీడి చనుఁడి లేక, న్ననుజింతించెదరు పిదప నానుడి వినమిన్. 70

ఉ॥ రండటు రాక పొందు పయిరాఁగల కష్టమెఱుంగఁ జెప్పితిన్
గొండిక బుద్ధి నీశ్వరునకుం బరిభూతి ఘటింప నెంత, ద
క్షుండగుఁగాక కాలగళు కోపకటాక్షమొకింత సోఁకినన్
మండుచుఁ దానఁ బూదియగు మాన్పనశక్యమదెంత వారికిన్. 71

ఉ॥ ఇంతికి నున్నమాట వచియించితి మీర లెఱుంగ నట్టిదే
సుంతయు లేదు మీమతికిఁ జొప్పడు దానినొనర్పుఁ డంచు దా
నంతట నాదధీచి చనె యజ్ఞగృహమ్మును వీడి కాంతయుక్
జెంతలఁ గంతలంజనువు శిష్యులు రాఁ దనవాస భూమికిన్. 72

గీ॥ ఆమునీంద్రుని మఱుగుట మఱచటి వారిఁ కాత్మహృదయమ్ము లరిగిన యట్టులయ్యె
హృదయశల్యమ్ము పోయిన ట్లెంచి దక్షుఁ, డరగ నుంకించు వారి నల్లంతఁ జూచి. 73

మ॥ దురహంకారవికార చిత్తుఁడఁగు నీ దుష్టుండు దాఁ బోవుటే
మరి మేలయ్యెను గాక, నా దుపలుకుల్ మన్నించి. నా చేయు, న
ధ్వరముల్ సాంగముగా నొనర్పుఁ డను దుంబ్రార్థింప వేల్పుల్ మునుల్
మఱు మాటాడక నిల్చి యజ్ఞవిధు లుల్లాసమ్మునం జేయుచో. 74

వ॥ అప్పుడయ్యాగకుండమ్మునం దగ్నిభట్టారకుండు. 75

మ॥ తన వంశస్థుఁ దిరస్కరించె శివుఁ డీ దక్షుండటం చెంచెనో
మునులగ్ని ప్రతిమాన మానసులు నిర్మోహుల్ మహర్యజ్ఞవ
ర్తననిష్ణాతులు వేదసూక్తముల చేఁ ద్రిప్పంగఁ ద్రిప్పన్ జగ
జ్జనకుం డీశ్వరుమూర్తి దానగుటనో సాక్షాత్కరింపం డటన్. 76

— ❋ దాక్షాయణి తండ్రియజ్ఞమున కేగుట ❋ —

చం॥ తనపితజన్నముం గనఁగ స్థావరజంగమమైన లోకమె
ల్లనుఁ జనుచుండఁ జూచి సతి లాలితశంకరవృత్తచిత్తయై
యనఘ! యనుజ్ఞ నీయఁ గదవయ్య, యనుగ్రహ మొప్ప నాకు, మా
జనకుఁడు సేయు యజ్ఞమది చక్కఁగ నేఁడిదె చూచివచ్చెదన్, 77

క౦॥ తనయుం తెంబిలువవలెరా. జనకుండు తనతనయ, నిట్టి చదువులు చెల్లున్
వనితలకుం బుట్టినింట్లను, జనకున్ మన్నింపదగును సాగిలి వేడన్, 78

వ॥ అనుచు నాలోకశంకాకులయై యుల్లంబలుక్షించి. 79

క౦॥ వినవో గాకిదినీమది, కనవో సోదరీ విపులకమలాక్షీ రో సీ
యనుంగుం దండ్రియు ననుం గా, దని చేసెడి జన్మమటకు నరుగందగునే. 80

క౦॥ అనుటయు భవానియిట్లను మెను మను గాక నేడె యగ మేలా చెల్లున్
జని యపుడమూచివచ్చెద, ననుమతియీంగదవె నాకుం బ్రాణేశ దయన్. 81

క౦॥ ఎన్నండుమిమ్ముం జేరితి, నిన్నాళ్లకుం బుట్టినిల్లు దెట్టినోయొజుంగన్
నన్నుభ్రమగన్నవారిని జన్మము నొసమునను గాని చనిచూతు విభూ. 82

క౦॥ మిమ్ముం గాదని యనుంగాక, ని గమచూడాచరణశీల! గనుగొన వేమిన్
తమ మెచ్చుసుతను గాదన, సమయుండు కా. తప్పించనంగ శక్యమ్ము గునే. 83

వ॥ అని యిట్లు బహుప్రకారమ్ములం బితృగృహగమనాభిలాషమ్ము మరలింపనేరక. 84

క౦॥ ఆర్య యటుదన్ను వేడిన, కార్యమ్మునుదోసి పుచ్చంగాం దలంపక యా
చర్యయసివార్యమని యా, యార్యకు సెలవొసంగెనంత నాయమయు దమిన్. 85

క౦॥ తనపుట్టినింటికరిగినం, గనికననును బలుకరింపంగా నొల్లరు పి
ల్చిన నొక్కరు బములాడరు మునుందనపలుకె మరుచూడు ముఖ్యులయందున్. 86

సీ॥ అక్క కదు ప్రియ! యెప్పుడరుదెంచితే యన్న వెనుచూడకయయామె వెడలిపోయె
నంతికినేమ రేగి యక్క! సేమమాయన్న, విసపించుకొనకామె వెనుకనొదింగె
కృత్తికా! రోహిణి యెక్కడే! యననామె, గొణుగుచు విదలించుకొనుచుం బోయె
నమ్మరెక్కడనున్నదమ్మ చితా! యున్న, బనియున్నదనియామె పక్కకరిగెం

సీ॥ కానిచో నిప్పటి నొక్కఁడు గాని మాటు పలుకకేమనియులుకుచు భవుని రాణి
చెఱువరుబోయెఁ జనకతండ్రి పవనమండపమును జేరంగఁ దమయంత
భటులు దోలఁగ, 87

కం॥ తనుఁ జేరి పాదములఁ బడు, తనయుం బెడ కాలఁద్రోఁచి దక్షుండంతన్
మును తెల్లఁ గాదు కాదని, యనినన్విని పించుకొనక యాగ్రహవృత్తిన్. 88

కం॥ ఓసీ నిను బిలిచిన దెవ, రే సిగ్గుశరమ్ము లేక, యేమనియిటకుం
ద్రోసికొనివచ్చినావే, పో సడికింజంక వలసెఁ బోలఁ తుక వగుటన్. 89

కం॥ నలకాంతుఁ దిరుగు మగనిం, గలియక మాగడపఁ ద్రొక్కఁగా బనియేమీ
తలఁదలఁగు మనియె వినఁడట, వలను మకుంకనెడి భార్యవచనమొకంబున్. 90

కం॥ పతిమాటవినక వచ్చుట, పితసేయు పరాభవమ్ము వెతబెట్టు వెఁగా
కతివల గుసగుసలును మఱి, కతికష్టము గాఁగ సతియు నలుక వొడమియున్ 91

కం॥ నిట్టూర్చి మొట్టకేలకు, దిట్టతనమ్మలవరించి. తిన్నని మొలుఁగుం
గొట్టిన కోకిలకుంబలె, నట్టిట్టయి వెడలననియె నల్లనసతియున్. 92

మ॥ తగు నయ్యా! విధి యంతవాఁడవు, మహాధర్మజ్ఞుఁడెందేని యుం
దగువాఁడం చనిపించుకొంటివి, మహాదక్షుండవే, కాని, యెం
త గుణంబుల్ దన యిల్లు సొచ్చిన సుతం, దర్పించి దూషింతురే
తగుఁబో నేఁటికి నైననుం దెలిసె నీతాత్పర్యమిం కేటికిన్, 93

ఉ॥ ఎ తమ భాగ్యుఁడైన నగునింతలు సేయు నెకన్నకూఁతు వి
న్నింత కుమించ లేదిపుడు నేనియు నీశ్వరుఁ బిల్వఁ బంపుమీ
సంతరియుంచు నిష్టిగొన పాగఁడలం పది కల్గెనేని, నీ
కంత ప్రయాస మేల జనకా! వలకాటికి నన్నుఁబంపఁగా?, 94

గీ॥ అల్లుఁడైయునఁ దనూజాతైనఁ బలుకయుమ్మె నేమి మీఁకంతజగకేక్కఁ డీశ్వరుఁడు 95
అభవుఁడతను వైనఁడుగ్నియాయరణియందు, నెల్లజనియించుమహానిగ్రహించుమీఁద

గీ॥ వల్లకాఁటనువిరిగెడి వాడటంచు, నొక్కఁడోషమ్ము వలికితి వక్కటకట
అవియసిద్ధాంతపఱమనాహానివిభుత, నేవిపలకాఁడుకామనీ వెంచి చెపుమ. 96

కం॥ శుభమెఱుఁగి తెలుపవచ్చితి, నభవుండగ గౌరవింపుమయ్యా యిఁకైనన్
విభవమ్మడరఁగ ననునా, సభ యెల్లను మెచ్చుకొనె సతిపవనమ్ముల్. 97

కం॥ మెచ్చుసభ మెచ్చిచూడక, మచ్చరమునఁ బెచ్చుపెరిగి మండుచునతఁడున్
జెచ్చెరనడుసడుమిఁక నీ, వచ్చిన దారిని బిశాచి, బదరకయనుచున్. 98

కం॥ నడవేని వెడలనడఁచెద, నుడిగింపఁగ నెవ్వరడ్డమో చూచెదనీ
గడుసుఁదనమ్మిటఁ జెల్లదు, వెడలుము వెడలుము యటంచు, విడివడఁబలుకన్, 99

కం॥ ఆదక్షుని ఘూర్తత్వముఁ, గాదనఁగా నేర రెరి కలవారిచటన్
గాదిలిసుతకష్టముగని యాదక్షునిజాయ తెరలి యవనింబడియెన్. 100

కం॥ తనతండ్రియహంకారము తనతల్లియునవనిఁ దెరలు తద్వ్యాథ మెల్లన్
గని మఱగెడుమదినిజగ, జ్జనని మహాపరుషరోష సంరంభమునన్. 101

గీ॥ ఓరిమహాత్మ తెలియనోపుముక మాట, చనువు లేటికి నీకు యుష్టమ్ము లేల
యాలుబిడ్డల నేడ్పించునట్టి నీకు జయముగాదంచుఁ బలికె సశ్చయముతోడ. 102

వ॥ గుండియలు తేరి నీ యుట్టివానికిం గూతుకరుపించుకొనుటకంటె నొక్కఱాతికిం గూఁతుఁ గనుట
మేలు కాదె, యని నిరసించుచు. 103

గీ॥ భవునియిల్లాలు యోగవైభవము కలిమిఁ, బవనుబంధింపసభ జిచ్చుపాలువడియె
నా మహాత్మ్యర తేజమ్ము నరయు నెడలఁ, గనులుమిలమిల మెఱసి చేతనతఁ దొలఁగె.

— ※ వీరభద్రావిర్భావము ※ —

శా॥ యోగాగ్నిం దహియించి దేహము మహాయోగీశ్వర ధ్యాన, స
మ్యగ్ఘోరవపుర్విరాజిత మహోవ్యాపారముల్ మీఱ, నా
యోగీయారణిఁ బుట్టిమెట్టి సతియుం బ్రాణేశు దేహమ్ము నా
యోగాగ్ని ప్రవిదహ్యమాన తనువహ్న్యుద్గార కీలావళిన్. 105

శా॥ రుద్రాంశమ్మున భద్రమూర్తి యొకఁడున్ రుద్రాణి యంశమ్మునన్
రౌద్రాకారత భద్రకాళియు వడిం బ్రాదుర్భవించెన్ జ్వలత్
కద్రూపుత్రక రాళహాల మయు రేఖాకార పిత్తావళీ
విద్రావత్త్రిపురక్షముల్ సవనవిద్వేషైక వేషార్భటుల్. 106

శా॥ ఉగ్రాత్ముండగు వీరభద్రుఁడు మహాహుంకారముం జేయఁ బ్ర
త్యగ్రక్రూర మహాయుధుల్ వికటదంష్ట్రాభీషణాస్యుల్ బలో
దగ్రుల్ పుట్టిరి భూతనాధులు మహాహంకారమూర్తుల్ గవా
టగ్రద్వారనిబద్ధ ధావదమరుల్ యజ్ఞాంగ విధ్వంసకుల్. 107

శా॥ ఆకాళీ వికటాట్టహాసమున, సద్యస్స్నాతవిద్ధోగ్ర, సిం
హీకంఠధ్వని ఘోరగర్జితలు, మధ్యేమాళిచంద్రాకురల్
వ్యాకీర్ణాంబరలూర్ధ్వకేశలు, పిశాచాళీ పరీవారలే
కైకబ్రహ్మకపాలధారిణులు, దామే తెంచి రుగ్రాకృతిన్. 108

కం॥ వెఱఁగుపడి చూడ దక్షుఁడు, పఱతెంచిన భూతభటులు, పరివారమునం
దఱిముఱి యజ్ఞాంగమ్ములఁ, జెఱిచిరి విఱిచిరి వితాకుచేసిరి యంత్రన్. 109

— ※ దక్షయాగధ్వంసము ※ —

కం॥ అమరీకబరీభార, మ్ముమునీంద్రశ్మశ్రుభారమును ముడియిడుచున్
దమునెదురు యజ్ఞరక్షక, సమూహమును ముట్టిగిట్టి చదుపుచునలుకన్. 110

గీ॥ అగ్ని నెరకొల్పి చేసిరం దాహుతులను, యాగవస్తుల నెల్లను యాగదండ
ములను వేల్చిరి యింధనములుగ విమల, మణులఁ జేసిరి లాజహోమముల వారు, 111

గీ॥ ఒకరు నేరర యాబాకి నోసరిలఁగ, మంత్రతంత్రమ్ములను శౌర్యమహిమఁ గాని
సప్తకోటిమహామంత్రజనకమగుట, నయ్యొ శరణమ్ము మాకు పంచాక్షరమ్ము. 112

శా॥ ఆక్రోశించెను దక్షుఁడంతట, మహాహంకారరూపుండు, మీ
విక్రాంతుల్ చెడిపోయె నేటికిఁ దపోవీర్యమ్ము శౌర్యమ్ము, రం
డీ క్రూరుల్ చెలరేగఁ జూచెదరె మీ రింతేసి వారయ్యు, నా
ర్తాక్రోశమ్మును దీర్పఁజాలియు వృథా ప్రాణమ్ము లర్పింతురే. 113

కం॥ దక్షుని సంతానమ్మట, యక్షీణతపఃపరాక్రమాన్వితమఁట యీ
బిక్షుకపరివారమ్మున, భక్షింపఁగఁ బడుటకన్నఁ బరిభవము న్నే. 114

శా॥ రా రా! యింద్రుఁడ రారా సూర్యుఁడ యమున్ రావయ్యా! యోపద్మగ
ర్భా! రమ్మా యియనంత యోరి గరుడా రారమ్ము జైవాతృకా
చేరం జూచెద వేల రాఁగదవె, యో శ్రీనాథ యంచు న్ననున్
జీరెన్ వీరుని భూత సంఘముల విచ్ఛేదింప ఛేదిల్లుచున్. 115

మ॥ భవితవ్యమ్మది దాటరానిదగుటన్ బ్రహ్మాదులుం గూడఁగా
వివిధోగ్రాహవకర్మ శౌండమగు నా వీర వ్రజమ్మును దాఁ
కి విపాటించితి, ఘోరదానవరణక్రీడా మహాసాధన
మ్మవు శార్ఙ్గమ్మున, బాణవాహినుల రాత్యాటోపముల్ మాన్పఁగా. 116

గీ॥ చెల్లచెదరైన తనభూతసేనఁ జూచి, వచ్చి వీరుండు కహాకహార్భటులతోడ
విఱుఁగ నేసెను శార్ఙ్గమ్ము మెఱపినట్లు, వాఁడి తూపున గరుడి విభ్రాంతిపడఁగ. 117

ఉ॥ నందకమాని యేనతని నారిఁ దటాలునఁ ద్రుంచి వేసితిన్
దండడిప్రిలవక్షము నతండుపకాలున నవ్వి, నెత్తురుల్
చిందెడిచూపుతో విసరి చేగదవైచె జ్వలద్దవాగ్నులం
దుందడి నైన, దానిగదతోఁ గదియించి మరల్చి నవ్విన్. 118

ఉ॥ ఆర్పఁగరాని కోపమున నాతఁడు దగ్రిము శూలమెత్తుచున్
దీర్పుముదీర్పుమింకఁ గడతేఱితివీవని పైవనంతలో
నార్పులుబొబ్బలుం జెలఁగ నడ్డముసొచ్చి విధాత, వేడి, ని
ట్టూర్పులభూమి పైనొఱఁగె నుల్లమునుచ్చి చనంగ శూలమున్. 119

ఉ॥ అంతకుమున్న మాయజుఁడు దగ్రిఁబూంచిన యస్త్ర మెంతయున్
నింతగవచ్చి తాఁకెనల వీరులలాటము చిమ్మ నెత్తురుల్
కొంతగడస్సి తేఱుకొని క్రుద్ధమృగేంద్రుని లీల చెంగునన్
గెంతుచునగ్గమాసురలఁ గీడ్పడఁజేసెనతఁడు వ్రేల్మిడిన్. 120

కం॥ తెప్పిరిలి యంతనజుఁడుం, గుప్పలుగూరలుగఁ దఱిగె కుమకుమవడంగాఁ
ద్రిప్పెడలంగాండీవము గప్పినయాభూతబలము కనుకనిఁ బాఱన్. 121

చం॥ అదిగని నవ్వె భారతి భయంకరమా కెడ వాత్రియమ్ము, న
న్నెదురున నాటి ధాతగడు నొచ్చి తటాలున లాగి దానినిన్
గదిసి విధాత నెన్నొసలు గాడఁగవైచినఁ జూచి మిక్కిలిన్
బెదరెడు వాణికిం గలిసె వీరుఁడునంతటఁ గాళియడ్డమై. 122

శా॥ మీ కేలాయొకయాడు దానిగవియున్ మీదాసి నేనుండఁగా
నాకీ బాణమొసంగుఁడంచు నతనిన్ బ్రార్థించి, ప్రార్థించి, దా
నాకర్షించుచు డాసి, రోసమున విద్యాదేవి ధర్షించుచున్
గోకొమ్మంచును రేసియా సుదతి ముష్టింగోసి గర్జించినన్. 123

మ॥ అజుఁడంతం దనయాలి పాటు గనిబ్రహ్మాస్త్రమ్ము సంధించినన్
నిజవక్త్రమ్మున మ్రింగి, పొంగి మునికెన్వేయుంచు, పండ్లూడఁగ
న్నజయింపంబయివచ్చు పూషు, విఱిచె న్నగ్గాలికిన్ గోసె, వా
యుజునాల్కల్ శశిముద్దచేసె నతికెన్ హుమ్మంచు నామీఁదికిన్. 124

శా॥ సర్వాస్త్రమ్ములఁబోరి పోరియితనిన్ సాధింప రాదంచుసా
పర్వశ్రేయము, శిక్షితాసురము, శర్వప్రీతిసంభారముం
దుర్వారమ్మగుచక్రము న్విసరితిన్ ఘూర్ణిల్ల నాకాశముం
బర్వెంజక్రము వీరభద్రు తలమ్రింగం బిశాచాండమై. 125

గీ॥ సకలశస్త్రాస్త్రసారమ్ము సర్వహారము, ప్రళయభాస్కర తేజఃప్రభాసమాన
మయినచక్రమ్ము శివుమూర్తి యగుటనపుడు. వీరు కాలికిగండపెండారమయ్యె.

గీ॥ యజ్ఞమప్పుడు భయమందిహరిణమగుచు, (బాణ: బాణిన వెంబడి బాణనిహతి
హరిణమునుగూల్చి యటమృగవ్యాధుఁడయ్యె. దక్షుఁబడదన్ని యతనిపైఁ
దాండవించె. 127

వ॥ అప్పుడు దక్షునిభార్యయగు ధరణి, శోకాకులయు, వికీర్ణకేశయు, ముకుళితకరాంబుజయు,
నగుచునవ్వీరుని దగ్గఱి. 128

కం॥ హాహాకారము లెసఁగం, బాహి విభో పాహి పాహి పతిభిక్షాం మే
దేహి యని వేడునాలో, ద్రోహి యితఁడనుచు దలను ద్రుంచె నతండున్. 129

కం॥ మాతామహుఁ దుఃఖిల్లను, మాతా తనమంచితల సమర్పింతునటం
చాతగ్గవరి యజశిరమును, దాతఁడు నఁగనంచుఁ దెచ్చి తగనతికించెన్. 130

గీ॥ అఖిలకల్యాణనిలయమా యాగశాల, వల్లకాఁడయిపోయె నప్పట్టునందు
భార్గవునిమాటసతియన్న పలుకులపుడు, పరమసత్యమ్ములౌటమాకరయ నయ్యె.

—※ దక్షుఁడు వీరుని స్తుతించుట ※—

ఆ॥వె॥ వీరభద్రపాదవికటతాండవమున, మదము వాసి సత్త్వమహితుఁడగుచు
మొగుపుకేలు ఫాలమున గదియించుచు, దక్షుఁ డనియె భక్తరక్షకునకు. 132

కం॥ పొడమిన దురహంకార, మ్మడఁగెను నీపాదకమల మంటిన కతనన్
జెడెఁ బాపపటలి మాకిఁక, నిడఁగదె నీచరణసేవనే సతతమ్మున్. 133

కం॥ జ్ఞానలవదుర్విదగ్ధుఁడ, నీనిర్మలరూపమెఱుఁగనేరక పెక్కుల్
కానివి పరుసము లాడితి, వానిని క్షమియింపఁగదవె వాత్సల్యమునన్, 134

కం॥ అను నెడ నేమను నాతని, వెనుక నెసాఁగిలుచు మ్రొక్కి వీరుని భక్తిన్
వినుతించితి మిక్కృపాబ్ధీ. యనుగ్రహింపవె మహాత్మ! యజ్ఞుల ననుచున్. 135

శా॥ యజ్ఞార్థమ్మయి పిల్వ వచ్చి క్రతురక్షార్థమ్ముగా బోరి మా
యజ్ఞానమ్ము ఫలమ్ము గంటి మిటు దేవా! పెర్మి పెంపార, మా
యాజ్ఞాబద్ధుల బద్ధులన్ హతుల నిర్వ్యత్ప్రాణులం బ్రోచి మా
విజ్ఞప్తిం గరుణింపఁగాగదె కృపాబ్ధీ వీరభద్రేశ్వరా. 136

శా॥ ఇంతింతంచు వచింపరానివి మహాహేయమ్ము లెన్నేనియున్
మంతుల్ మే మొనరించినారము మము న్మన్నింపఁగా రాదా, నీ
చెంతం జేరితి మన్నిటం దొలఁచి రక్షింపంగఁ బ్రార్థింతు మ
శ్రాంతమ్మున్ శ్రితపాళి పాలనవినిద్రా! భద్రకాళీశ్వరా. 137

కం॥ శ్రుతివేద్యుఁడయిన నిన్నున్, స్తుతివేద్యునిఁగా దలంచి స్తుతియించెడి మా
మతిమాంద్యము డిపిపోవ్రము, శ్రితరక్షాదీక్ష! భద్ర శిక్షితదక్షా. 138

కం॥ అనుచుం బెక్కువిధమ్ముల, వినుతించిన నల్లనగుచు వీరుఁ డనియెన్
జననీపరాభవమ్మును, గని సైఁచిన దోషమింతగా ఫలియించెన్. 139

కం॥ మీరాకోర్కులు సిద్ధింపఁగ నా కాంచీవిభుపగోలువుఁడమ్ము సుహాత్మల్
రాకేందుకలాశేఖరుఁ. డేకామ్రాధీశుఁడిమ్ము నిష్టము లెల్లన్. 140

కం॥ అనిపరివారముఁగాలితము, వెనుకొనననంతర్ధిఁ జెందె వీరుం డేముక్
జనికాంచికిఁగామాక్షీ, మనోధినాథువిభజించి మంటిమిపిదపన్ 141

కం॥ ఇదివీరభద్రవిజయము, చదివినసనుకూర్పునెపుడు సకలార్థమ్ముల్
మదిభద్రఁగొలుచు వారల, కుదయింపవయూతిబాధ లొండొకఁడైనన్. 142

వ॥ అని యా లక్ష్మీశ్వరుండు పలుకుటయు. 143

ఉ॥ డాచినకెంపుసొంపుల బెడంగుమెఱుంగుపసిండి కంకణాల్
చాచనిచేతికిందొడి, కెలంకులనిల్చి విశాఖపట్టణ
మ్మూచినయట్లుగానట మహోత్సవముంబొనరించినట్టి దు
గ్గాచిననూకయుంగరుణఁ గాచిన దేవరచేఁ గవీంద్రచే. 144

కం॥ భ్రమరాంబాహృత్కమల, భ్రమరగణార్చ్యచరిత్ర, పరమతపశ్శ్రీ
శమదమధనమునివరవీ, రమల్లయారాధ్యపుత్రి రత్నము చేతన్. 145

బంభరగానము॥ పరమశివకథా పరతంత్రిని చే
దురితహరణ, మే దురవీక్షణు చే
స్మరహరపదపూ జనతత్పరు చే
సరళహృదయుభా స్వరవర్తను చే. 146

మ॥ స్థిరవాత్సల్యవిభూషితుండు ప్రతిభాశ్రీతోషి తాచార్యుఁడీ
శ్వరపాదప్రవణుండునగ్రిజు దయనవ్వర్ధిల్లు, కాంచీపు, రీ
శ్వరమాహాత్మ్యమునందు నైదవదియాశ్వాసమ్ము దీనిన్మహే
శ్వరుఁడీక్షించుతిఁబుమ్ప వన్నయనసౌభాగ్యమ్ము దీపింపగా. 147





# కాంచీఖండము.

## షష్ఠాశ్వాసము 152 పద్యములు.



క॥ శ్రీదయితునిచేఁగరుణా, యాదోవిధిమల్లికార్జునారాధ్యునిచే
నాదిమకవీంద్రకవితా, స్వాదుమహాకావ్యసర్గచతురాస్యునిచే. 1

క॥ శ్రీమన్నారాయణుచే, నామునులా గాథవినుచునలరిమహాత్మా
యేమమ్మోహముఁడుదనసతి, యామెయుదేహమ్ము విడువనని తెల్పెఁగదే. 2

—❋ శివుండు దక్షిణామూర్తియగుట ❋—

వ॥ అని ప్రార్థించుటయు నా మంగళదేవత, తన వల్లభుం గనుంగొని, యనఘాయయ్యాదిమ దంపతుల చరిత్రమ్ములత్యద్భుతమ్ములు ఇప్పటి యిమ్మునుల ప్రశ్నమ్ము మదీయ చిత్తమ్మున నాటియున్నదని మున్నుఁగనియు వినియుండనివి తీరదటుగావునఁదేటపడ వచియింప వేడెదన నఁవుడు నట్లయగుఁ గాకయని యమ్మురారి సాదరమ్ముగా వారల నవలోకించి. 3

ఆ॥వె॥ అయుతసిద్ధమైనయయ్యాదిమిథునమ్ము, నొకరినొకరువిడుచుటొకటికలదె
కాఱుమొగిలుమాటుకనినఁబ్రొద్దువెలుంగు, కలుగకున్నకనులుగానకున్న. 4

క॥ రవిచుట్టుఁగాలిఁదిరుగుచు, వివిధగ్రహమండలములు వివిధాకృతులన్
వివిధఫలమ్ములనిడునటు, శివునిమహత్త్వముల నెఱుక సేయఁగవశమే, 5

తే॥ పరమవాగర్థదివ్యసంబంధమెఱుక, మాలియొకచోటఁబండితమానియొకఁడు
కలదులేదనుమాత్రనెకలుగకున్న, నిత్యవాగర్థభవ్యదాంపత్యమొందు. 6

తే॥ అట్టిసంబంధమెఱిఁగినయట్టివాఁడు, వాఙ్మనోఽతీతుఁడగుపరబ్రహ్మశివుని
యందువాగాదులర్పించిచతుర్థసిద్ధి. నందునచ్చోటవసియించునిందుమౌళి. 7

కం॥ ఆదిమదంపతులవిహా, రాదులువాగర్థచిత్రితార్థములట్టుల్
మోదప్రదములుదురితవి, ఛేదకములుబహుళపుణ్యవిజ్ఞేయమ్ముల్. 8

ఆ॥వె॥ అవియునెఱిఁగియిట్టులనుటకెంతటివార, మయిననభవుకరుణననఘులార
యెఱుకగలిఁగినంతయెరిగింతువినుఁడని, శివునిదలఁచిమ్రొక్కిసిరిమగండు. 9

ఉ॥ అమ్మయిదేహమున్విడిచియాజగదంబజనించెగ్రిమ్మఱన్
నెమ్మనమెల్లఁజల్లనయి నిర్మలవృత్తిమహోన్నతిప్రభల్
చిమ్మహిమాలయమ్మ, సతిచేసినతీరనితోంటిపెక్కు పు
న్నెమ్ములవంటయైత్రిభువనీకమనీయతనూమనోజ్ఞయై. 10

ఉ॥ అప్పరమేశ్వరుండుసతి యాగమునం దనువుంద్యజించునా
ముప్పునెఱింగితానటకు మున్నమహత్తర యోగసంపదన్
జొప్పడియుండనయ్యనఘు సూరెలఁజేరుచు మౌనముద్రచే
నొప్పెడునీశుఁగొల్చిరి మహోజ్జ్వలయోగ విరాజితుల్మనుల్. 11

కం॥ వటమూలవాసియగుచును, స్ఫటికప్రభలీనువానిఁ బరమజ్ఞాన
స్ఫుటమూర్తిముక్తిలలనా, నటనస్థలదీక్షుదక్షిణామూర్తిశివున్. 12

శా॥ మౌనవ్యాఖ్యలనెల్ల సంశయములన్మాయించి తత్త్వమ్మనా
మౌనిశ్రేష్ఠులబోధసేయు నభవున్మౌళిస్ఫురన్మల్లికా

సూనేందుస్స్పృహణీయ పల్లవజటాశోభాభిరాముస్సనన్
జ్ఞానార్థుల్ మునిపుంగవుల్ చనిరటన్ దండోపతండమ్ములన్. 13

శా॥ ఆః శ్రీగురుమూర్తిమానసులకుం దానాకేతిగా మోక్ష, భి
క్షాదానమ్మును జేయుచోం దలంచెనిచ్ఛన్వారి చిత్తమ్ములన్
బ్రాహ్మణ్యాతము తత్క్షమెంతవరకంబడించి రోయుంచునా
లోదుర్భేత్తు మహోగ్ర భూషణరుచుల్ దోచెం దదీయాకృతిన్. 14

కం॥ తాళికయదిగననమ్మని, పాలియుట న్వాఱచిపఱచె, బ్రమసె, సాగసె, బే
తాళుండెవ్వండోయనువగ, హేలావికృతాంగునమ్మహేశ్వరుంగనుచున్. 15

శా॥ సంధ్యారంభకఠోర పశ్చిమదిశాజాగ్రన్మహాకాల సం
బంధ్యోగ్రగ్రకృపాణ రేఖలయి కన్పట్టెన్ శిరశ్చంద్రికల్
వింధ్యప్రాంశుఫణీంద్ర భీషణఫణావిస్ఫూర్తతహాలాచ్ఛటా
వంధ్యప్రక్రియమై తమమ్ము గలిసెన్వారిన్మహాఘోరమై. 16

గీ॥ వామదేవుండు మున్నగువరమమునులు, ప్రస్తుతింపంగఁగరుణనవ్వారిఁబ్రోచి
వారికోరికమన్నించి భవుండు పేర్మి, నాదిబేతాళరూపమ్ము నపహరించి, 17

—※ శివుడు హిమగిరి కేగుట ※—

కం॥ ఎప్పటిముని వేసమ్మున, నప్పొలమున్వీడ చియేఁగె హరుఁడటచలువల్
గుప్పెడుతొలి తెలిగట్టుం, దిప్పలకుందపము సేయుఁ దిరుగనిమదితో. 18

వ॥ అప్పుడా దేవతాత్ముండగు నన్నగసార్వభౌముండు జంగమరూపమ్మవధరించి, సముచిత విన్నతిగా నమ్మహాభాగు నెదుర్కొని. 19

స్వాగతము:- స్వాగతమ్మొసఁగి చంద్రముఖకలా
భోగిభోగమణి ముగ్ధమూర్తికిన్

రాగిల్లెయలవి రాగి కొసంగెన్
స్వాగతప్రసవ బంధురాంజలుల్. 20

చం॥ ఒసఁగుచు స్వాగతమ్మును, నిజోన్నతికిం దగు నట్లు గాఁగఁ దా
పసమ్మృదు వేషసుందరుఁ గృపాపరుఁ గొల్చుచు నప్పరాత్పరున్
గిసలయరత్నపూర్ణముగ కేలుగవన్మొగియించి పల్కెన
య్యసమవిలోకనాగమ సమాదృతిఁ దాన సమానభక్తిమై. 21

కం॥ ఈశ! మహేశ్వర! గిరీశ! గిరీశా! యిటనన్ను నొక గిరీశునిఁ జేయన్
పేశలవిశేషకరుణా, వేశవశంవదుఁడవగుచు విచ్చేసితి వే. 22

కం। ఎందఱు నిజవంశోన్నతు, లెందఱు గోత్రప్రసిద్ధులెందఱు మహీభృ
చ్చందిరులున్నారిల న, య్యందఱను ధన్యుఁ జేయ నరుదెంచితి వే. 23

కం। పనియేమిగలిగెనదినను, బనిగొమ్మాయనుచు వినయ భరితుండై, న
మ్మనమలరఁ బలుకు నతనిం గనుఁగొని యెలనవ్వు వెలయఁ గఱకంఠుఁడనున్. 24

చం। తగునగసార్వభౌమ యతిధన్యుఁడ వీవు మహీభృదాళిలో
నఁ గలదె నీవిశుద్ధి యొకనాటఁ దరుంగని దేనెఱుంగనే
యగణితలీలనీదు కట కాళి జనించిన సింధుకన్యకల్
మిగుల జగమ్ముఁ బ్రోచి మది మెచ్చొనరింతురు మాకు నెప్పుడున్. 25

గీ॥ అనఘ రారాజవైన నీ యాశ్రయమునఁ గొన్ని నాళ్లు వసించి యేఁ గొన్నతపము
ప్రతము చెల్లించుపూనిక వచ్చినాఁడ. నన మహాప్రసాదమ్ము నియ్యానగమ్మ. 26

శా॥ రారాజంచొక గొప్ప సేసితివి నీ రాకం బునీతమ్మవై
మా రాశుల్ దొడి వెన్ హిమాలయమునన్ మారేళ్లు నీ యేలులున్

నీరాగప్రతిబింబ మూర్తులగుచున్నిన్నుండెనో స్వామినీ
కారుణ్యమ్మనఁగానిదిం గలదెయీగట్టుల్ చిగుర్పొట్టఁగ. 27

శా॥ నాసర్వస్వమ్ము నీయధీనమగుటన్వాకుత్రివ్వఁగా నేలనీ
కోసర్వజ్ఞయథేచ్ఛగా మెలఁగినీయుద్యోగ సిద్ధిన్మదా
వాసమ్మంమగణించి, భూభృతులనాభాగ్యమ్ము దీపింపఁగా
నీసేవన్ సతతమ్ము నాకొసఁగిమన్నింపంగ నర్థించెదన్. 28

కం॥ కావనకనాకుమారిక, నీదుతపశ్చర్య వేళ నినుగొల్చెదునా
మోదమునను గ్రహింపఁగ, దే, దేవయనంగ దేవదేవుఁడనగుచున్. 29

కం॥ మునులనుకుమారుపవనితా, జనసేవలకెంతవప్పుసన్మతినీ, వి
ట్లనఁ గాదనఁదగదటుగా, వున నీసుతసేవమాకు బోలునటంచున్. 30

మ॥ అతనిన్వీడ్కొని రమ్యనిర్ఘరదరీద్వార ప్రియాభాగమా
న్వితమానొక్కకెలంకు నన్విడిసి,నందింబిల్చి యీనాతప
స్థితివేళన్ మనయాశ్రమమ్మపాలమున్, జేరంగ రానీక వే
చితగంజూడుమయేరి నన్నటుశాసించెం గణవ్రాతమున్. 31

వ॥ అట్లుశాసించి యాపరిమథ ప్రథముండు. 32

కం॥ తానొకథర్మవేత్రము, పూనియటన్నిలిచెనంతఁ బురహారసేవా
ధీనమనోంబుజయగుచుహి, మానీగిరితనయభక్తి మఘురాకృతియై. 33

కం॥ చనుదేరభృంగిదాత్మా, యణివచ్చినచందమైన, నచ్చెరువడియెన్
గనుదములానందాశ్రుల, మునుకలుగొనఁగనియుఁగనఁడపో చండియటన్. 34

శా॥ ఆలీలన్ జనుపార్వతింగనుచు, భక్త్యావిష్టమౌ చిత్తమున్
ఫాలమ్మంటినమోడ్పుఁ గేలునయికన్పట్టెన్ శిలాదార్భకుం

జాలోనన్ దెలివొందె, లోనెఱిఁగె నయ్యాహార్య పుత్రిన్ శివా
ర్చాలోలన్, గురుపూజనాహృతమహార్ఘద్రవ్య భవ్యాకృతిన్. 35

మ॥ ఒకరుం గాదననేరరా ప్రమథులందున్నారొ, లేరో, తపో
ధికు లెల్లం బరమేశు శాసనము ప్రీతిం దారు మన్నింపరో
ఒకయింతేని యెఱుంగునో యెఱుఁగదో యున్నట్టి యవ్వారినా
సుకుమారాంగియుఁ జేరె నీశ్వరుతపస్సిద్ధాంత భూమిన్వడిన్. 36

మ॥ మనదివ్యత్వము పొల్లుసేసె నెవరీ మాన్యాత్మ యం చెంచి నం
దినిఁ జేరం జని రమ్మహాప్రమథులాదివ్యాత్ముఁడా బాలికన్
దనరన్ శంకరసన్నిధిన్నిలిపి యంతన్ శర్వునాజ్ఞావిధిన్
జనుదెంచెన్వినిపించె నా ప్రమథులన్ సర్వమ్ము, తెల్లమ్ముగా. 37

మ॥ ఒకయింతేనియలంతగానక యెపుడా యుగ్రుం దగం గొల్చుచున్
సకలమ్ముం ఘటియించుచున్ సమయపూజాకృత్యముల్ శంభునా
త్మకు రానేర్చిన గేంద్రపుత్రి, యతఁడున్మన్నించి తత్సేవలన్
బ్రకటమ్మైన మహోగ్ర యోగమహిమం బాటించె దివ్యాబ్దముల్. 38

—※ మదనుడు శివుని కడకువచ్చుట ※—

వ॥ ఆసమయమ్మున శూరపద్ముండు, సింహవక్త్రుండు తారకుండను రక్కసులటమున్న మహే
శ్వరు కృపం బెట్టిదమ్ములగు వరమ్ములం బడసి, మత్తిల్లి నిఖిలసురలం బరిభవించి పనిగొని
వినుఁ డీసుదర్శనమ్ము టఁబిన్నటివాఁడగు తారకుకంఠమ్మున, నొక్కతారహారమయ్యె నవిన
వారిమహిమ మ్మిట్టిదట్టిదననేల? దక్షయాగమ్మున శివవిద్రోహమొనరించిన దురితమ్మట్ల
ప్రతికార్యమ్మగుటయుఁ బరమేశ్వరు తేజోవిశేషమ్ము దక్కనొండొక్కఁ డమ్మేటి
మగలనొంపజాలమి నిశ్చయించి, యేమంతఁ గుమారోదయమ్ము నభిలషించి, మదనుం,
బురమథనుండు పార్వతిం బరిగ్రహించునట్టి తెరంగు సంఘటింప నియోగించుటయు
నక్కుమారుండు. 39

ఉ॥ కాదనరానిమా పనుపుఁ గైకొని వల్లభయుందియిచ్చుపూఁ
గైదువులందిలేఁజివురుఁ గత్తళమందొడి, కంటి, విల్లు, చే
నూదుచుఁ బూవుతేనియల నొప్పెడిపుష్పొడి వీరచందన
మ్మార్ధృతిఁ బూసిదివ్య దవళాబ్జకిరీటము తీర్చి దిద్దుచున్. 40

ఉ॥ ఆరతిచూపు కేతువునొయారము హాసము చంద్రిహాస శృం
గారము, నూర్పు తేరు నొడికారము కీరము వారువమ్ముగా
సారథియై వసంతుఁడట సన్నిధిఁ జేరఁగ నెక్కె-వీర శృం
గారరసోజ్జ్వలాకృతి, వికాసవిలాసవిశేష మూర్తియై. 41

వ॥ వెడలి యమ్మకరధ్వజుండు. 42

మ॥ చనుదెంచెన్ హిమవత్ప్రదేశమునకున్ జ్యాభృంగ ఝుంకారముల్
వినవయ్యెం గలకంఠదర్పక భటక్ష్వేళారవమ్ముల్ గడున్
మీనుముట్టెన్, హారకర్ణభూషణము నుస్నిగ్ధాంబు జమ్మొంతె, న
ల్లన వాలెన్ గిరిజా, మనోహరశిరోలంకార రమ్యాకృతిన్. 43

కం॥ నుడిబడెనరదము తేజులు, మెడలొగ్గెను బుడమిబడియె మీనుసిడము న
య్యెడఁ జేరు నెడలగొనయము, విడివడెఁ జెలికాఁడు నొగల విహ్వలుఁ డయ్యెన్. 44

కం॥ నిట్టనిడుచూపు లొలయఁగఁ, గట్టెదురం గాంచెనపుడు కందర్పుఁడు దాఁ
గట్టలుక వేడిచూపుల, నొట్టినమంటలను జిమ్ము నుగ్రునినందిన్. 45

ఉ॥ కాంచిరథమ్ము డిగ్గి, భయకంపితహస్తములెల్ల మోడ్చి, న
ప్పంచశరుం "బురే" యెఱుగవా! యిటనుగ్రు తపమ్ము నేయుచో
ప్పించుక యేని, యీ వనము నింతతొలంగదు నాదు నాజ్ఞ, నీ
పంచమనిస్స్వనమ్ము వినవచ్చెనె పుణ్య తపోవనమ్ములన్. 46

కం॥ అటుతలఁగుతలఁగుమెప్పటి, కిటరాకురయంచదల్ప నెఱిఁగియతనికో
ఘటనాఘటనఘురీణా, యిటనొకవిన్నపము సురలకెల్లనుహితమై. 47

చం॥ కలదదివిన్నవింతు నవుగాదన కర్మిలిఁ జిత్తగింపుమీ
నలిపిన శాసనమ్ము శిరసావహియించెదమమ్ము బోంట్లపై
నలుగఁగ నేల మీకు మలుక కాఁగెడి పాటిదె యీజగమ్ములీ
తెలియనితప్పుఁ బేర్మిఁగడ తేర్పుమనంగఁ బ్రసన్నచిత్తుఁడై. 48

కం॥ వినుపింపుమనిన మీ తెలి, యనియు నీయే యుముయునవినుమనవధానమునన్
వినుడనుచు విన్నవించుచు, మునుముట్టఁగ నెల్లవృత్తమును నాతనికిన్. 49

ఉ॥ తారకదారకుండయిన దారకుఁడొక్కరు నీశ్వరాంశ వి
స్తారకు సర్వదైవతవిషాదవిషాగ్రిగభీర వార్ధి,ని
స్తారకుఁగాంచ,నీవరిగిఁ శంకరునింగిరిజాకర గ్రహ
శ్రీరమణీయుఁ జేయుమని చేయుచు వేల్పులు నాకుఁగట్టకన్. 50

కం॥ మారా!యిదినీకుతగునె, వారిజగర్భుండు మాటువలుకకుము నె జం
భారి,హరిపోయిరమ్మను. గారవముఁదెలుపు.నగవు కన్నులనసిచెన్. 51

ఉ॥ ఇంతకుఁబూనివచ్చితి మహేశ్వరుకంటికి నగ్గమౌదునో
వంతముదీర్చిలోకముల ప్రస్తుతిగాంతునొ, రెంటనెద్ది యే
సంతసమేయటన్న నెఱసాహసమూని శిలాదపుత్త్రి,నీ
వింతరొయిటింగినన్నును మీ,సురకార్యము చక్కఁజేయఁగా. 52

చం॥ అనవిని రోయి!నీయనిన యంతయునిక్కము, యెట్లునిన్ను నే
జనుమనకుండు మంచుఁ బురశాసను శాసన మెట్లు దాటఁగా

ననువగువంచుఁగొంత తడవారసియారసి లోనికేఁగఁగా
ననుమతిఁజేసెనంతట శిలాదకుమారుఁడు శ్రీకుమారునిన్. 53

చం॥ అనుమతిలోనఁ దెవ్వతిలి యల్లవసంతుఁడు తేరు దేరఁగాఁ
గొనుచు ననుజ్ఞనందికి నకుంఠితభక్తిఁ బ్రదక్షిణమ్ముగా
దనయరదమ్ముఁ ద్రిప్పి సముదారఝషధ్వజ కింకిణీధ్వనుల్
మనమునిగుర్చునాహరిత మంజుళహేషలు మిత్రభాషలున్. 54

చం॥ వినుచుఁ దపోవనమ్ము పదవింజనుదేర, లతాకుమారికల్
తనతనలోననిండనుక దాచునిసర్గవిలాస సంపదల్
మునుకలువెట్ట వెల్వడిన మోదము సిగ్గసి యాడు మేనులన్
ననిచినయట్లు పాయన మొనర్చను వానికిఁ బుష్పపత్రముల్. 55

చం॥ చనిచని యల్లనల్ల శివు నాశ్రమవాటికఁ దేరుడిగ్గి, య
మ్మనసిజుఁ డొక్క పూపొద మాటున కేగుచుఁ బొంచి చూచె, శం
భుని, నసమానయోగ పరమున్, గిరిజాతఁ దదీయసన్నిధిన్
గనియెఁ బ్రఫుల్ల పుష్పమృదుకల్పితదామని బద్ధమానసన్. 56

కం॥ వేచియతఁ డవసరమ్మును, చూచినకను వింటఁ దొడిగెఁ బురహరధైర్యో
న్మోచకమును, మధుధారా, సేచనమరుణాబ్జమెల్ల సెఱలునొఱంగన్. 57

మ॥ విరతమ్మైన మనస్సమాధి వశత న్విస్ఫార నేత్రమ్ములన్
దరుణాబ్జస్ఫుర ముత్తమాంగుఁడుగనన్ గౌరీ, సుకేశాంబర
స్థిరసంధ్యారుణసుందరమ్ము, మధువీచీపూర సమ్మోహన
మ్మరుణాబ్జమ్ము మనోంబరమ్మున సముద్యద్రాగముల్గూర్చఁగా. 58

ఉ॥ ఆగిరిరాజుబిడ్డకరమల్లనయెత్తి యథాపురాకృతిన్
భోగివిభూషణోజ్జ్వలసమున్నత మంగళకంఠపీఠమున్
దాఁగయిసేయునంబుజసుదామయుదామము నంతలోనఁ ద
ద్రాగితరంగితాన నవిధమ్మగనుంగొనినిల్చె సిగ్గునన్. 59

కం॥ ఇదెపోయదనని మదనుఁడు, కదనమునకుఁగాలుదువ్వి కనదస్త్రము వే
గఁదిగిచి తెగవాపిన య్యయ్యదనునఁజవురించె స్థాణులచటియవర్ణల్. 60

భుజంగప్రయాతం॥ చలత్పుష్పమాలా స్మరన్మంజుధారా
వళీవిభ్రమమ్మల్ ప్రవర్తిల్ల వల్లీ
విలాసమ్మలేచన్ విలోకించెబాలన్
విలాసోజ్జ్వలుండై విభుడంతలోనన్. 61

శా॥ ఆకర్షించెనుస్వామిచిత్తమును దానానమ్రబాలాతనూ
శ్రీకాంతిస్ఫురణమ్ము చూపులుచిగిర్చెన్ నవ్యనవ్యమ్మలై
రేకెత్తెన్ గిరిజాహృదంతరమునన్ బ్రేమార్ద్రభావమ్మలా
లోకాదిప్రియదంపతుల్ నిలిచిరాలోఁ జిత్రరూపమ్మలన్. 62

మ॥ హరుచిత్తమ్మనవోచెనంత నవుడా శ్యామాదరస్మేరమం
దరరూపమ్మయి విశ్వవిశ్వము తదుద్యద్రాగవీచీవళీ
భరితమ్మై యువదాతనీలకబరీవర్యాప్తమై సంచలత్
కరపుష్పప్రగుదారమై వదనచంద్రజ్యోత్స్నకారామమై. 63

మ॥ పృథువక్షస్థలతారహార సుషమారింఛోళివీచీదృతిన్
శిథిలీభూత తపస్సమాధియగు నాశ్రీకంఠురూపమ్మ మ

న్మథకోటిప్రతిభాసమానము జగన్మాంగళ్యమాంగళ్యము౯
విధుబింబాననఁ జూచె విశ్వజగము న్విభ్రాంతచిత్తమ్మున౯. 64

కం॥ శివుఁడంత దెలిసె నిజకర్ణవతంసము గౌరిశిరమున నగ్గలుగుట దా
నువివేకించెను గారణ, మువిశదమును గాఁగఁ జిత్తమును వెనుదిగిచె౯. 65

చం॥ తివుచుచుఁ జాచెఁ గస్త్రైమర దియ్యనివిల్వ్లలకేల దావట౯
దివుచుచుఁ బుష్పబాణముల తీవ్రరుఁజిమ్మెదు పుష్పబాణుని౯
భవభవపాహిపాహియని వల్కె ననభమ్మున దేవసంఘముల్
శివశివయంచు నాహరుని జేరిరి నందియు భృంగిచండియు౯. 66

కం॥ వినెనో వినఁడో వారల, యనునయముల శైలతనయ యటుచూడఁగ నా
మినుసిగ దేవర మూఁడవ. కను దెఱచుచునంతలోనఁ గన్పడఁడయ్యె౯. 67

కం॥ చేరుచుఁ గనుఁగొని రటుచు. మ్మాకునిభస్మావశిష్ట మఘరాకృతి, న
ప్పారి మదులేమి చెప్పుదు, గౌరియు బలుమూర్ఛ మునిఁగెఁ గనుఁగొనియంత౯. 68

చం॥ హిమగిరి వచ్చి కూఁతుఁదన యింటికి నింగొనిపోయె నారతి
ప్రమదవిలాపముల్వొనుచు రాలు,నగమ్ములు వేడివేడి బా
ష్పములఁ స్రవించె ధారలుగ, బక్షికులమ్ము నిరుద్ధకంఠమై
భ్రమసె హిమాలయమ్ము హిమవారిమిషమ్మున వీడె నశ్రువుల్. 69

కం॥ పతిసహగమనోత్సుకరతి, మతికట వినిపించె నొక్క మధురస్వరమో
సతి సాహసమును విడుమీ, పతిఁగూడెదవనుచుఁ గర్ణపర్వము గాఁగ౯. 70

మ॥ వినిపింపన్ రతి తేరిచూచె నెదురన్వచ్చెసె నల్లల్లన౯
తన తేరుజ్జ్వలమీనకేతనవినూత్నప్రాభవమ్మై, వసం

తునిమోముం దెలివొంది కన్పడెనటన్ దుక్ఖార కంఠమ్మునన్
వినిపించెన్ సహజాత కోమలమధుస్నిగ్ధప్రియాలాపముల్. 71

కం॥ చల్లనితుషారకిరణము, లుల్లసిలన్మిగులవెలిఁగె నోషధిపతియున్
వల్లభునివార్త దెలిపెను, మొల్లమునన్నీలకంఠములు నటియించెన్. 72

— ※ పార్వతి తపమ్ము సేయుట ※ —

వ॥ అంత నప్పార్వతియు నల్లనఁగన్నులువిచ్చి. 73

చం॥ అదరెడు వామనేత్రమున నాసతిచూచె నవారవిందమున్
జెదరిన కేశపాశమునఁ జెన్నగుమోమునఁ దండ్రిఁ జేరి, నా
హృదయము గాసివెట్టు పరమేశ్వరు నెమ్మెయి నైనఁ గొల్చి. యీ
చెదరినచిత్తమున్ దృఢము సేసెదనన్ను ననుగ్రహింపవే. 74

కం॥ అని వేడనీకుఁ దపమా, ననుఁగాంచినతల్లి! వలదనన్ జనకుఁడా
వెనుదిరుగనినిశ్చయమునఁ, జనవుననొప్పించి. జయవిజయ, యనెడి చెలుల్. 75

కం॥ తనతల్లిపనుప వెనువెం, టనెరాఁగ నుమాకుమారి నవ్యతపోవే
షనితాంతమధురభావ, మ్మున వెడలి. వసించి యొక తపోవనభూమిన్. 76

మ॥ ఒనరించెం గిరిపుత్రి యేకపదియై, యుర్వీరథుం బేర్మిఁ గై
కొనకొన్నేండ్లు తపమ్ము మూలఫలముల్ గూరాకులున్ గ్రొంచు, ధా
త్రినితాంతోద్ధతిఁ బట్టఁ జాలక ధరిత్రీభృత్కులమ్మెల్ల, న
ల్లనదూగాడుచు నిల్చె నాసతియలోలశ్రీ తపోనిష్ఠలన్. 77

మ॥ వనమధ్యమ్మున నిల్చె చేసెతపమున్ వారాశి తూణీరుఁ జే
కొనఁగొన్నేండులు జీవనమ్మె కొనుచుం గోత్రాళి చిత్రమ్మురె

ల్లనుసీ హైరెసెలయేఋషులై, కరంగ బాలాదివ్య సంభావనా
వనపుణ్యమ్మునఁ జేసినిల్చె భువనప్రాకార రూపమ్మునన్. 78

మ॥ కనకగాత్రినలపంచ కాంతరమునన్గావించె నయ్యగ్ని నే
తురినిమెప్పింపఁదపమ్ము కొన్నిసమముల్ రోచిః కణాహారయై
తనువుల్ ఘోరవిషాగ్నులన్ దరికొనన్ ధాత్రీధర శ్రేణి ని
ల్చెను శైలేంద్రసుతా మహోజ్జ్వల తపశ్శ్రీభాగ్య సంపత్తులన్. 79

మ॥ అనిలాహారవిభూషణుండరియఁగా నాబాలకావించెఁ దా
ననిలాహారతఁగొన్ని యేండ్ల తపమత్యాహార్యముల్ దాము, వె
చ్చనిః ట్టూర్పులు సందడింపఁబొలిచెన్ శ్వాసానిలకూర్ర, ద
ర్శన దర్వీకరదష్టగర్భగుహలై సాధ్వీతపశ్శక్తిచే. 80

మ॥ ఒనరించెన్ సతి యంబరాంబరునినా ద్యోవీధికాకేశునిన్
దనియింపం బ్రణవార్థలీనమతియై త్యక్తాఖిలాహారయై
ఘననిష్ఠంగొనిగొన్ని యేండ్లతపమున్ ఘోరమ్ముగా ఋత్తుకాలమెల్ల, బో
రనమాఘ్రోర్మియు మనిల్చె నిశ్చలశివధ్యానైక చిత్తమ్మునన్. 81

మ॥ ప్రణవోదారశరీరుఁడై గురుతపఃప్రాగ్భార నిర్మగ్నుఁడై
యణురూపమ్ములకెల్లఁదాన యణువై, యాత్మాశ్రితత్రాణ, కం
కణనూ త్రాయితభోగియై వెలుగునా కాంతుం గనెంగాంత, త
త్ప్రణవమ్మందు వెలింగె నా సుదతియుం బ్రద్యోత మానాకృతిన్. 82

మ॥ కనియెం దాఁ జటునవ్వుడాలునెఱయన్ గౌరీ మహాదేవి నా
ప్రణవాకారములోన శంకరుఁడు, నేవత్తున్ సతీ! చాలు తె
మ్మనుమాటల్విననయ్యెఁ బార్వతి కనంతాకాశమధ్యమ్మునన్
జనదెంచెన్ మలయానిలమ్ము, సుఖమై, సౌరభ్య సంపాదియై, 83

కం॥ కనుమూసియున్న హరునిం, గనుఁగొనునాప్రమథవరులు కలఁతపడఁగఁ దే
రునుధనువుందూణీరము, తనతనయంతట నెసిల్చి తబ్బిబ్బుపడన్. 84

కం॥ చిఱునగవు మెఱయుకన్నులఁ, దెఱచుచు నటుచూచి దేవదేవుఁడు మీరల్
వెఱవకుఁడని వెఱవుడుపుచుఁ జఱచఱన చ్చోటు విడిచె సంరంభమునన్. 85

— ※ శివుఁడు పార్వతింబరీక్షించుట ※ —

గీ॥ ఆహిమాచలపుత్రికయాత్మ తపము. పుణ్యఫలమును దలపోసిపోసియంతఁ
దనదు నెచ్చెలితోడ మంతనము సేయు. నవసరమ్మున నొక్కమాయావటుండు. 86

కం॥ అటుదవ్వులఁ దనయాశ్రిమ, తటభూమిం గానిపింపఁ దడవుగఁ బనిచెన్
బటుభక్తిఁదోడి తెమ్మని. వటునిం బూజింపమనకు వలెనని విజయన్. 87

కం॥ అటుసేరవచ్చి, కొనియు, వ్వటుఁడు స్ఫుటభక్తినొసఁగు పరమాతిథ్య
మ్మలుసలుచూచుమ. నేవకీ. కుటిలాలక యేలతపము కోరియొనర్చెన్. 88

ఆ॥ వె॥ గట్టుపట్టియనుచుఁ గాన్పించుమామది, నిట్టికోమలికము నెందుఁజూడ
మవుర కన్నవార లావంతతలఁపరా, తపము వేడ చిఱుతతనము వేడ. 89

ఆ॥ వె॥ ఎంతతపము సేసికేని యెవ్వరుగూడ, గాంచఁజాలరట్టి కోర్కెయీమె
ఎవనిగోరిదాన యీరీతిఁదపియించు, నకటయట్టికతనుఁడౌకఁడుగలఁడె. 90

వ॥ అని సవితర్కముగా నొక్కింత యాఁగి విజయం జూచుచు. 91

కం॥ వటుచపలతఁ బలుకుటిది గుటిలుఁడగా నేనువినఁగ గూడునయేనిన్
స్ఫుటముగ వినఁపింపుమునీ, చటునూక్తులు మాని మీదు సఖవృత్తమ్మున్. 92

కం॥ అనవిజయ దేవియానతి, గొనియిట్లని నోయివిప్రకులభూషణ, నీ
మనమునఁ దలఁచినయట్లునీ, వనినదినిజముగుచు మాకు వక్కాణమయ్యెన్. 93

గీ॥ ఈమహాగిరిరాజబిడ్డ మహేశుఁగోరి. పరమతప మొనరించు నెవ్వరికిఁ దెలియ
దకట సర్వజ్ఞభావమ్ము ప్రకటపరచి, యర్హణీయుఁడవైన నిం దైతిమాకు. 94

గీ॥ కఠినుఁడంచునునొకపల్కు కటువుగాఁగఁ, బలికితిఁకమీఁదనిటులాడవలదునీకు
నిచ్చవచ్చినయన్నాళ్లనిచటనుండి, మానసపర్యలఁగొనుము నెమ్మనముదాక. 95

గీ॥ అనినకోపమువచ్చినయటులచూచి, మొగముచిట్లించియటనుండిపోవఁదలచు
నట్టిచందము కాపియాతఁగఁబలుక, రించుతలఁపుననుడిసవరించుకొనుచు. 96

కం॥ ఈయమ్మపిలువవచ్చితి, మీయొసఁగినపూజమాకు మెచ్చొనరించెన్
మీయితివృత్తము తెలియఁగఁ బోయినపోకడలుమఱచి పొందికమీఁదన్. 97

కం॥ మాయాశ్రమసీమలుగఱ, వాయెనొకాపురములుండ నరుదెంచితినే
మీ! యేమన్ననునందురు, పోయెదనొకమాటచెప్పి పోవఁదలఁచితిన్. 98

కం॥ వినియింటనుగుర్వొక్కనిఁ, గొనుమటిగాఁగోరియొక్కచెట్టిపడుచు పూ
వినయదిఘోరతపమ్మని, కనవచ్చితినామెయిమొగదయనుకొంటిన్. 99

కం॥ తనుచూచుచుండమన్మథుఁ, డెనబూడిదసేసినట్టి, పెళుసువనను,వా
నినిగూడియేమిసుఖపడు, వనితవమీరైనఁజెప్ప వలదా! చెలులై. 100

కం॥ తనయంతఁదెలిసికొనలే, దనుచునుపేక్షింపఁదగునె యక్కటకష్ట
వార్తనుసుఖము నీమెతోడిద యనియెఱిఁగియు నిట్టులుండ నగునేమీకున్, 101

కం॥ నామహిమయేనచెప్పిన, మీమదికేట్లొందుతలఁచి మిత్రిత్వమ్మున్
బోమఱతురాయనివెఱచియు, నామెయిమైత్రికివిరుద్ధ మగుటఁబలికెదన్ 102

గీ॥ అనుచుమతియనుబలుకుబ్రాహ్మణునిజూచి, సఖికినయ్య విశ్రవణదుస్సహము లగుటఁ
బలికెదయ,యంతనోమహాబ్రాహ్మణుండ, వరలుమనమైత్రినిజము శాశ్వతము
గాఁగ. 103

కం॥ గనుఘుంజోకలఁ బోయెద, వృషుగుమన న్వేడక యాడె దుగ్రిని పేరల్
పడఁతులని యలుకఁ జూచెదొ, వడుగా యుడుగుడుగుమింకఁ బలుకకు పెక్కుల్.

కం॥ వెడ తెరువులిచటఁ జెల్లవు గడుసరి పలుకులకు నేర్చు కలదేని శివుఁ
మ్మృడుఁ బొగడి చెలియ మెచ్చుం, బడయుము పమకూర్పసీమఁ బరమశుభమ్ముల్.

కం॥ ఆమాటకు వటుమూర్తి, భామిని వెసనవ్వెఁ దోపఁగ మలాక్షి రో, న
న్నామహితుఁ బొగడుమనియెదొ యీమాటకు నింత యేల యటుల యొనర్తున్.

కం॥ ఒనరించి విమాను వచ్చెలి, యను గ్రహవిశేషమంది యదిగదననుచున్
దన నేర్చినటుల యాతఁడు మును కొనియెదు శివుని స్తోత్రము నుజేయంగా. 107

కం॥ కొలివిద్యగాని బ్రహ్మన్, దలమ్రించినవాని నెద్దు తత్తడివానిన్
గులహీను గోత్రహీనుని దలిదండ్రులు లేని వానిఁ దలచెన వాత్మన్. 108

కం॥ విషకంఠుని విషమనేత్రుని, విషధరభూషణుని, ఘోర విషమాద్రిదరి
విషయుదిగంబరుఁ దలఁచెద, విషధిశరాసుని శిరస్థవిషమఘుభూషున్. 109

వ॥ అనునెడల నాజయవిజయ లాం యల సఖ్రిద్దరు పార్శ్వమ్ముగా నుపలక్షించి, తమ చెలిహృదయమ్ము నెఱింగి యతనిఁ జూచుచు 110

కం॥ వ్యాజస్తుతియో, యిదినీ, నైజస్థితియో యటంచు, నగియెవనొకతె, కా
దే జడు రెంకుసునగునని, పైఁజూఱ మఱవతనిఁ జూడ వటుఁడును నగుచున్. 111

కం॥ శ్రీకంఠ కపాల, శ్రీకమనీయా భుజంగశేఖర! శివ దో
షాకరశిరోమణీ! మా, కీకల్యాణమ్ము గూర్పు మీకన్నియకున్. 112

మ॥ అనినన్ దిగ్గనలేచెఁ బార్వతి యమర్షాటోపదుర్వారయై
వెనుమున్ జూడక యెంతమాటవలికెన్ విప్రుండు దుర్బుద్ధి వీ

నిబిడోదగ్ర విశాలము లేచిరి చెలుల్ నిర్ణిక నిర్వ్యాజం
గనిభమ్ముల్ వినగంగ జూడ్కులపుడా కల్యాణి పోనున్న చో. 113

మ॥ నిలుమీ శంకరుడంచు సతీ నిలువుమీ నీభక్తి తాత్పర్యముల్
విలిచెన్నన్ని యుమాడుమా యనసుకుల్ పిల్పించె గారుణ్య ని
శ్చలముల్ సంభృత నిర్మలప్రణయముల్ సౌహార్ద సౌహార్ద్రముల్
నిలిచెం బార్వతి యప్పరాత్పర వచోనిర్యత్సుధా మాధురిన్. 114

శా॥ ఆలోకించుచు గౌరి కట్టెదుర నీహారాంశు సాంద్రచ్ఛటా
జాలమ్ముల్ సుకుమారపల్లవ వనీసంక్రాంత సౌభాగ్య ము
దాలక్ష్మీ సుభగమ్ములన్ గనుక వినాగిల్లు చిత్తమ్మునన్
లోలాక్షుల్ మరలించె దోరణులుగన్ రోలంబ ముక్తావళుల్, 115

శా॥ ఆలోకించెను గౌరి తా నెదుర నీహారాంశు రేఖావిభూ
షాలీనామల శేషహార రుచులన్ శార్దూల చర్మాంబర
శ్రీలీలాపరిరంభితోజ్జ్వల తనూరేఖా విలాసమ్ములన్
కేళీమోహరసార్ద్రవీక్షణ దరస్నిగ్ధాస్య హాసమ్ములన్. 116

ఉ॥ ఆగి ప్రతిచూచి యటు లాత్మపురా ప్రణయప్రసంగ వి
ద్యాగురుమూర్తియా గిరిశు నర్చనసేయ, నవారవిందముల్
స్వాగతమిచ్చెనో యన విశాలవిలోలదృగంబుజమ్ములన్
రాగిలి వచ్చు భృంగమధురస్వర లీనమనోజ్ఞభావమై. 117

కం॥ సుడిబడు సెలయేఱు గిరిం, బొడిచిన పదిపోలె వెనుక ముందడుగిడంగా
నోడబడుగ నసివడుపున, బెడగుగ నటునిలుచు వడంతి విధముంగనుచున్. 118

ఉ॥ మెచ్చితినీతపమ్మునకు మెచ్చితినీదు విశుద్ధవృత్తికిన్
వచ్చితినీ చెలువ్కా మనమునం దిక వేటికి రమ్ము రమ్ము వి
ద్యుచ్చపలాక్షి వర్ణియను దోసము నెంతువొ మేలు మేలు నే
నిచ్చితి నీకుఁ గోరుకొనుమీ వరముం దగ శైలబాలికా!. 119

కం॥ మనవృషభము దిగొవచ్చెన్, జనుదెమ్మా సఖులు నీవు శైలేంద్రునకున్
బనిచెద వార్తను నిప్పుడ, యనుమానము లేదు వెడలుమంబుజవదనా. 120

మ॥ అనినం బార్వతి స్వామి మీ తలఁపు వేఱొరీతిఁ గావింపఁగాఁ
జనదెన్నండని యే నెఱుంగుదు నినున్ సామాన్యుఁగా నెంచి యీ
వనితల్ పల్కిన మాటలొండు మెయిగా భావింపకే పాటికిన్
ననుమన్నింప వరమ్మొసంగుమనుచున్ గైమోడ్పు లర్పించినన్. 121

కం॥ చెలులంతఁ దమ్ముఁ గలయం, దిలకించు కృపారసార్ద్రదృష్టి విహారునిన్
వలగొనుచు విన్నవించిరి, లలితప్రియమృదువచోవిలాసము లొలయన్. 122

శా॥ సర్వజ్ఞుండవు నీకు విన్నపము దోషమ్మైనఁ గావింతు మీ
యుర్వీధ్రమ్ముల సార్వభౌముఁడగు మా యొజ్జల్ భవత్సేవకై
పూర్వమ్మిచ్చిన కన్య నేఁడు గొనుటల్ పుణ్యమ్ము సంధించుటల్
సర్వమ్మున్ శుభమయ్యెఁ గాని యొక వాంఛం దీర్చి మన్నింపవే. 123

శా॥ కల్యాణమ్ము ఘటిల్లమీకపుడె మా క్ష్మాభృత్కులస్వామి యీ
కల్యాణిం దగ నీకు బాంధవసమక్షమ్మందు నర్పించి తాఁ
గల్యాణమ్ముల నందఁగాఁ దలఁచు మా గౌరీమహాదేవి యా
కల్యాణమ్మును జూడ మా మనములం గౌతూహలమ్మయ్యెడిన్. 124

కం॥ ఇవియిల్లా సేయుచు నిటు మ్మవనకలుచు నెడల మదనమథనుఁడు గౌరీ
వదనమ్ము చూచి యుపుకవు, నిటు లెన్నయులంచు నెక్కె వృషభేంద్రమ్మున్. 125

—※ శివకల్యాణము. ※—

మ॥ హిమవంతుండు కుమారికం జెలులతో నిల్లాలికర్పించి స
ర్వమహీభృత్కులమున్ బ్రియమ్మెఱయన్ రప్పించె నాలోన స
ప్తమహర్షుల్ చనుదెంచి రీశ్వరుఁడు పంపన్ స్వామికల్యాణమా
హిమవంతుండట నిశ్చయించెఁ దగవారీర్ష్యాటు గావింపఁగా. 126

కం॥ ఆ మునులు నవ్వి చెప్పిన, యామాన్యమ్ము వినుము వెడలనఖిలజగమ్ముల్
దామపు వెడలి సెగ్గె లా, సామలమున హాటకట గౌరి గృహములన్. 127

కం॥ జగమెల్లఁ బెండ్లివారయి, నగపతి గృహము చేరి రవ్ బ్రియముమొయిన్
దగు వారి నిమునకోలోనఁ, గఁగఁ బనిచె వతండు వారు గౌరవమెసఁగన్. 128

కం॥ విడియించి చిత్తకువిడుముల, విడిసిరి వారెల్లఁ బెండ్లి వేడుకలొలయన్
బుడమి ను పుట్టిగెడవయి, కడుఁ బడఁబడెశివుఁడ కస్త్యుఁగను మంద్రియమునన్.

శా॥ లోపాముద్రమనోహరా! వినుము యీలోకమ్ము నీగాసికిన్
బాపన్ దక్షుఁడు లేఁడు దక్షిణదిశాభాగమ్ము మిన్నందె నీ
వేపోవన్వలె నేనపోవలయుగానీ లేక శాంతింప దా
టోపమ్మిట్టులు చూడుమాయన శుగాటోపమ్ము దీపింపఁగన్. 130

శా॥ నీకల్యాణమహోత్సవాతిశయమున్వీక్షించు సౌభాగ్యమున్
నూకుం జేవయనుగ్రహింపుమనుచుం బత్నీసమేతమ్ముగా
నాకల్యాణఘటస్సుయానమహితుండా దక్షిణాశావధూ
దేశికమ్ముననరలింపగానరిగెఁ జెందెన్ ధాత్రిస్వాస్థ్యమ్మటన్. 131

మ॥ చతురాస్యుండు పురోహితుండగుచు మెచ్చన్ దేవర్షుల్ వైవాహిక
క్రతువందుం గిరిపుత్రి సన్నికలు ద్రొక్కన్ బాదకంజాతినన్
మతితప్పెం బరమేష్ఠి కద్ది గనునంతన్ వాలఖిల్యాఖ్య వి
శ్రుతమౌ మౌనికులమ్ము నయ్యనఘు తేజోజాతమై వెల్వడన్. 132

కం॥ అంగుష్ఠమాత్రదేహము, లం గడునక్కజపురూపులం గనుపడు వా
రింగనినగియెడు సభన, ల్లంగని పరమేష్ఠి దాఁ బోలంగి చనునెకన్. 133

కం॥ భూసారవారిసారము, లాసర్వజ్ఞుఁడు గ్రహించి యద్భుతముగఁ దాఁ
జేసిక మండలువుననే, కైసేసి విరించి దాన గౌరవమెసఁగన్. 134

మ॥ విడువన్నేరక విశ్వరూపుండు జటావీథిన్వసింపం దాల్చె నా
మృడుఁడట్టుల్లను వారిసారమును నేనిక్షింపఁగా గౌరియున్
గడకంటం బరికింప దానిఁ గొని చక్కన్ ధాతశుద్ధాత్ముఁడై
నడపించెం గిరిజా మహేశ్వరుల కల్యాణము న్యక్ప్రతిన్. 135

ఉ॥ అంగజుఁ డాత్రియంబకుఁ డనంగునొనర్పఁగ నొచ్చి శైలజా
పాంగసుధారతిప్రమదపూర పురారిహృదంతరంగ సం
సంగశుభాంగమూర్తియయి చాపలతాంచల చారుపుష్పవృ
ష్టిం గురిసెన్నభమ్ము గవిసెన్మెఱసెన్ సుమనఃప్రకాండముల్. 136

మ॥ అది లోకైకమనోహరమ్ము, బహుపుణ్యాలోకనీయమ్ము, సం
పదనల్పమ్ము సుహృత్ప్రపుష్టజనతామాంగళ్యవాచాసుధా
స్పదమై స్థావరజంగమమ్మగు ప్రపంచమ్మెల్ల నానంద వీ
చిదర్వాదోళితమయ్యె శంకరుఁడు మెచ్చె న్మామయౌన్నత్యముల్. 137

మ॥ ఒకనాఁ డిందుధరుండు దా గిరిజతో నొడ్డోలగమ్మున్నచో
వికటాకారవినోద వేషుఁడగుచున్విచ్చేసి యొక్కండు త

క్కకయ పార్వతిఁజూచినగాచి యెవరీకన్యావతంసమ్ము స్వా
మికిన్ జేయుప్రదక్షిణమ్మెట్టులగున్ మీరెల్లవీక్షింపుఁడీ. 138

మ॥ అనిమమ్ముంగనియోఁ బ్రదక్షిణముసేయ న్నెన్కనేకాంతమున్
మునుదాతౌయణివిల్చు పీఠమునసీ పూబోఁడినిల్పెన్ బళా
గనుఁడీయంచును భృంగరూపియగుచున్గావించెనా నీలకం
ఠునిశఁఠమ్మునకుం బ్రదక్షిణములన్నమ్మాఱు చిత్రమ్ముగన్. 139

మ॥ కతిచూచెఁ జతినాదర ప్రణయలజ్జాకోపగర్వమ్ముగాఁ
బతినీవోఁజకుమంచుఁ గన్నులనగెన్ వాగర్థదాంపత్యసు
స్థితినానవ్యపురాణదంపతుల మూర్తింగంటి మేకమ్ముగన్
శ్రుతివేద్యమ్మగు దానిజన్మశతముల్ పూలంగబుణ్యాకృతిన్. 140

కం॥ భృంగరటనమునమాకీ. మంగళమనిముదముగదిరి మఱచినమదలక
భృంగరటా' భృంగిరిటీ', భృంగిరిటా! భృంగి' యనుచుఁ బిలుచుచువానిన్. 141

కం॥ నుతిసేయఁగ నాప్రమథుఁడు, స్తుతిసేసెను శివులనావిధూషకుఁగనుచున్
మతిమెచ్చించితివనిశివుఁ. డతనికిఁ గరుణించెనప్వడానామములన్. 142

మ॥ హిమవంతుండు కృతార్థచిత్తుఁడగుచున్ హేమాంబరశ్రేణితోఁ
గమనీయోజ్జ్వల రత్నవస్తువులతో గౌరీమహాదేవినా
ప్రమథస్వామికి నప్పనమ్మొనఁగి సంభావించెమమ్మెల్లరన్
రమణీయప్రియవస్తు సంతతులసర్వమ్ముం బ్రితుష్టింగనన్. 143

కం॥ జయవిజయలునా పార్వతిఁ, గయిసేసిరిశివుని మధురగంభీరశుభో
దయవేషమ్ములఁదడవుగఁ. గయిసేఁతలనటులనిటుల గాదవునపుచున్. 144

శా॥ ఆకల్యాణమనోజ్ఞవేషములతో నాస్వామి వేంచేసెఁ దా
శ్రీకాంచీనగరీ గృహమ్మునకు, విచ్చేసెన్ సతీయుక్తుఁడై

యాకల్యాణమహోత్సవమ్ము గన వింధ్యారాతియాశంకర
శ్రీకారుణ్యవిశేషముం బొగడుచుం జెందెన్మహానందముం. 145

క॥ ఇటులచ్చట ముచ్చట లచ్చటదీర వసించి శైలజాసహితుండై
నిటలాక్షుఁడు కాశీముఖ, కటకములన్వీడిసి చేరెఁ గైలాసగిరిన్. 146

క॥ ఆదేవుననుమతిఁ గొని, వేదరవిరి పెండ్లివారు విశ్వపతిదయన్
మోదపడఁ గాంక్షితములిడఁ, గాఁచమతిను వాసములకుఁ గదలనిముదులన్. 147

వ॥ అనుటయు నమ్మునీశ్వరులు సంతుష్టచిత్తమ్ముల మహాత్మా! సమాశోదయమ్ము నెఱిం
గింపవేయని యడిగిన. 148

శా॥ ఆరాధ్యాన్వయభాస్కరుండు బహుశిష్యారాధితుం డుజ్జ్వల
శ్రీరాఁ భోనిధితుల్యసైజకవితా శ్రీనాథుఁ డుద్యత్కృపా
వారాశిప్రథవేతశాస్త్రతి సదావర్ధిష్ణుసంతాన, భూ
సారభ్యప్రథమాన పద్యనుమన స్స్రగ్భూషితుం డర్మిలిన్. 149

క॥ విదళితవైరికుమారా, భ్యుదయమహాకావ్యరస సమున్నతకీర్తి
ప్రదపీఠుఁడు నిరంతర, మ నహరస్మరణ పరమమానసుఁ డెలమిన్. 150

మంజుభాషిణి॥ పరమేశదివ్యపదపంకజద్వయీ
స్మరణోత్సవుండు నిడుమర్తి భూషణే
శ్వరమంత్రి భక్తిపరిపాకరూపశా
శ్వరమావిభుఁడు గుణబంధురుండిలన్. 151

మ॥ హరభక్తిస్థిరవిశ్వనాథ నృపసింహారాధ్యమానోల్లస
చ్చరణాంభోజు గురున్ భజింపఁగ నొనర్పం బూను కాంచీపురీ
శ్వరమాహాత్మ్యము నందునా ఆవదియాశ్వాసమ్ము దీనిన్మహే
శ్వరుఁడా నేతుహిమాలయమ్ముగను శశ్వత్ప్రీతిఁ వీక్షింపుతన్. 152



# కాంచీఖండము.

## సప్తమాశ్వాసము 115 పద్యములు.



కం॥ శ్రీమద్రామానస తామరసవిహారిహారపదస్థిరసేవా
కామితమసీమనిగ్రహా, భామునకు శాశ్వతపదము భాముఁడుజగతిన్. 1

వ. అయ్యంకితారకుఁడు సమ్మతింపఁ గల్లిరియె. 2

### —※ కుమారజననము. ※—

చం॥ వినుఁడు సతీసమేతుఁడయి విశ్వవిభుండల వెండికొండపై
ఘనకుతుకమ్మునన్ మెలఁగఁగా బహుకాలము చెల్లె నంతన
య్యనిమిషు లక్కుమారునుదయమ్మును వేఁడి మహేశుపాలికిం
బనిచిరి జాతవేదసుని బన్నముఁలంబడి రాకుసాళిచే. 3

కం॥ పరమేశ్వర తేజోమును, శరీరమయ్యగ్నితనము సహచరుతోడన్
స్మరహరుసుఖాంతమ్మున, కరుణించెవలాఘ్యమైన యమునులపనికై. 4

వ॥ అట్లరుదెంచి సముచితమ్ముగా నంతఃపురివేళ నెఱవచ్చి. 5

శా॥ అంకస్థుండునఁ జేర్చి పార్వతిని ముగ్ధాలోకనాలిచ్ఛటా
శంకస్ఫూర్తిపడి ముంగురుల్ చిఱుచేనారించి యట్టిట్టుగా
వంకల్ గ్రుచ్చుచుఁ గేశసీసాబగులన్ బండించుగాకంచుఁ బ్రే
మాంకమ్ముల్ ఘటియించు శంకరుని దానల్లంతటన్ జూచుచున్. 6

కం॥ నిలిచెను బెడమోహమయియు, వ్రాలనయ్యెను మొగము వేల్పు పవనాంకురసఁ
చలితమయి గౌరిపయ్యెద, తొలఁగినదొకయింత యామె తొట్రుపడంగ

చం॥ కనుఁగొని శంకరుండు మృదుగాఢరతిన్ సతిఁ గౌగిలించె జం
కెన నెఱిచూపు లేర్చి పులకించిన మేనఁ బెనంగి యోరఁగా
స్తనఘనసారకుంకుమరసమ్మునఁ బంకిలమైన హారముల్
పెనకువ లేర్చు వింతమురిపెమ్మున నిల్చె లతాంగి యంతటన్.

ఉ॥ ఆ నెఱిచూపులున్ జలితహారము లౌచిఱువెచ్చనూరుపుల్
మేనియొయారముల్గనుచు మెచ్చుఘటించెను మాకునిప్పుడో
మానిని నీదుచిత్తసుకుమారము లీతరి తీపుభావముల్
గానముగాదె యిందనుకఁ గల్గనొ నేఁడొకక్రొత్త లెవ్వియున్.

చం॥ కనముగదా యటన్నఁ దనకాంతునిఁ జూచి జగమ్ములన్నియున్
గనినమహానుభావులరు గానరుగాకొక క్రొత్తపాత్రలున్
వినరునుగాక యుల్లవనవీధులు నల్లని తేటబారులై
కనుపడె సంచలించెనిపె కంటిరె యాలవలీనికుంజముల్.

కం॥ చీమయు జిట్టాడదుగద, యీమనయెలదోటలోన నెఱుకపడదొ నేఁ
డీమహిఁ గలిగిన వింతలు. నామనమటుకొంత తెలియనా యిటులనుటల్.

చం॥ అనుటయునవ్వి నీదునయనాంచలకాంతి తనూవిలాసముల్
మొనసెనొగాక వింత వనమున్ మనమున్ సరిగాఁగఁ బల్కితీ
వనమున నెంచిచూడఁ బెఱవారలుగల్గరు గల్గిరేనియున్
గనుపడకుండఁ జాలుదురె కాంత! భవన్మతిశంకదక్కుమీ.

చం॥ అనినశ్రీనాథుమున్నపల్కి సతినల్లనజేరెనతండు నామియున్
గనుఁగొనితోడనవ్వనమునల్లన నట్టిటుచూచెచూచుచో
వనలుఁడునిల్చినట్టయెదురై సతియంతట కోపవిభ్రమ
స్వనమున నవ్వఁడీతఁడని శంకరునింగెరలించెఁ జూపులన్. 13

కం॥ పరిణీపాతపూర్వకమ్మగఁ, గనలకుమో దేవియనుచు గౌరీపదభూ
మినిబడియెవహ్నియీశ్వరుఁ, డనునయమున వారిఁజూచి యిట్లనుచున్. 14

కం॥ ఆలుగకుమునీవు వేల్పులు, దలఁచినపని నిర్వహింపదలఁచిననామూ
ర్తులనొకఁడువహ్నియాతని, వలననుఫలసిద్ధిగలుగు వదలుముశంకల్. 15

కం॥ అని తెలుపఁగఁ దెలిసియుసతి, పనిరాజనసులభదుర్నివారకోధ
మ్మున నోయికృష్ణపథుఁడా, చను నేనీకింత పాటి సాహసమపురా. 16

కం॥ వినుమేకతమునసుండుట, గనియును దెగుదారితనముగావచ్చిననీ
కును నినుబనిచిన వేల్పుల, కును సంతతిగలుగదిద్ది గుఱుతుగనింకన్. 17

మ॥ అనుడున్ శంకరుఁడోసతీ! నీతగు నెయ్యాయగ్నిన్ శపింపంగ నే
ల, నితాంతార్తులు వేల్పులున్ గనుమ స్వల్పమ్మైనదోసమ్మునీ
కినుకం బెంచితివింతగాఁగఁజను నగ్నిన్ వేఁబ్రసాదింపఁబు
త్రునిగాంచంగ నతండురక్షకుఁడగున్ దోర్దప్తసురశ్రేణికిన్. 18

మ॥ ననుమెప్పించుచుమున్ను వేడికొనియెన్గంగామహాదేవి పు
త్రుని, నీకుంగలదట్టి వేడుక సురద్రోహిన్ జగద్రక్షగాఁ
దునుమంజాలు కుమారుఁడింకగలుగున్ దూలించికోపమ్ము నీ
యనలుంజూడుమటన్న దేవియదియట్లాటన్ విభావించుచున్. 19

## సప్తమాశ్వాసము.

మ॥ కనియెన్ వహ్ని ననుగ్రహమ్ము నెఱినాగంగామహాదేవియున్
మినుముట్టిన్ దమకమ్మునన్ హరుఁడులోమెచ్చన్ దదాలోకన
మ్మునఁ దేజమ్మొకఁడుద్భవిల్లుటయు శంభుండగ్నినీక్షించి యా
ఘన తేజమ్ముభరింపుమీవనుచుఁ జక్కన్వానిశాసించినన్.

గీ॥ ఆఱుమొగముల నిటుఁగొక్కమాఱువెడలు, పారమేశ్వర తేజమ్ము పవనసఖు
డానుభరియింపఁగాలేకతచ్చియాడి, చనుచునొక చోలసురఘునిఁగనుచని

కం॥ భరియింపరానిపరమే, శ్వర తేజము విడిచెనతఁడు జాహ్నవియందున్
భరియింపరామినదియును, శరవణమున విడిచె నట్టిసమయమునందున్.

కం॥ ఆశరవణమును గాల్చుచు, నా శరవనమిటులగాల్చునన నొక్కమహా
రాశికుమారుఁడు రవిసం, కాశుఁడుజనియించె జగముకనుపండువుగా.

వ॥ ఆసమయమ్మున.

కం॥ మునిపత్నికాముకుఁడగు, పెనిమిటిస్వాహానధూటి వివిధాకృతులన్
దనియించెనదియెఱుంగక, మునులార్వురుదమదుసతులఁబోవిడుచుటయున్.

కం॥ వారలునుగుణోదారలు, దారలుగ్కృత్తికలనంగఁ దారావీధిన్
జేరుచునాయానతినిఁ గు, మారునకుం దాదులగుచు మహివెలసిరటన్.

వ॥ అయ్యాదిమదంపతు లయ్యుపవనమ్ము విడిచి శుద్ధాంతమ్ము ప్రవేశించుటయు నందలి నవర
త్న స్తంభమ్ములం బ్రతిఫలించిన గిరితనయాప్రతిబింబమ్ముల నాజగజ్జనకుండు సాభిప్రా
యంబుగా వీక్షించు నెడల నందుండి వీరబాహుప్రముఖులగు కుమారులుదయించినం గని
యప్పార్వతి.

కం॥ తనయెడలగలుగుకూరిమిఁ, దనప్రతిమలసుతులఁగన్న ధవునింగనుచున్
మనమిష్టమైననెంతటి, పనికైనం దలఁకరనుచుఁ బరమప్రేమన్.

ఆ॥వె॥ నాఁగఁగాఁగిలించి పరమేశ్వరుని జూచి, యాతఁడూరుఁడుపయమయ్యెనో కొ
డుకున నిప్పుడడియు నరసిచిత్తమలరంచు, సుతునిసుతలఁగూడి శంకరుండు, 29

వ॥ వచ్చి పరమేశ్వరునకు తల్లులకును దమ్ముగా నారూపమ్ములఁ గ్రీడించువారిం గని
గాంగేయుం డారణిభవమ్మున నక్కుమారుల నెల్ల నొక్కటఁగాఁగిలించిన వారక్కజమ్ముగ
నొక్కటి యగుట యుమ్మశమయ్యె నంత నావీరబాహుప్రముఖులతనిం దమ యన్నగ
నెఱింగి నమస్కరించి యుచితరీతింగొలిచియుండి రిట్లక్కుమారుండు కార్తికేయుండు,
గాంగేయుండు, శరవణభవుం డగ్నిభవుండు పార్వతీనందనుం డనంబరఁగె నంత. 30

గీ॥ ఏనుమున్నుగ వేల్పుల య్యెడకువచ్చి, దేవసేనలకతని నధీశుఁజేయ
నతఁడు సేనానియగుచు నయ్యసురకోటిఁ, దునిమి తూటాడి లోకవిద్రోహమణచె

వ॥ అనుటయు నమ్మునీంద్రు లక్కుమారు పరాక్రమం బెఱిగింపవేయన నతండు. 31

—※ కుమారవిజయము. ※—

చం॥ వినుఁడది విస్తృతమ్ము సరవిన్వచియింపఁగనాకశాద యొ
వ్వనికి నశక్యమైన నిటబల్కెదమీఁదగుకోర్కెదీర్ప న
య్యనలభవుండు దేవగణమంతటఁగొల్వఁగ మ్రొక్కి యాజగ
జ్జనకు ననుజ్ఞనై వెడలె దైత్యని రాసనిబద్ధబుద్ధియై, 33

కం॥ వెడలియుటనున్న తోడరినఁ, గెడపెను దారకునిఁ గ్రౌంచుఁ గీటడఁచెఁ బయిన్
నడపించె రాయబారము, వడిమూఁపకకొంత వీరబాహుని చేతన్, 34

వ॥ అట్లునడపినం గటకటంబడి రాక్షససార్వభౌముండగు నాశూరపద్ముండు. 35

చం॥ పయిఁబెగ్గివచ్చె నప్పలుకు పాటిగఁబట్టక సర్వలోక దు
ర్జయభుజసారశోభితుఁ డజయ్యపరాక్రములైన పుత్రులున్

నయవిహీనుఁ డైనతమ్ముఁడు ననంతబలమ్ములు చేరికొల్పను
ర్ణయఫలపాకముంగుడువ రమ్యరథస్థుఁడు దుగ్రమూర్తియై.                    36

వ॥ కయ్యంపు మొనసేయుటయు నవసరింపఁ జేయుంగలుగ లొప్పన్నట్టి సింహనాదమ్ములు
చెలంగం దలపడుటయు ఘోరఘోరమ్మయ్యె నట్టిమొన.                    37

కం॥ నిస్త్రింశానిస్త్రింశియు, శస్త్రాశస్త్రియును గాఁగ జరిగిన సమర
మ్మస్త్రాస్త్రియగుచు నట్లైదై, వస్త్రీవరపదము వీరభటులకు నొసఁగెన్.                    38

గీ॥ భానుశాసించినట్టి యా భానుకోపుఁ, డాది వేవురు శూరపద్మాత్మభవులు
వీరబాహుండు మున్నగు వారి చేత, సమసిపోయిరి యవ్వడా సంగరమున.                    39

కం॥ ఆవీరబాహు వేగము, కైవెన్నిచ్చినబలమ్ము నరసి ప్రళయగ
ర్జావేగవిధురుఁ డగుమన్, దావచ్చె సుసింహవక్త్ర దనుజుండనికిన్.                    40

మ॥ బహుకాలమ్ము మనాస్త్ర శస్త్రములతో వారిద్వరుం బోరుచో
గుహుఁ డంతం జనుదెంచి యుక్కటిలునిం గూల్చెన్మహాక్రోధ. దు
స్సహుఁడై వచ్చిన శూరపద్మవిరథుఁ శస్త్రాస్త్రధారాముహు
ర్మహఁ రున్మజ్జితుఁ జేసె వాఁడు వెలు చన్మార్కీభవ త్క్రోధుఁడై.                    41

మ॥ ఒకబ్రహ్మాండము దన్నుఁ గానవుడు దైత్యుల్ శూరపద్మాకృతుల్
వికటాభీలబహుప్రకార వదనుల్ విచ్చేసి యాక్రాంచ దా
రకశక్తిన్మటుమాయమైరి మగుడన్ బ్రహ్మాండముల్ దన్నుఁగా
నొకమ్రాత్రిన్ హరియించె నాతఁ డతఁడున్ హుంకారముల్ సేయుచున్.                    42

కం॥ మాయాబలమునఁ గెడసిన, మాయసుతులబ్రిదుకఁ జేసె నల్లననగుచున్
మాయించి వారిమగుడున్, వేయేండ్లును నీకునిండె నిఖిల నిలుమనుచున్.                    43

శా॥ ప్రాఁబల్కుల్ చిఱుగజ్జలై యలరుసుబ్రహ్మణ్యదేవుండు, తే
జోభాభాసమువిశ్వరూపము తపశ్శుద్ధమ్ము దాల్చెం దపః
ప్రాంబల్యమ్మున నమ్మహాత్మునికృపా భావప్రభావమ్మునన్
మాబోటుల్ దరియింపఁగంటిమి జగన్మాంగళ్యమారూపమున్. 44

కం॥ మిలమిలనుమెఱయుగన్నులఁ గలిగినవిషయమ్ము తెలియఁగా నేరమఁటన్
దల తెగినశూరపద్ముఁడు, కలనంగనిపించిమరలఁ గన్పడఁడయ్యెన్. 45

వ॥ మేమెల్లర మమ్మహాద్భుతమ్ము వితర్కించునెడల సుబ్రహ్మణ్యుండు విశ్వరూపమ్ము నుపసంహరించుటయు. 46

మ॥ శిఖివాహమ్మును కుక్కుటధ్వజమునున్ సేవింపఁగావచ్చెనా
మఖనాథుండుకుమారు నిన్నసములన్నాకెల్లఁ జిత్రమ్ముగా
శిఖిపైఁ దాండవమాడి యాధ్వజముగై సేసెంగుమారుండు వే
సుఖమైవీచెను మందమారుతముస్వస్స్రోతఃకణాన్వితమై. 47

మ॥ అరుదెంచెంబరమేశ్వరుండు సతితో నాతల్లి కౌఁగిళ్లలోఁ
జిఱునవ్వుల్ గురియంగ స్వామివిడిసెన్, జేమొత్తి యాబాలునా
శరశస్త్రవ్రణశంకలన్ దడవెనా శర్వాణి, దానవ్వుచున్
బరికించెన్ హరుఁడా సతీసుతులసర్వప్రాణిసంఘమ్ములన్. 48

కం॥ ఇదెసమయమనుచునింద్రుఁడు. గదియఁగఁజనుదెంచినన్ను గాఁబనిచిననే
నిదిలెస్సయనుచుశివునకు. విదితముగానతనికోర్కి వినిపించుటయున్. 49

శా॥ ఆసర్వజ్ఞుఁడుదీనికింత వలెనా! యల్లుండు నేడయ్యెనా!
యీసందర్భము నీసహోదరకునీవే చెప్పుమంచాడె, నే
మీసేనానికిమాతనూజల కిఁకం బెండ్లింగటాక్షింపు మా
నాసంతోషతరంగితాక్షి యగుచున్ గౌరీ మహాదేవియున్. 50

గీ॥ ఇంతకంటెను మఱి యునింకేమివలయు, ననుచుఁబలిఁజూచెశివుఁడుతద్ధాస్తటంచ
నగిమొజగమెల్లఁగొనియాడదగినరీతి, జరిగెఁగల్యాణమహముసాస్వామికంత, 5

కం॥ కన్యాదానము సేసితి, మాన్యను లవలీసమారి మఘవుండునుసా
జన్యయుత దేవసేనను, గన్యాదానమ్మొనర్చెస్కందునకురహిన్, 5

కం॥ నాకొమరితలయి యొక్కట, నాగొమరునికై తపించి యుభవువరమునన్
నాకాధీశ్వరసుతనై, యాకన్యకలిష్టఫలము నందిరియట్టుల్, 5

గీ॥ అతనిభజియించిపడసి యిష్టార్థకోటి నెల్లవారునుదమతమయిరవులంతఁ
జేరిరాస్వామిసేవించువారికెపుడు, కలుగదాపద శుభములు గలుగుచుండు, 5

వ॥ అనుటయు నమ్మునులు సుబ్రహ్మణ్య ప్రతిష్ఠాది విశేషమ్ములు మాకెఱింగింపవేయునిన నా
రిమారిమణుఁడు. 5

— ❋ ప్రతిష్ఠాది విశేషములు ❋ —

కం॥ అడుగఁగవలసినయర్థము, నడిగితిరోయనఘులార! యవనిఁ గుమారుం
గడుభక్తినిలుపు వారలు, పడయుదురక్షయ్యపుణ్య ఫలములుపెక్కుల్, 5

కం॥ లవలీమనోహారుండా, శివనందనుగుహుఁబ్రతిష్ఠచేసిన వారల్
వివిధాభీష్టములంగని, శివలోకమ్మునవసించి చింౘెదరఘముల్, 5

వ॥ మఱియు నొక్క విశేషమ్ము గలదు. 5

కం॥ సుతకామములు చితకాములు, వ్రతకాములు నమ్మహాత్మువలన నిజార్థ
స్థితిగందురతనిఁ దలఁచిన, సతతము జయమగును గార్యసంగతులందున్, 5

వ॥ మఱియుం బ్రతిష్ఠావిశేషమ్ములు చెప్పెద నాకర్ణింపుఁడు. (

క॥ జేసి ప్రతిష్ఠ కలిపిన, కోవిదులిలఁ బుత్రపౌత్ర గురుభాగ్యయశ
శ్శ్రీ ఘనిపార్వతీపద, పావనలోకములు పడయువారలు సతమున్. 61

క॥ ఉర్వి వినాయకు నిలిపిన, నిర్విఘ్న ఫలోదయమ్ము నిస్తులకవితా
సర్వకలాకౌశల్యము, నిర్వాణముగలుగునతని నిర్మలకరుణన్. 62

గీ॥ వీరభద్రుని నిలిపిన వారు భువిని, గార్యసిద్ధిని శాత్రవక్షోభనమ్ము
గాంచి యిహాపరలోక సౌఖ్యమ్ములందు, వారు వారికి నొరయగువారు లేరు. 63

గీ॥ కాలభైరవుని ప్రతిష్ఠ కలిపి హరమ్ము, వృషభప్రతిష్ఠ ధర్మార్థ విభవకరము
సంగతానేక జనన నిస్తంద్రపుణ్య, కలనలభియించు నరములింగప్రతిష్ఠ. 64

క॥ శివసిద్ధాంతవిశారదు, శివభక్తజనాశ్రయుఁ గాంతు శివవర్తనునిన్
భువి మనుపఁగలుగు సంతతి, శివలోకనివాసఫలము చెలఁగు శుభమ్ముల్. 65

క॥ ఇవి పుణ్యక్షేత్రమ్ముల, నవశ్యంబు విశేషఫలము లభించ జగమ్మా
శివమయమయగుట చెందును, భువిఁ జిరముగఁ బూర్ణఫలము పొసఁగం జేయున్. 66

సీ. కరవీరమున బ్రహ్మ కర్ణికారమ్మున, వాణి బిల్వమునందు భార్గవియును
ఓకమున నేనర్క పత్రిసుమమ్ములఁ, గపిలుండు సంపెఁగం గార్తికేయుఁ
డలరు నమేరుల నఖిలగణమ్ములు, మందారమున శతమఖుఁడు వెలయు
బున్నాగమున వాయువును బావకుఁడు శమిన్, గనకమ్మునను యక్షగణవిభుండు

గీ॥ పుండరీకమ్మునందుఁ దానుండు శివుఁడు, నుమయు నివసించు నెమ్మి నీలోత్పలమున
నెజిఁ గపినను బూజింప సిద్ధసిద్ధి, లలరు భక్తులయిండ్ల నిత్యమ్ములగుచు. 67

క॥ ఇవి యొకటి పడయ నేరని, శివభక్తుఁడ కంపవిమల శివభజనసుధా
నవనవమనోరవిందము, శివునకు సర్పించి పరమ సిద్ధిం బడయున్. 68

కం॥ ఆలయమంటపగోపుర, శాలలుగట్టించుపుణ్య శాలురుతుదకుఁ
గైలాసమునవసించెద, రోలినవారివంశ మున్నతిఁజెందన్. 69

గీ॥ తనులదాఁ సిరసతిమహాగౌరియనుచు, నరయుభక్తులఁశివరూపులనుచునొసఁగు
నదిశివార్పణమనుబుద్ధినరసిపాయు, కుందునాతండునిత్యముక్తుండుధరణి. 70

కం॥ తనుఁగొలుచువారికంటెను దనభక్తులఁగొలుచువారిఁ దనియించుశివుం
డనుటకు నాదిదేవుఁడు, ననునాభక్తులవిదర్శనములుగఁ జేసెన్. 71

కం॥ అదిగనక కుయుక్తులకో, నదియుదియని వాదమాడు నధములుజగతిన్
దునిమొదలులేక చెడియెద, రిదియెఱిఁగిభజింపవలయు నీశ్వరుసతతమున్. 72

గీ॥ నాదుభక్తులననఁగనున్నారెయొకరు, సకలమీశ్వరుఁడావేదజనకుఁగనక
వాదులాడుమఁగాలమ్ముప్యర్థపుచ్చ. పతితులుందురునరకకూపములయందు. 73

కం॥ శివధర్మమనఁగశుభకర, మవుధర్మముజనులువిడచి నందెడిలేకన్
దవుమేలొకంనుసమమమ్మున, శివునిధ్యానింపవలయుఁ జెవరనిబుద్ధిన్. 74

గీ॥ స్నానభోజనపానాదిసమయములను, మౌనమునశివుఁగొలువనొమానసమునఁ
తపముదానమ్ముయజ్ఞమ్ముజపముసలుపు, వారువానికిదొరయగువారుగారు. 75

గీ॥ ఆర్తుఁడగుగాకయితరులకార్తియిడఁగఁ, జనదుచేతనుమాటనుమనముచేతఁ
బరధనమ్ములకయిమోసపడఁగఁజనదు, ఋతమహింసయుఁదగదెన్నఁడేనివిడువ

గీ॥ ఇంద్రియమ్ములనొడుచుటయోనుపికుట, సర్వభూతసమత్వమ్ముసాధుసేవ
శాంతిసుజనశుశ్రూషశత్రుప్రువను, నైనయుపకృతియిడఁజాలునమృతపదము

కం॥ తనధర్మమ్మునమడిసినఁ, జనుఁబరధర్మమ్ముఁదగుల జనదెన్నండున్
ఘనదుర్గంధయుతమ్మగు, తనువున్ వ్యాధిగఁదలంతురు తత్త్వజ్ఞులిలన్. 78

క॥ శివమయమఖిలజగమ్మని, యవిరళనిష్ఠన్ భజించునది, యది యెఱుఁగం
గవిశిష్టధర్మమగుటన్, భువినిది యెవ్వరికిఁగాని ముఖ్యమ్మరయన్. 79

క॥ శివునకుఁబరమ్ము లేదని, శివమంత్రమ్ము జపించు సిద్ధులు మాన్యుల్
భవరోగహరణకర్మఠు, లవ్వారలు నామఁబ్రియత మాగ్రణు లెందున్. 80

— ❋ కాంచీపదనిర్వచనము ❋ —

వ॥ అనినం గృతార్థచిత్తమ్ముల నమ్మునులు గాంచి పదనిర్వచనమ్ము తెఱంగెఱింగింప వేడుటయు నా లక్ష్మీశ్వరుండు. 81

గీ॥ అకుఁగకారమ్ము బ్రహ్మరుద్రార్థకమ్ము అంచితమ్ము దాని చేఁ గాంచి యయ్యె
నుత్తమాంగమ్ము వలెనుత్తమోత్తమమ్ము, నఖిలదుఃఖహరమ్మయి కాంచి యయ్యె

గీ॥ వినుతిత్రిమూర్తులమగు మమ్ము విశ్వవిభుఁడు కాలకంధరుఁ దెలుపుఁగకారపదము
అమృతమానందమనుము నిత్యమ్ము పరము, కాననయ్యది యయ్యెను గాంచిపురము.

గీ॥ అయ్యె శునకమ్ములమ్మహా వ్యాధునకును, నాదిభిక్షుని కౌపీనమయ్యెఁ ద్రిపుర
హరుని యశ్వమ్ము లెవ్వి యయ్యఖిల వేద, ములును నట రాజు కాలి యందెలుగ నయ్యె

గీ॥ అట్టినిగమమ్ములయ్యె నేకామ్రవృక్ష, మందు శివుఁడు జ్యోతిర్లింగమగుచు వెలసె
నయ్యె వాచకరూప కామాక్షి యతని, కతఁడు వాచ్యుఁడ మేయుఁడే కామ్రవిభుఁడు.

వ॥ కావున నప్పరమేశ్వరుండు జనకుం బ్రీతికరమ్ములగు, శంభు మహో భూమయస్కర, శివ శివతత్త్వమ్ములను నామమ్ములకంటె నేకామ్రనాథనామమ్మునం బరమహృష్టుండగు; భక్తానుగ్రహాకృత బహువిధవిడంబనంబులు నప్పురమున శివులీల లనంతమ్ము లమేయమ్ములట్టి యట్లుండె మన్నొకపద్యము. 86

ఉ॥ హాగురుమాతఁ లాడెడు బెడంగున మందరరమ్యకందరా
యోగికనుంగవన్, గిసలయోదరకోమలపాణిమాయు, గౌ
రీగజయాన కేల పసరించుచు నోగిరిరాజపుత్రి, నీ
యాగడ మింకఁ జాలునని యవ్విభుఁడల్లన నవ్వి యిట్లనున్. 87

కం॥ పొరపాటుగాదె తరుణీ, సురలకునన్నమ్మ భూమి సురవరకార్యా
చరణాధారము జగతీ, శరణము కనుఁగవను మూయఁ జనునె తలంపన్. 83

కం॥ ఉడుగుడుగుము ననునంటకు, పడఁతీ యెడఁగలుగ నిలిచి పలుకుమటన్నన్
జడిముడిపాటున బలుకున్, దడఁబడ వెఱఁగొను మసతియుఁ దనపతి కనియెన్. 89

కం॥ చనవెంతయున్నఁ బెద్దలఁ జెనకుటగడు సేగిమనుట సిద్ధమ్మయ్యో
గొసి తెచ్చుకొన్నయీతప్పును దొలఁచును పాయ మేది పురహరచెపుమా. 90

కం॥ అనుటయుఁ గాంచికిఁ జనుమూ, యనుకంపను దపముసేయు నడఁగునటన్నన్
జనికాంచి ఘోరతపమును, బొనరిచెగిరి రాజబిడ్డ పుణ్యవ్రతయై. 91

మ॥ అనుకంపానదపొంగిపొర్లగను నయ్యార్యన్ బరీక్షించి, కై
కొనియెన్ శంభుఁడు తస్కరుండగుచుఁ బెన్కల్ గ్రీడలాగౌరితో
నొనరించెన్ మము బోంట్లు గొల్వఁగను దానొడ్డోల గమ్మండియె
ల్లను లోకమ్ములఁ గాచు వెన్నెలలు చెల్లన్ బిల్లలే నవ్వులన్. 92

వ॥ మఱియు నిట్టివిశేషమ్ములు పెక్కులంగలవుగావున. 93

కం॥ నివసించిన స్మరియించిన, భువిముక్తి నొసంగు కాంచి పురమున కనొకం
డవురాటియనఁగఁ జెల్లను, తవువది తనసాటి తానె ధన్యత్వమునన్. 94

ఆ॥వె॥ కామకోటియనఁగఁ గాంచికి నగునటఁ, గామితములు కోటిగా ఫలించు
నటఁ ద్రిమూర్తులుపుట్టియణఁగిరి యొకకొన్ని, కోట్లుగానఁ గామకోటియయ్యె. 95

కం॥ కాంచిని నేకామేశ్వరు, నంచితఁ గామాక్షి దేవి ననుకంపను సే
వించిన ధన్యుండగు వే. దెంచఁగ నీత్రియము సాటియే భువనమునన్. 96

కం॥ అనివిరమించినవిష్ణుని, గనిమ్రొక్కుచుధన్యపదవి గనుఁగొనిమునులున్
జనిరిందిరకేలూతం. గొనిహారియురువనము గొలువ కూటమువిడిచెన్ 97

ఉ॥ మానివరేణ్యులార శుభమార్గమొకంగఁగఁజాలుగాక, యీ
దానముయజ్ఞమున్ దపము ధర్మమపత్యముసత్య మీశ్వరుం
డానతభక్తవశ్యుఁడగు నాతనిఁజేరఁగఁ జిత్తశుద్ధను
ష్ఠానముమూలమిందిరయు వశంవదులవ్విభుఁ జేరనేర్తురే. 98

కం॥ అరిషడ్వర్గముత్రిప్పగఁ, బోరలెమయుతికన్నమిగులఁ బూజ్యుండగు,దు
స్తరసంసారమునందున్, గురుతరనిజధర్మవర్తనుండగు నేనిన్. 99

కం॥ మీరెఱుఁగనియదియున్నదె యారయనాపలుకులందు నయిననుననున్
జేరిమిమన్నించుకృపా వారాన్నిధులార పోయి వచ్చెదసెలవా?, 100

కం॥ అనుసూతువిడువనేరక, యునుపిడిచిరివిమువఁదప్ప మునికిన్ మానుల్
చనెనాతఁడంతవారలు, చనిరా కాంచీశుఁగొలువ సంభ్రమపడుచున్. 110

— ❋ మునులు కాంచీశ్వరుని భజించుట ❋ —

వ॥ అట్లువెడలివారలెడతెఁగని ప్రయాణమ్ములఁ గాంచీపురమ్మునకేగి యథోచితమ్ముగం
దీర్థవిధులాచరించిన. 102

— ❋ చతుర్ముఖీ కందము ❋ —

కం॥ సోమార్ధమౌళినిరుపముఁ, బ్రేమన్ జగములనుగనిన వేలుపుసగుణున్
సోమసఖుభక్తజననిధి, స్వామినగధరునిబాదభాసురనిగమున్. 103

కం॥ కనివినయభరితహృదయులు, మునులటస్మరహరునిహరుని బురహరునభవున్
మనములనిముడనిపులకము, ననుబొగడిరివివిధమధుర వవనవగతులన్. 104

కం॥ స్మరహరహర భవశంకర, వరదమహః ప్రభవ యభవ భర్గవరతపః
పరపరమభక్తసంగత, గరకంఠయనంతశర్వ గంగాధరణా. 105

శా॥ శ్రీకాంచీనగరీశ్వరా, శ్రుతిశిరస్సిద్ధాంత పాదాంబుజా
రాకాచంద్రికలావిభూషణ, సువర్ణక్షోణిభృన్మందిరా
శ్రీకాంతాకమనీయ సాయక! సతీశృంగారితార్ధాంగ, యో
యేకామ్రేశ్వర లోకరక్షక! పురారీ! మమ్ము బాలింపవే. 106

స్రగ్ధర॥ మౌళిస్రఙ్మంజుభూషా మధురసురధునీమంజరీ మంజుకీర్తి
శ్రీలేఖాచంద్రికోచ్చిశ్రిత కపిలజటాస్నిగ్ధ బంధాభిరామా
శైలేంద్రోదారపుణ్యోచ్చయఫల తనుజాసంగతార్ధాంగ రంగల్
వ్యాళీచర్మోత్తరీయా, యభవ, పరమ, యేకామ్రలింగాశుభాంగా. 107

లయహారి॥ చదువులును గిదువులును జదువఫల మొదవునని
మదిదలఁచి మదమొదవ బదరితిమి పెక్కుల్
తుదిమొదలు గననితొలు చదువులను మొదవులను
ముదమొదవఁ బదిలగొను సదయునిపదమ్ముల్
గదియమదు లుదరినవి యిదెయదను దయపొదల
గదలుమ్మృదువదములను వదలమిట రమ్మా
మదనహర! వదనఖర! కదనపర హృదయచర
సదముహార ప్రదరహారి కదరిలయహారీ. 108

మ॥ తలఁపుల్ చేరనినీస్వరూపము నిటుల్ ధ్యానించు మాదోసముల్
దొలగింపం దయసేసి మాభవములన్ ద్రుంగించినీపాద ని
శ్చలమౌచిత్తమనుగ్రహింప గదె యో సర్వజ్ఞ! పాపాటవీ
దళనస్ఫూర్తకుఠారవీక్షణ కృపాధారైక ధారాహరా, 109

శా॥ కామాక్షీ మునులస్మితా, మృగశిఖుకల్ గంగా ప్రవాహమ్ములై
సోమోత్తంస! శిరస్సరోజ మధులై సుభ్రాంశు రేఖాభులై
సామేనక్షఫణీహార సుందరములై సౌభాగ్యముల్దిద్దె. నో
స్వామీ యీమనసు రాకృతిన్మఱసి నిచ్చల్మమ్ముఁ బాలింపుమా. 110

తే॥ అనిప్రస్తుతింపదమున, మ్మునులకుఁ బొడసూపి భుజగ భూషణుఁ డెలమిఁ
దను వేడు నిష్టఫలముల, ననుగ్రహము సేసి కనుఁ గగపడఁడయ్యెఁ. 111

మ॥ శ్రీమన్మల్లమపల్లివంశ విమలక్షీరాబ్ధిమందార, శ్రీ
సోమారాధనతత్పరా! గురుమనశ్శుద్ధాంతసంచార, ని
త్యామోదోజ్జ్వలమానసా, బహుళశిష్యామేయ పుణ్యాకృతీ
శ్రీమల్లేశ్వరపుత్ర మత్కృతిపతీ శ్రీదుర్గమాంబాపతీ. 112

తే॥ శివలెంకామృతలింగ, ప్రవరమచశ్చరణశీల, బ్రహ్మవిదగ్రి
స్తవనీయతత్సమన్విత, సువర్ణరుద్రాక్షహార, సుందరమూర్తీ. 113

మాలినీ॥ సువినయమృదుభావా సూనృతాత్మానుభావా!
కవికులపరిగేయా! కావ్యవాగ్భాగధేయా
వివిధసుగుణభూషా! విశ్వదాతృప్రితోషా
శివకరమధుమూర్తీ! శిష్యచిత్తాబ్జవర్తీ. 114

మ॥ గిరిజాదేహవిలీనపుణ్యగృహిణీకీర్తిస్ఫురచ్చంద్రికా
భరితాంతఃకరణుండు వీరనయోనర్యంబుగాను కాంచీపురీ
శ్వరమాహాత్మ్యమునందు నేడవదియాశ్వాసమ్ము దీనిన్మహే
శ్వరుఁడాత్మీయసతీశిరః కుసుమభూషారీతిఁ బోషించుతన్. 115



శ్రీ

# కాంచీఖండము.

## అష్టమాశ్వాసము.

కం॥ శ్రీమద్దుర్గాహృదయన, భోమండల తరుణమిహిర మోహనమూర్తీ
శ్రీమల్లికార్జునారా, ధ్యా మత్పద్యార్ఘ్యకమలదామాభరణా. 1

### మూకకవిచరిత్రము

గీ॥ కంచికామాక్షితల్లి సేవించియొక్క, మూఁగపంచశతశ్లోకములరచించె
వానిచరితమ్ము విస్మయావహముకరము, విన్నవించెదమాతండ్రి వినఁగదయ్య.

చం॥ కలఁడొక బ్రాహ్మణోత్తముఁడు కౌశికనాముఁడధీతవేదుఁడు
జ్వలశివభక్తిభాసురుఁడు సారవిచారుఁడు శాస్త్రవైభవుం
డలఘుపురాణమర్మవిఖిలాగమకోవిదుఁ డార్యవర్తనుం
డలఘుఁడు పుణ్యతీర్థమహిమానుభవజ్ఞుఁడునై చెలంగుచున్. 3

మ॥ సకుటుంబుండు సబాంధవుండునయి, విశ్వక్షేత్రయాత్రాసము
త్సకచిత్తమ్మున భక్తసంఘములు తోడ్తోరాగ సేవించె, న
త్యకళంకస్థిరభక్తిఁ బెక్కులగు దివ్యక్షేత్రముల్ చేరఁగాం
చికిఁ గైవల్యసతీవలగ్నవసతిశ్రీలాలసత్కాంచికిన్. 4

కం॥ కామాక్షీకరుణాపీ, ఠామధురపవిత్రవారికంపావీచిన్
దామెల్లఁ గ్రుంకి చేసెను, సోమునకభిషేకములను శ్రుతిసూక్తములన్. 5

గీ॥ అచటి వేల్పులనెల్లరనభినుతించి చేసివిధులెల్లనాతీర్థసీమయందు
విడిసియొక మండపమ్మున వెలదితోడ, ననియె నాతండు వినబంధులాదరమున. 6

శా॥ కంటే రోమితమధ్య! యెయ్యెడల నిక్కాంచీవిలాసమ్ము మ
క్కంటిన్నైజగుణప్రభావమున నేకాంతామ్రభూచారిలోఁ
గొంటం జాటెడి సారసారస, సరఃకూజన్మరాళధ్వనుల్
వింటే సాధకపోతఘూత్కృతిమరుద్వీధీశుకాలాపముల్. 7

మ॥ చరితార్థత్వముగంటి వల్లభ దళచ్ఛాంపేయసౌరభ్యసం
భరితన్ సారస, సారసాంచదనుకంపం గోకిలాలాప, వి
స్ఫురితన్ సంచితశంకరప్రణయనీశుద్ధాంతరంగన్ శుభా
కర నీకాంచినిగాంచుపెంపెుఁ ద్రిజగత్కైవల్యసంధాయినిన్. 8

శా॥ ఆ భూమీసురమాళి, బంధుల మొగమ్మై యిట్లనుం గంటి రే
యీభూమింబరిపక్వ పుణ్యసుగమమ్మీ నారికేళాటవీ
శోభల్ దుర్లభముల్ మఱొండు నెడలన్ స్తుత్యమ్ములే నస్రవం
తీభంగమ్ములువాహినుల్ పికరవోద్వేలమ్ములీయామ్రముల్. 9

ఉ॥ ఓ పృథుపుణ్యమూర్తి కనవో వినవో మునుతీర్థరాజి, నం
దే పురమీపురమ్మనకు నీడగునే, నిగమాగమోజ్జ్వల
శ్రీపరిపాటిఁ జాటెడి, ధురీణములైన. పురీవనీఘనీ
ప్రాపక సద్ద్విజప్రకరపాఠములోంకృతినాదమాధురిన్. 10

కం॥ అను నెడ నాగృహమేధిని మనమునఁ గాంచీనివాస మహిమము మిగులన్
బెనఁగొనఁ బెనిమిటికనియెన్ వినయమ్మును సిగ్గు వెల్లివిరిసిననుడులన్ 11

మ॥ అనఘా యీడుననుగ్రహమ్మనను దివ్యక్షేత్రముల్ పెక్కుఁ గాం
చను, సేవింపను, బాపపుంజముల నొంచంగల్గె, నాత్మాశ్రయ
మ్మున వృక్షమ్ములు పక్షులున్ గిరినదుల్ పూజ్యత్వముం గాంచు, కాం
చినివాసమ్మది యెంతవారికొకదా సిద్ధించుజన్మమ్మునన్. 12

క॥ అనఁదననిశ్చితమాయుం గన, వలుకుటకలరియుతఁడు కామిని యిదేనీ
మన సెట్ల యట్లయుండుద మనియెం దక్కంధుజనము వటఁగొనిదినముల్. 13

క॥ నివసించి సెలవుఁగొనితమ నివాసములకరిగిరంత నెలతయుభక్తిన్
శివురాణింగామాక్షిని వివిధవ్రతనియమములను విడువకకొలిచెన్. 14

క॥ కొలిచినభక్తికి మెచ్చుచుఁ గలలోనంగానిపించి కామాక్షి; సతీ!
కలకోర్కి తెలుపువనవుడు వెలఁదియునాయమ్మ మ్రొక్కి వినయ మెసంగన్. 15

క॥ సుతునిమ్మనాకునొక్కని మతిమంతుని నీదుభక్తిమహితునవంగా
సతి! యిచ్చితిఁగొనుమని, యా, సతియంతర్ధానమందె నతికుతుకమునన్. 16

గీ॥ విభుని మేల్కొల్పియతనికివిన్నవింప నగుచునాతండు నెంతకుఁదగవునీవు
భవునియిల్లాలుదా మెచ్చివచ్చినపుడు మోక్షమడుగక కోరితేపుత్రునొకని. 17

చం॥ అనిన వెఱంగుపాటున మహాత్మ! చిరంతనవాంఛితమ్మునా
మనముననాటియున్నదది మాన్పగరాక కుమారు వేడితిన్
జనపుననాయెనర్చినది సాహసముల్ క్షమియింపుఁడంచు వే
డినమగనాలి మెత్తనినుడిన్వగ డిందగనాతఁడెట్లనున్. 18

పంచచామరము॥ విచారమందనేల యిటులభీత హారిణనేత్రి. నీ
దుచింతితమ్మునాకు నధికతోషకరమునంచు, నా
శుచివ్రతుండుదేర్చెఁ దనదుసుందరిని గ్రమమ్మునన్
బచేలిమమ్ము పుణ్యఫలమనంగ నొకకరత్నునన్. 19

స్వాగతము॥ కాంతమోము తెలివికాంతులనించెన్, వింతవింతలగువేడ్కలుమించెన్
గొంతతగ్గెఁదళుకుంజిగిచూపుల్, అంతకంతకుఁబ్రియాసము హెచ్చెన్. 20

చౌపద॥ గగనముభూచక్రమ్ముటుగ్రమ్మెన్, మొగిళులుమేరువుమొగలను మొగిడెన్
ధగధగ తెలిపద్మములికసించెన్, పొగరుడిగినసూర్పులువిడెఁ జేటల్. 21

తోదకము॥ మంచిముహూర్తముమంగళవేళన్, గాంచెనుభూసురకామినియంతన్
బంచశరప్రియభాసురదేహున్, సంచితపుణ్యావిశాలునిబాలున్. 22

మణిరంగము॥ బాలుఁడునాశశిబాలకలీలన్, గ్రాలుచుబెరుగనమ్మదమందెన్
బాలమాతయునాధునితోఁదా, నోలలాడెమహోత్సవమందున్. 23

రథోద్ధతము॥ నెమ్మిబాలునుపనీతునిఁగాఁగఁజే. సెమ్మహీసురుఁడుసెప్పెవేదముల్
ఇమ్ముగాఁదెలిపియెల్లశాస్త్రతం, తమ్ములందనసరాసరిదిద్దెన్॥ 24

వంశస్థము॥ జయించెవిద్వత్సభలన్ బుధేంద్రులన్, నయించె కీర్తుల్ నలినాల్గుదిక్కులన్
అయోజ్వలుండై యతఁడెల్లవెంటఁదం డ్రియంతవాఁడన్బిరుదందెనల్లెడన్ 25

జలోద్ధతము॥ భజించెగురులన్వహించెనయమున్ యజించెహరునిన్బవుంబరతరున్
బ్రిజల్ప్రభులు తన్భజింపగురుఁడై ద్విజాభరణమిందిరియమ్మలోడిచెన్

వ. అంత నాపుణ్యదంపతులు తమసుతుండు శివశర్మగుణసమృద్ధికినలరి యతనికిం బరిణ యమ్ము సేయుందలంచి రప్పుడాగ్రహమేధి. 27

ఇంద్రవంశ॥ ఇందీవరాక్షీహృదయారవిందముల్ కందించుసౌభాగ్యముగల్గువానికిన్
డెందమ్మునందెండిలిసేయుకోరికన్ జెదెన్విచారించెనుబుణ్యబాలికన్, 28

తామరస॥ కులవతిఁబావనిఁగోమలరూపన్ జెలఁగుచుఁబెండిలిసేసెఁగుమారుం
డలఘుఁడుపెద్దలయాదరమించన్ మెలగెనుగేహినిమేల్నడవడిచే 29

చం॥ కొడుకనునమ్రశీలయగుకోడలుఁ దమ్మభజింప భక్తిమైఁ
గడపిరికొంతకాలమును గాశికఁడీశ్వరసన్నిధానమున్

బడయఁగఁగోరి, పావనతపస్స్థితి, నంతటనిశ్చయించియా
కొడుకునుగోడలింబలికెఁ గూరిమితోనొక కొన్నిధర్మముల్. 30

గీ॥ ఎఱుఁగునివిలేవుమీకు,మీరెఱిఁగియున్న, నెఱుఁగఁజెప్పఁగ,తప్పక, యొఱుకపఱతు
నన్నియాశ్రమములయందునఱయుబెద్ద యగుగృహస్థాశ్రమమురత్నమట్లుశిలల. 31

గీ॥ ధర్మమర్థమ్ముకామమున్ త్రయము నెపుడు చెలగిపరస్పరరుద్ధమైచెడకయుండ
నడచికొనుటదిలెస్స, దినమ్ముదినము వలయులింగార్చనముజేయఁబరమభక్తి 32

గీ॥ గుఱునకగుఁగాకతనదుకాపురముచెడఁగ నీతియొసఁగుటదోసమెందేనిఁగాని
యెంతలాభమ్ముకూర్చెడి వేనియైన గూడనిల్లాలిమనిచుఱఁజూఁడుపనులు. 33

గీ॥ పంచయజ్ఞమ్ములనువీడవలవదెపుడు నగ్నిపూజనమగు దేవయజ్ఞమనఁగ
సమరఁబితృపూజనముపితృయజ్ఞమగును భూతయజ్ఞమ్ముప్రాణులపోషణమ్ము. 34

గీ॥ అతిథులభ్యాగతులువిప్రులనఘమతుల యర్చనమ్మగుమానుషయజ్ఞమనఁగ
నమలఋగ్యజుస్సామవేదాధ్యయనము బ్రహ్మయజ్ఞమ్మనాభువిఁబరఁగుచుండు. 35

గీ॥ అరయశివలింగభూతిరుద్రాక్షలెపుడు విడక తాల్పంగవలయునువిమలభక్తి
జపముసేయంగవలయుఁబంచాక్షరమ్ము ప్రాణమున్నంతవఱకునుబ్రత్యహమ్ము 36

గీ॥ అన్నముభుజించువేళసూర్యాభిముఖుఁడు ప్రాఙ్ముఖుండైనఁగావలెఁబంచజనుఁడు
అరయఁబరదారగమనమ్మనంతకంటె సకలశుభనాశకముదివాసంగమమ్ము. 37

గీ॥ జీవనమునిలుచుమాత్రభుజింపవలయుఁ గానిభోజనమాత్రమ్ముగాదుబ్రతుకు
ఇదియహింసనుసాధించుటెంతలెస్స హింసతగునొంటనిదియునుహింసయగుట. 38

కం॥ ఋతమమృతము,ప్రమృతమ్మును మృతమునుసత్యానృతముశ్వవృత్తులయందున్
క్షితిజనుఁడుతనదుదేహస్థితికై ధనసంచయమ్ము సేయగవలయున్. 39

సీ॥ ఋతముంచశిలము, నమృతయాచితమగు, మృతముయాచితము ప్రమృతముకృషి
యు, సత్యానృతమ్మనఁ జను వాణిజ్యమ్ము సేవశ్వవృత్తి కుత్సితతమమ్ము
నరయ నజిహ్మమ్ము నశఠమ్ము నైన జీవనము ప్రాణుల కెల్లవలయు నెపుడు
నాభిజాత్యమ్ము నకర్ధమ్ము నకుచ సుకృతము ప్రియమునకుఁ గృతమునకును
ఆ॥వె॥ దగినవారితోడఁ దగుఁ జెల్మి సేయంగఁ దగని వారిదండఁ దగదు చేర
ఋతము ప్రియము పలుకఁ డెన్నండు గానియు, ప్రియము ఋతము పలుకవలెడలఁ
జనదు 40

కం॥ అడుగుట యాలస్యముగా నడిగిన దేయింతయైన, నగునీయంగా
బోడ మెదున స్త్రమయమ్మగు, నెడలంగన రాదు తపను నెక్కాలమునన్. 41

గీ॥ నీటనుమియుట, దోసిట నీటఁ గొనుట, సంధ్య భుజియించుటయు శూన్యశరణమందు
నొంటి నిద్రించుటయు నిద్రనున్న వాని మేలుకొలుపుట యెన్నండు మేలుగాదు, 42

గీ॥ ఒకరు తాల్చెడు వసనాదులూనరాదు గోటఁ ద్రుంచుట గూడదే పాటిదాని
నగును జూవఁగ దోషమిందాప్రియుధమ్ము వక్తసభలోనఁ దప్పని పలుకఁ జనదు. 43

గీ॥ తగదు భోజనమేకవస్త్రమ్ముతోడ నొంటఁ జనరాదు పెద్దలయొద్ద నెపుడు
గూడదు మధేచ్ఛగాఁ దానుగూర్చుండు టాత్మభూషణపరమపాపావహమ్ము 44

గీ॥ ఆవులించెడు, తుమ్మెడు నారగించు సతి, రజస్వల, నగ్నను జనదు చూడ
నలసుఖాసీనఁ దనసతి నైనఁ గాని యేకశయ్యను నిద్రించు టెపుడు తగదు. 45

గీ॥ మనగృహాచారములను నేమఱఁగవలదు తల్లి కామాక్షి సేవనిత్యమ్ము సలుపుఁ
డనుచు నొకవింత తెఱఁగైన మనముతోడఁ బుత్రుఁ గనుగొని పలికె నా
పుణ్యగుణుఁడు. 46

గీ॥ పోయివచ్చెద మయ్య యీపుణ్యశీల మనను మెత్తని దనుకూల, మనము నెఱిఁగి
నెమ్మి వర్తింపుమని వారికిమ్ముగాఁగ బలికి సతితోడ నిలువీడె బ్రాహ్మణుండు, 47

ఆ॥ వె॥ తమ్ము నిడిచిచనెడు తల్లిదండ్రులవీడఁ జాలకయును వారిశాసనమ్ము
దాటరాక పుణ్యదంపతుల్ వగచిరి నిముసమేను గాఁగఁగమలుమదుల. 48

కం॥ చనియతఁడు ఘోరతపమును బొనరిచి సతితోడఁ గొనియెముక్తిపదమ్మున్
దినములవరుసం గ్రమమున మనములగురువిరహ మింత మఱుఁగువడంగా. 49

వ. ఆ శీలవతీ శివశర్మలు తమ గురుజనమ్ములు చెప్పినటుల వర్తించుచు 50

మ॥ తమయాచారము మేరమీఱక, గృహస్థశ్రేష్ఠులై వారలు
త్తమదాంపత్యవిభూషితుల్ మెలఁగి రంతం గొంతకాలమ్మునన్
బ్రమదారత్నము పుణ్యగర్భము ఫలింపం బోఁగి నీలాభ్రియు
క్తములయ్యెందరుణీస్తనమ్ములు వయోదత్వమ్మునర్ధించెనా. 51

## —♦ మూకకవిజననము ♦—

ఉ॥ మూకములయ్యె నంచపదముల్గమనమ్ముల, మించు కాకలీ
కోకిలకంఠముల్ జిలుగు కుల్కులపల్కులడంచె. నెమ్మిరా
మూఁకలపింఛముల్ విరిసె, భూవిపయోధరమధ్యమైన, యా
యాకసమొక్కటయ్యె జవరాలిమిటారి పిసాళి వేకటిన్. 52

మ॥ శరదబ్జాక్షి కుమారచంద్రమమునిన్ శైలాధిరాట్కన్యకా
కరలీలాశుకడింభ దంభపుసుపాకారుం గుణోదారునా
ర్కారునింగాంచెఁ గుమారుధీధిషణు మూకుం బుణ్యలగ్నమ్మునం
దరుదై చూడ బుధుల్గురుల్గవులు నత్యాశ్చర్యసంపాదకున్. 53

ఆ॥ వె॥ జననకాలవిహితసంస్కారముల నెల్ల సలిపిరతనికపుడు సక్రమముగఁ
గడచెఁ గొన్నినెలలు నెడనెడనా బాలు వచ్చిచూచిపోయియచ్చటచట. 54

ఆ॥వె॥ గొడ్డువీఁగఁగాంచె బిడ్డనొక్కని నేడు మూకననుచు నిరుగుపొరుగవార
లపహసింపఁ బెనిచెనా రామమంగళా కారులోకులరయఁగాకులనుచు. 55

శా॥ కామాక్షీకరుణాకటాక్షమును దక్కంగొన్న నాబిడ్డఁడే
లామూకుండగునంచుఁ జింతపడ నిల్లాలిన్మహీదేవుఁడో
వామాక్షీ! భవదుక్తి సత్యమగుచున్వర్ధిల్లు నీబాలుఁడా
కామాక్షీకృపనంచు నాసుదతి శోకమ్మింతచల్లార్చుచున్. 56

కం॥ పంకజముఖి యనుభోక్త వ్యంకర్మకృతంశుభాశుభమ్మనవినవే
శంకిల్లవలవదు నిరాతంకుండగునీసుతుఁడుబుధప్రకరమునన్. 57

కం॥ అనియిట్లు పెక్కువిధముల మనస్వియాతండు దేర్చి మానినిఁబలుకుల్
వినుచువసంతముకొఱకై వనప్రియకుమారుఁబోలి బాలుఁడు పెరిగెన్. 58

గీ॥ ఎన్నియేఁగెను గ్రీష్మమ్ములెన్నియేఁగె, వానకారులు వెన్నెలసీనుకారు
లెన్నియేఁగిన మృదుసూక్తు లిచ్చిపెనుచు, జాణయామని వచ్చెడిజాడలేదు. 59

సీ॥ పలుకఁగానుంకించుఁ బలుకనేరఁడుగాని పలికినపలుకులభావమెఱుఁగు
భావమ్మెఱిఁగిదానిఁ బలువన్నెచిన్నెల గనపర్చఁగన్నులఁగట్టినట్లు
చూచినవింతవస్తులలోనఁగలిగిన సూక్ష్మభావమ్మనచ్చుగగ్రహించు
విన్నకన్నదియెంతవింత దేయగుఁగాక మఱచుటయెన్నండు నెఱుఁగఁడతఁడు
గీ॥ పలుకుబడులును విపులునుగలుగనట్టి యాదికాలమ్మువాఁడొగాకభినయమ్ము
సరణిసకలమ్ముఁగనునటాచార్యుఁడొక్కొ యనుచుఁదలఁపించెజనులనా
యర్భకుండు. 60

కం॥ మౌనవ్రతుఁడగుబ్రహ్మజ్ఞానియొకండిటులవచ్చెనాయనిపింపం
గానెవ్వరుమూకుండనఁ గానేరరువానిరూపుగనుగొనువారల్. 61

కం॥ వినయమ్మునయముఁ గానమును సునిశితమగుబుద్ధిరూపసుందరభావ
మ్మును నాజననీజనకుల దినమునకొకవింతవగపు తెగులునొడిచెన్.                62

కం॥ ఉపనీతుఁ జేసి కొమరుని నుపనయముం జేయువానికూహించు నెడన్
విపరీతకాలమున మాం త్రిపితలునొకమాటె కాలధర్మమునందన్.                63

కం॥ వందురుహెందముతోడం బొందుగ వ్రత్యక్రియలనడపె మూకుఁడ ధరణీ
బృందారకబృందారక బృందమ్ములుసంతసిల్లఁ బ్రభుతరభక్తిన్.                64

గీ॥ అతిథిపూజనమభ్యాగతార్చనమ్ము నన్నదానమ్ముదీనవగ్యాంధజనుల
పోషణమ్మును దేవతాపూజనమ్ము నడపెనాతండుతనతండ్రినాఁటఁబోలె.                65

వ॥ ఇవ్విధమ్మునఁ బెక్కుశరత్సమయమ్ములు గడచుటయు నా మూకబాలకుండు
జననాంతరసంస్కారవిశేషమ్మున                66

కం॥ దానములఁ బెద్ద విద్యాదానము సేయంగఁదలచి తాఁగుందుచు, లో
లోనన్, భవానికరుణన్ దీనినిసాధింతుననుచు దృఢనిశ్చయుఁడై.                67

చం॥ కలధనమెల్ల నావటుశిఖామణి పేదలకన్నసత్రముల్
నిలుపఁగఁ బండితేంద్రులవనీపకు కాచుఁగలార్ధికోటులన్
దెలుపఁగ వెచ్చపెట్టి యవినిందితమాధుకరప్రవృత్తి చే
వలిమలముద్దుపట్టిని భవానిభజించెజగత్కుటుంబినిన్.                68

ఉ॥ పుట్టకమున్న దాగెలిచె మూఁకుఁడ వాకునుగర్మశుద్ధితోఁ
బుట్టినయట్టిదా మనము, బుద్ధియుఁజిత్తమహంకృతింగడున్
బెట్టనిబంటులై కొలువనిర్మధి తేంద్రియుఁడైనవాని న
ట్టెట్టన రాకయుండెను మునీంద్రులకైనమహాత్వసంపదన్.                69

ఉ॥ వెఱ్ఱియితండుగాక యటుపెక్కుతరమ్ములఁగూరుచుండియే
జిఱ్ఱునఁజేదపుండఁ దినఁజెల్లినఁజెల్లని మొల్లమిల్లనా
వెఱ్ఱులకిచ్చి పొట్టకయి వేగుచుఁదూఁగుచు నెట్టులెట్టులోఁ
బుఱ్ఱెయొకండుదెచ్చికొనిపోయని మూఁకహసింతురవ్వరిన్. 70

వ॥ మఱియు నతని తల్లిదండ్రులందలంచి యంతకింతయయ్యోగదాయని పలువురు పలుతెఱంగుల పలంచుచుందురు. 71

గీ॥ వస్తువిజ్ఞానపూర్ణుఁడౌ వాఁడునొకటఁ బిచ్చివాఁడగు నగుఁగాకఁబిచ్చగాఁడు
రాలుఱప్పలగని లోనిరత్నశిలను గాజుముక్కనివిడువ నేఘనతతఱిఁగె. 72

సీ॥ తెలవాఱఁగాఁదీఁడుతొలికోడికూయుచో నలకంపలోఁదానమాడుటకును
స్నానమ్ముతోననుష్ఠానమ్ము నెఱవేర్చి యేకామ్రవిభురాణి యిల్లుసొచ్చు
నాయమ్మ గుడియూడ్చి యచటఁశుభ్రము సేయుఁ బూవుబుత్తులఁగూర్చుఁబూజకొఱకు
నడినెత్తి ప్రొద్దెక్కినంగాని గుడివీడి వెడలఁడే నాఁడును బిచ్చమునకు

గీ॥ బెట్టినను బెట్టకున్న నేపట్టునందు నయిదుగృహములుదాటిపైనడుగఁబోఁడు
రెప్పవాల్పనినిష్ఠతోఁ రేఁబవళ్లు నమ్మవారినిఁజింతించు నెమ్మనమున. 73

గీ॥ అమలమును నిశ్చలముదనయాత్మయందు నిలిచిజగములతల్లిదండ్రులనుచరింప
నాఁకలియుడప్పి మఱచియామూఁడుఁబొక్క వేళఁబిచ్చమ్మునకుఁగూడ వెడలఁ
బోఁడు. 74

చ॥ ఇటుచనెఁబెక్కుకాలము మహీసురసూరియు డెందమందు ము
చ్చటపడుచుండు నాకడుపుచల్లనితల్లికి ముద్దుబిడ్డఁడై
పటుతరసాహితీవ్రచనపాటవమందును గానరీతులన్
నటనలవిఘ్ననాథు, శిఖినాథుని, నందిని, భృంగిఁబోలఁగా. 75

గీ అఖిలజనయిత్రి కామాక్షి కభవునకును బ్రియముకలహమ్ముగలిగినపట్టులందు
సాక్షియాతండుపలుకఁగాఁజాలకున్న వానిభాగ్యమ్ముజెప్పఁగావలనుగాదు. 76

ఉ॥ అంతటవచ్చెనామహిషహంత్రిణిగొల్వఁగ, శారదేందిరా
కాంతవిహారహర్మ్యము వికస్వరపద్మనిశాంతముం దదా
నీంతనతన్మహీరుచిత్రణీకృతనవ్యవసంతభాగ్యసి
ద్ధాంతము, సౌఖ్యదమ్మగళదంబుకమై శరదంబు కాంతమై. 77

—※ శ్రీకామాక్షీశివుల సంవాదము ※—

కం॥ ఆ శారదనవరాత్రశ్రీశుంభద్వాసరముల శ్రీమాతకు గౌ
రీశున కేకాంతమ్మన నాశంస్యము వాదుపుట్టె ననివార్యమ్మై 78

కం॥ ఏకామ్రఫలము గొనఁగే లీకాననమందుఁదిరుగులీలాశుకమే
దీ కానరాదయిపుడెటు నో కామినిమూఁగనోము నోచెనె చెపుమా. 79

ఆ॥వె॥ గట్టుపట్టువాడగాననుకొంటివో, గట్టుపట్టి! విడువగట్టిపట్టు
వలచి పలుకరింపఁబలుకె బంగారమా, పలుకుచిలుకపలుకుతొలకరింప. 80

ఆ॥వె॥ అబలచూడ దేలయుమలముక్తాహార, మదిగొచిక్కి పదములంటఁబడియె
నరసి కేలబట్టి యముక్తమైనయాహారముగను హృదయమవధరింపు. 81

మ॥ అటుగాదేని, పయోరుహాక్షి యిదెనీయాజ్ఞానుబద్ధుండ నీ
కుటిలభ్రూకుటి తేటగాఁగనుము, చేకూర్తుంగటీమండలీ
త్రుటదుద్యన్మణిహారముం గగనసింధుపేశణీయమ్ముగాఁ
జటులోత్తుంగపయోధరాద్రిశిఖరింజందాంకురోల్లాసిగా. 82

ఉ॥ కొంచెపుబుద్ధులేలయనుకూలుఁడఁగానొకొ యష్టమూర్తిరూ
పాంచితుఁడౌట దక్షిణసమాఖ్యయుఁజెల్లినఁజెల్లవచ్చు నీ
కాంచికిగట్టువడ్డ ననుఁగాదని యేఁటికివంకలెన్నుచుం
బెంచెదవీ వివాదమును బేరలుకం గరుణావిదూరవై. 83

మ॥ అనుచుం జెక్కుగిధమ్మిల్లంబలికి యయ్యాహార్యవృత్తిప్రమన
మ్మును దెల్పన్ శిరమామె పాదమున నామూర్ధంము కోటీరుఁ డ
ల్లన మోపెం బ్రథమాపరాధమును లెలందా నఖద్యోతిరం
గనలంబాఁకఁగఁ జంద్రమఃకిరణముల్ గంగాప్రథానమ్ముగా. 84

ఉ॥ మోపిన దత్తజించి తనపుక్కిటదమ్ముల మొక్కవ్రక్కగాఁ
«దూ», వడఁ జేసి గద్గదమధుస్రవదక్షరమంజుళధ్వని
శ్రీపరిపాటిఁ దోనఁ జెమరించిన కేల్గవ నెత్తి మ్రొక్కి రా
రాపిళులాడు చనవసరమ్మను బయ్యెదనొత్తి దిద్దుచున్. 85

ఉ। చాలును జాలు మీదుసరసమ్ములి నెక్కడి వింత చేఁతలీ
వాలక మెల్ల నాసరులవంకలు దిద్దెడి వేళఁ బోలినం
బోలఁగ వచ్చునో పరమపూరుష యీసడినాకుఁ గట్టఁగా
నేలొకొ మీ మనఃప్రియము లెవ్వరుగాదన నేర్తు రింతకున్. 86

చ। అనుట మునీశుఁ డిట్లనియె నంగన నీతుదినాల్క మాటలన్
విని భ్రమ జెందు వేళ గడ వెల్లెను జమ్మటుకాక యిద్దినీ
కనభిమతంబయేని తగ వాడినయిద్దఱిలోన నొక్కరిం
గినిసి శపింప నేల పరికించిన నిర్వురు దోషులే గదా. 87

వ॥ అనుటయు భ్రుకుటీసమాకుంచనసూచితరోషవేపదరుణితకపోలసుందరవద
దనమ్మునం జిఱునగవు మెఱయఁ బరుసనిచూపుల నా గంగాభుజగుం గటాక్షించుచు. 88

చ। అవునిది లెస్సమాటయె గయాళితనమ్ముగ గండు చిల్కత
ప్పవునసిలో నెఱింగియు శుకాంగన వంతలు మాయలాడి దా
దివిచెను మత్ప్రసంగమది, తిట్టిన దిద్దినఁ బోవు దోసమే
మవినయశీలుఁడా ఫలము నందక యుండునే యంచు, గౌరియున్. 89

చ॥ పలికిన నవ్వియొందుఁ బోరఁ బాటొనరించిన వారలొక్కొర
వ్వలఁ దగఁ దత్ఫలమ్ముఁ గలవారమ యొక్కరుమైరిగాదె నీ
పలుకులఁ జిందు దేనెచలువల్ శుకబాలిక పాలి పెక్కునో
ములతోలి వంట తత్ప్రియుని పొత్తు విడంబడఁ జేయనయ్యెనే. 90

చ॥ అనవుడు నాథుఁ జూచి తుహినాచలబాలిక నేను బెంచి ది
ద్దిన శుకడింభకమ్ము తెగ తెంపున వర్తిలినందు కియ్యెడన్
వసరునుగాక దానిఁ బరవర్ణిని దానొకవర్ణియై భువిన్
వసరునుగాక మూఁగయయి ప్రాక్తనవర్తనమెల్ల మాయఁగా. 91

ఉ॥ నావినిశంకరుండు లలనా! మగనాలి, భర్తతో
నావలఁ దోఁచె దంగనవు న్యాయ్యమె నీకిది యౌనుగాక నే
నావరివర్ణినిం బెనుపనా! యిదె దానికి నిన్ను వేడెదన్
కేవలముం దయార్ద్రమగు నిర్మలదృష్టి ననుగ్రహింపుమా. 92

వ॥ అని పలువిధముల నొప్పించినను బట్టువిడక. 93

ఉ। తప్పదు నాదుమాట వితథమ్మ యనన్ సతి యీశ్వరుండునన్
తప్పదు నీదుమాట వితథమ్మయటంచును మూఁదలించి వాఁ
డెప్పటికేని నీదయనె యిచ్చటికిం జనుదెంచు చూడుమా
యిప్పటికయ్యెఁ గాక సహియింతువె తద్విరహమ్ము కింతయున్. 94

కం॥ బింబాధరోష్ఠి కనుమీ, బింబాశనురిత్త నీవు వేఁగింపక నీ
తాంబూలష్ఠీవనమా, బింబాశికి నిచ్చుఁ బోంటివిద్యల నెల్లన్. 95

చ॥ ఇది ప్రథమాపరాధమని యెంతయు భక్తిని నిన్ను వేడ నా
యెడనను స్నైఁవవైతివిగదా! కుటిలాలక నీమురూపసం

పద వచియించి మూఁగయగువాఁడిదె నేఁడును నీమరూపసం
పద వచియించి సర్వకవివందితుఁడై తనతావుచేరుతన్. 96

కం॥ అది తమయపదానమ్మును, దనచెలులట నాడ విజయుదశోమినిగొలువై
కనుచుండమూకుఁడు జిగ జ్జననింగ నెఫలితసుకృతసంస్కారమునన్. 97

ఉ॥ ఆసమయమ్మునందొక శుకాంగన యాసతిపాదపల్లవ.
శ్రీసవిధమ్మునంబడివచించె. జిలుంగు నెలుంగు రాల్పడన్
జేసినసాహసమ్ము ఫలశేషముడి ద ననుగ్రహించి నీ
దాసిఁగృతాపరాధ నిఁకఁ దల్లి! ప్రియున్ ఘటియించి యేలవే. 98

ఉ। ఎల్లవిధమ్ములంగొలువ నింతగడిద్దితి. విద్దెలన్నియుం
జల్లనితల్లి మీఁదుపరసమ్ములఁదీర్పులు దిద్దనింతగాఁ
జెల్లుబడిన్ ఘటించి దయసేసితి పక్షుల మమ్ము నేఁడు గా
సిల్లఁగఁజేము నీమనసు చెల్లునె నిక్కము చెప్పుమంబికా! 99

ఉ। ఎల్లజగమ్ముమీకునొక నింతలువంతలు నాటవస్తువై
చెల్లఁగ నొక్కపక్షియట చెసెనిపో పొరపాటు దానిఁగో
పిల్లగనేల మీ చదువఁబెట్టినపల్కులు పల్కదో సమా
పిల్లలతప్పిదమ్ములవి పెద్దలఁజెందునొ జెందనేరవో. 100

ఉ॥ ఎన్నిమహాత్వముల్గనిన హీనికులుల్ పొరపాటుసేయరో
చిన్నతనంపుఁజేష్టలివి చెల్లునటంచును బ్రోవనేరవో
యిన్నిదినాలకూర్మిగణియింపవో, మాపదుకష్టపాటు నీ
కన్నులగానవో తఱియు గాదొకో మమ్మననుగ్రహింపఁగా. 101

కం। మీయొంగిలిఁదినిబ్రతికిన; మాయొనరుచుదప్పులెల్ల మన్నింపవె మా
కీయెడబాటు దొలంగం; జేయవె, మముఁగన్నతల్లి శివతనువల్లీ. 102

కం॥ మీరిడుమహాత్మ్యసంపద; మీరూపమె దాల్చి మేము మెలఁగుటతీజం
గా రాని దోసమగునే సౌ రా మీరూపుకాని యదియొకదున్నె. 103

శా॥ దోసమ్మేయగుఁగాక యద్దియు మహాదుష్టాత్మ్యలంబట్టి కా
రాసంబద్ధులఁజేసియు న్వికుపరే రాజేశ్వరు ల్వారి యు
ల్లాసమ్ముల్ ఘటియిల్లువేళ బ్రిజలెల్లంబేర్మిఁ బెంపొందఁగా
నాసంప్రార్థనమింతమాత్రమయిన న్మన్నింపు రాజేశ్వరీ, 104

గీ॥ చిలుకపలుకులుపరికింపఁ బలుకుఁగాక; సహజ భావలఁదెలుపంగజాణయగునె
యనుచు నెంచెదో మీపెంచినట్టికవుల; పలుకులందురు భావమ్ము వెలితిపడునె, 105

చ॥ అనునెడ గట్టుబిడ్డమనమల్లఁగరంగె నవర్ణచిత్రమౌ
ననిచెను గాలికాననమున న్గలువ ల్వికసించెఁ, జండిమో
మున భ్రమరమ్ము లొక్కమొగి మూఁకలుగా విరియంగనింక మా
కునకట వాక్యసంపదలొకో ఘటియిల్లని పట్టివేళలన్. 106

కం॥ అది కాంచిమూకుఁడిఁకఁదన; ముదితను,గొన,గనఁగనయ్యె ముదితమతిసతీ
వదనాభ్యుదితమ్మగు త; మిఁదగందానొక్క గుర్క్కమిర్గెడు వేడ్కన్. 107

ఉత్సాహము:— అల్లనల్ల నగిరి యొగిరి యమ్మవారిచేతిలో
నుల్లసిల్లుఫలముగొనఁగ నూహసేయునొక్కటన్
మెల్లమెల్ల వ్రాలికొ లక్షమింప వేడఁగోరుఁ దా
నుల్లసిలుశుకాంగన బ్రియోక్తులందెమల్పగా. 108

శా॥ ఆలోకన్నగిరిజాత జాతకరుణార్ద్రాపాంగవీక్షావళిన్
జాల న్వారల దప్పుగాచుటలు విస్పష్టమ్ముగావించి త
న్మూలక్రోధముపీడె నాఁగఁదములంపుంజిల్కలంబూని, తాం
బూలస్వీకసమాచరించి పలికెం బోచున్నకోపమ్మునన్. 109

శా॥ మా రూపమ్ములు దాల్చి దోస మొకటా మామాటలం బల్కుచున్
మీ రంతఃపురచక్రవర్తులయిన న్మేమేలమిమ్మేలగాన్
గారాకూరములింత సేసి పిదప న్రక్షింప నర్థింతురే
నేరమ్ముల్ సయిరింప మీరు మఱి యే నేరమ్ము గావింపరో. 110

వ॥ అను నా సమయమ్మున. 111

—※ మూకుఁడు మహాకవియగుట ※—

ఉ॥ పుక్కిట తమ్ములమ్ము మియు ప్రొద్దునకై యట వేచి యుండుటన్
గ్రక్కున మ్రింగి దానిఁ ద్రిజగజ్జనని ప్రసాదభక్షణన్
దక్కిన సాహితీచతురతా కవితా గురుతా ప్రభావముల్
పిక్కటిలంగ మూకుఁడు కవిప్రవరుఁడయి మోష్ప చేకులన్. 112

కం॥ క్షమియింపఁగదవె తల్లీ; కుమారు నార్ద్రాపరాధుఁ గోమలవీక్షా
క్రమమున నమస్కరించిన; శమియించునుగాదె దాసజనదోషమ్ముల్. 113

ఉ॥ మించిన ప్రేముడిన్ శిరసుమీఁదనుగంగ ఘటించుతప్పునన్
గాంచికి గట్టువడ్డ త్రిజగత్పతి పాదములంటి వేడఁగాఁ
గంచుకమున్ సడల్చి పులకం గిలికించితమూర్తి దాఁ బటా
పంచలు సేయు మూకకవిపావము కోరికపీరి కెత్తఁగా. 114

చ॥ కనుఁగొని పార్వతీప్రణయగాథల నామె యనుగ్రహమ్మునన్
దనరుట నట్టిరూపములు దాలిచియుంతిటఁ దత్ప్రసంగముల్
చనువునఁ జేయు నా చిలుకజంటను గన్గొని సిగ్గుదోసమున్
మునుకొన ధాత్రినందొకరి మూకునిఁ జేసినతల్లి ప్రోచుతన్. 115

చ॥ తన యిడునట్టి పీఠియము తన్మ్నగ్రసించి యశేషవిద్యలన్
కొనుటనునట్టి తమ్మదినఁగూడిన నా ప్రణయప్రసంగముల్
వినిచిననొంటి బుద్ధియు వివేకముగల్గ ననుగ్రహించునా
ధునిమది మెచ్చిమెచ్చనివఘూమణి మమ్ము ననుగ్రహించుతన్. 116

చ॥ ప్రియు నెడబాసి దుఃఖపడు పెంపుసుచిల్కనుఁ దోడిసీకమై
ప్రియునమజిల్కఁకై తనకుఁబెట్టగనా కలహమ్ముదిద్దఁగా
నయమిడిపోవనిండు కొలువై శుకకాంతవిలాపమెంతయున్
దయవినుతల్లి మా కొసఁగుతన్ బహుశార్ధములిష్టసిద్ధులున్. 117

మ॥ అని మూకుండు స్తుతించున య్యెడల "నేలా వీరినీరీతి నిం
కనుగారింప" నటన్న పల్కు మునుగాఁగన్పట్టెఁ బేరోలగ
మ్మున శంభుండు నగేంద్రపుత్రి ధవునింబూజించి సింహాసన
మ్మున నర్ధాసనసంస్థితిన్నిలిచి చూపుల్ చిందసింగారముల్. 118

మ॥ మునుమాటాడినవారలెవ్వరో గడుంబూజ్యాల్ నుఁడీ నేఁడుగాఁ
గనుగొంటిన్నిజమమ్మనంగ నగుచుం గామాక్షియీయున్నవా
రిని నీ యావ్రణయప్రసంగముల సంప్రీతిం బ్రబోధించువా
రినిఁబ్రశ్నింప నిజమ్మదేలునని తర్కించెన్ శివుండంతటన్ 119

కం॥ కామాక్షి నగుచు మూకస్వామిని గని వత్సమీతు జయము బ్బెను వీ
సామి యిదు నాజ్ఞ నెఱపెద వో; మా నెవా కాళన కునొకసడియేలా, 120

కం॥ అనవినిశంభుఁడు వత్సా మునునీగృహలక్ష్మికీవు ముచ్చటపడి చె
ప్పినయది పలుకుము యిది మీ; జననికి నెమ్మనమునందు సమ్మతమనినన్. 121

క॥ శిష్యులకును మెప్పొక్కి యాసభ; చెవులొక్కటి చేసి వినఁగఁ జిలుక చెలువయా
శివురాణిఁ జేరికన్నం; గవ బెదరులు సిగ్గుచిలుకఁగా వినుమండ్. 122

క॥ పంచశతశ్లోకిని గవి; కాంచనగర్భుండు నొడువఁగాఁ గడు మెచ్చెన్
బంచాస్యుఁడు కామాక్షియుఁ; గాంచియు నెక్కమూకుఁ బేర్మిఁ గడలుకొనంగా. 123

క॥ ఈనీస్తుతి విను వారల; కేనిచ్చెద నల్లశుభము లెడసేయకిఁక నా
నానాకవిబుధవిజయ; శ్రీనాథుఁడవగుచు యమ్ముఁ జేరుమ యనుచున్. 124

క॥ కన మొలఁగెనంత నాసభ; కనువిచ్చుచు మూకుఁ డెదుటఁ గనుఁగొనె విద్వ
జ్జనముల జనముల వినయ; మ్మునఁ గేలుఘటించి ఫాలమున నిలువంగా. 125

సీ॥ ఒకమాఱు పతియింపు మోస్వామి, తరియింతు; మని యెడు కవిపండితనివహమ్ము
కామాక్షి నీరూపుఁ గైకొనె మూకునా; చార్యుండనను మంత్రిశాస్త్రవిదులు
పుంభారతీ! గానమును దిద్దుమమ్మెలు; మను గాయనీగాయనావళియును
నింత వాఁడవటంచు నెఱుఁగము మా తప్పు; క్షమియింపుడను పౌరజనము గలిగి

గీ॥ చుట్టునిలిచిన వారలఁ జూచి యతఁడు; తల్లి కామాక్షి మహిమ యింతయు నిజమ్ము
నేడ మూకుఁడనే నేఁడ యిట్టిశక్తి; యేడ మాతల్లిదయతోడ నేలకున్న. 126

క॥ అనిపలికి సముచితమ్ముగ; జనముల వీడ్కొనుచుఁ గాంచి జనులొనరుచు మ
న్ననఁ గొని విద్వద్విజయ; మ్మొనరువ దిగ్విజయయాత్రికుత్సుకమతియై. 127

వ॥ కతిపయచ్ఛాత్రసమేతుండై వెడలి యతం డా పురము వారలు దనవలనఁ దన పూర్వవిషయమ్ము నెఱింగి యబ్బురపడుచుఁ దన తల్లిదండ్రుల పుణ్యవిశేషమ్ము నుగ్గడించుచు విడువనేరక యెట్టకేనియు దన్ను వీడ్కొలిపినం జని కొన్ని వసంతమ్ములకుం దన కవితాప్రాగల్భ్య పాఠనమ్ముల భ్యుత్థానవచనమ్ములుగా నెయ్యకోలు సేసిన కాంచీనివాసుల స్వాగతమ్ము నందికొనుచు 128

కం॥ తనకవితకీర్తియును దన; మునుగానతఁ జెల్ల దేశములఁబండితులున్
దనశిష్యులగుచుఁ గొలువం; జనుదెంచెనుగాంచిపురికి జయసహితుండై. 129

ఉ॥ వచ్చియతండు భక్తిని భవానికి మ్రొక్కుచు నమ్మ నీవు రాఁ
డిచ్చినదీవెనన్ జగమునెల్ల జయించితి నింకభూమిపై
నిచ్ఛయులేదు నీపదము నెన్నఁడుచేరఁగ భాగ్యమబ్బునో
మచ్చిక తెల్పి నీ శుకకుమారుని నన్ను ననుగ్రహింపుమా. 130

— ※ మూకమహాకవి దేవిసన్నిధిం జేరుట ※ —

కం॥ మూకుఁడను జటులమర్గతి; శ్లోకుఁడనగునన్ను సకలసుకవిస్తుత్య
శ్లోకునిఁ జేసినతల్లీ; నీకిదె కైమోడ్పు శ్రితవినిద్రకటాక్షా. 131

శా॥ శ్రీపుంసాద్వయరూపమై వెలుఁగునన్ సింగారముల్ చూపు నీ
చూపుంబ్రోవఁగ నొన్న మూఁగ చతురాస్యుండై బుధారాధ్యుఁడై
ప్రాపించున్ సుకవిప్రభుత్వమును శుంభన్మోక్షలక్ష్మీవిభుం
డై పాటించుఁ బరత్రయమ్ము పనిషద్వ్యాఖ్యానచిన్ముద్రలన్. 132

కం॥ ధనపతిమిత్రుండగు టొక; ఘనమా యణిమాదిసిద్ధి గను టొకఘనమా
నిను మానసమున నిలిపిన; మునుబోయుండఖిలదేవముఖ్యుండనఁగా. 133

సీ॥ బహుళాంధకారవిధ్వంసనప్రక్రియా; భాస్కరమ్ములు నీదు పాదరుచులు
బహ్వలోకజీవనౌషధములు ఫలియించు; నమృతమయూఖులు నీదు హాసరుచులు
పశ్యదళీకాగ్ని భస్మీకృతాంగజ; ప్రాణౌషధులు నీదు పాదరుచులు
రాగదూరదిగంబరమనోనురాగోపదేశకమ్ములు నీదు దేహరుచులు

గీ॥ బహుళపుణ్యపరీపాకపరిచయమెక; లభ్యములు నీకటాక్షవాల్లభ్యములు గ
దమ్మ నీకయి కావించునర్చనములు; ముక్తిమంటపసోపానములుగదమ్మ. 134

సీ॥ నటవారటన్మహాసటజటాజూటక; త్రుటినీతరంగమితృమ్మలగుచుఁ
గాదివేదోశ్వరగ్రైవేయకంఠ హా; రావళీరత్నహారాళియగుచు
వేదనూపురముక్తివేశ్మపాదద్వయీ; నాళీకపరమహంసాళియగుచుఁ
బుష్పవన్నయనసంఫుల్లాస్యనవమధు; వశ్యతోహారకృతబాంధవములు

గీ॥ నగుచు నన్యోన్యమును నీకటాక్షరుచులు; హాసరేఖావిలాసమ్మలస్మదీయ
రాకవరిభూతహృదయవరాగమడఁచి; పోచుఁగావుతబంధవిముక్తినొసఁగి. 135

కం॥ ఝరులై సరులై విరులై; శిరముర చునఁగరమునందు శివునకునలరెా
గురులైమరులైయురులై; పురుడయ్యెనునీకటాక్షములు నగవులకుఁ. 136

కం॥ కలమృదుపదముల,వినినీ; గళపంజరమందునుండి కైకొనఁజిలుకఁ
వలరాచవాఁడు పన్నినః దలబింబమెకాని నీదు నధరమె తల్లీ. 137

శా॥ నీవేతల్లివి నిన్ననమ్మిరొలంతు న్నీచేతవర్ధిల్లితిఁ
నీవాల్లభ్యముకై యజింతు జగముల్ నీవల్లనా నీకునీ
డౌవారెవ్వరు నాదుసర్వమును నీయందర్పణంజేసెదఁ
భావమ్మందులనిల్పిపోవగదవంబా నన్నుఁగాంచీశ్వరీ. 138

కం॥ ఏకామ్రభాగధేయు; మ్మేకమ్మరుణారుణమ్మ నీదృశతేజ
మ్మానల్పముకాంచీనగ; రీ కళ్యాణమ్మ మాకరిందము మగుతల్లీ. 139

మ॥ కమలాంధకకరసౌషధీగ్రధితజాగ్రన్మూర్ధసౌభాగ్యముఁ
కమలాకోటినిషేవ్యమానవిలసత్కల్యాణపాదాబ్జముఁ

కమలామోదముఁ గామితప్రదము శ్రీకాంచీనివాసమ్ము మూ
కమనీషీకృతి దక్షమంజులకటాక్షమ్మున్ బ్రణామించెదన్. 140

గీ॥ చలువలు వెలిఁజిమ్మెడు నలఁ; గలువలచేఁ గమ్మతావి కమలమ్ములచే
మెలమెల్ల మెలఁగునమ్మలి; గల చల్లనిచూపుచేతగను మాతల్లీ. 141

మ॥ చిరకాలమ్మయి పీడివచ్చితిని నాచింతామణీరత్నవం
జరబంధమ్మును డిందఁజేయుమిఁక నిస్సారమ్ము నీయస్థి వం
జరబంధమ్మును దల్లి నాదగు సమాచారమ్ము వేఱైనఁ దె
త్తురో వాకృత్తుకో యెన్నడేని మనమందు న్నన్నుఁజింతింతురో. 142

మ॥ అనియీరీతినుతించి మూకకవి కామాక్షీ కృపాసంగతిన్
గనియెం దొంటిపదమ్ము పావనయశః కాయప్రశస్తుల్ గనన్
మినుముట్టన్ శుకసార్వభౌముఁడగుచున్ మిన్నంది యాయమ్మచే
తను వ్రాలెం బ్రియమంది యాశుకియుఁ జెంతన్ వ్రాలఁ గూపెట్టుచున్. 143

కం॥ కామాక్షికి నేకామ్ర; స్వామికి నేకాంతమందుఁ బ్రణయములందున్
దామధ్యవర్తియయి ప్రియ; తో మూకకవీంద్రుఁ డిష్టతుష్టులఁజెలఁగున్. 144

కం॥ మూకని చరిత్ర విన్నను
మూకుని కవనమ్ము విన్న ముదమంది యశ
శ్శ్రీకళ్యాణ సమృద్ధులఁ
జేకూర్తురు కాంచివిభులు శ్రితవత్సలురై 145

మ॥ కలుగండింతకుముందొకండును భవత్కల్పుండు మార్తండశ్రే వు
ణ్యులు సాహిత్యకవిత్వపీఠమున దారోద్దోలగమ్మున్న యా

తొలిపుణ్యాత్ముల యుష్మదీయకరుణాద్యోవాహినీతీరమం
జుళసంతానఫలమ్మనంది కొనుమీ సువ్యక్తమాధుర్యముల్. 146

కం॥ శంకరసువర్ణహారిముఖ; కంకణ; పదవినతసూర్యకాంతావదనా
లంకారకుంకుమాంకిత; పంకేరుహసదృశచరణ భవహరణచణా. 147

వంశస్థము॥ సువర్ణరుద్రాక్షవిశోభికుండలా
భవార్ణవోత్తారణపాదమండలా
కవీంద్రసంభావితకావ్యమండలా
నవావతారాయితనాగకుండలా. 148

మ॥ పరిపూతాత్మ సతీవినిశ్చితకృతిప్రారంభసంభావనా
పరిణాహస్ఫురదంతరాళజననప్రఖ్యాతకాంచీపురీ
శ్వరమాహాత్మ్యమునందు నెన్మిదవు నాశ్వాసమ్ము నిక్కావ్యముల్
గరుణంజూచుత శంకరుండు స్వశిరఃకల్యాణగంగాకృతిన్. 149



# తప్పొప్పుల పట్టిక.

| పేజి | పద్య. | తప్పు | ఒప్పు. | పేజి | పద్య. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౧ | శ్రేష్టుండు | శ్రేష్ఠుండు | ౪ | ౯౧ | విర్యావాకా | నిర్యాహాకు |
| | | జ్యోత్స్నలన్ | జ్యోత్స్నలన్ | | ౯౩ | నికని | నిడని |
| ౨ | ౮ | స్వాధీ | సాక్షీ | | | వినయమిత | వినయనమిత |
| | ౯ | మూర్తి భక్తి | మూర్త భక్తి | | | కలంగవ | కలుంగవ |
| | ౧౦ | మాలించుచూచీ | మాలించూచీ | | ౯౪ | యలట్టు | యట్టుల |
| ౪ | ౧౬ | యద్వాద్వతిశ | యత్వాద్వతిశ | ౫ | ౯౬ | సన్మహావధీ | సన్మహావధీ |
| ౫ | ౨౫ | రాద్భూవణ | రాద్భూవణ | ౬ | ౧౦౦ | గానవిచటు | గానవిచెటు |
| ౬ | ౩౪ | లక్ష్మీదాక్షిణ్య | లక్ష్మీదాక్షిణ్య | | ౧౦౪ | ప్రిపధానికా | ప్రిమధానీకా |
| ౧ | ౩ | శ్రీకాంచి | శ్రీకాంచీ | ౭ | ౧౦౮ | దామోఱ | నామొఱ |
| ౨ | ౮ | పదాబ్జాళుశ | పదాబ్జాతుశ | | ౧౧౧ | వహించు | వహియించు |
| | ౧౫ | యయ్యొను | మయ్యొను | ౮ | ౧౧౭ | మప్పడు | మప్పడ |
| ౪ | ౬౩ | దేశగాత్రము | దేశకోత్రము | | ౧౧౯ | డిక్షించెశ | డీక్షించెశ |
| ౫ | ౩౦ | చేహాం | బేహారి | ౯ | ౧౨౪ | వైచునుకా | వైచునురకా |
| | ౩౧ | తోడ | తోడ | ౧౧ | ౧౩౪ | దర్శనమున | దర్శనమ్మున |
| | | నెట్టిని | నెట్టని | ౧౨ | ౧౩౬ | నసునో | నసుశ |
| ౬ | ౩౬ | రసతిత్వ | రపతిత్వ | ౧౩ | ౧౪౨ | నతండుశ | నతడుశ |
| ౭ | ౩౮ | కవిశాది | కవిశాతి | | ౧౪౩ | గరాకదనంబుల | గధాకధనంబున |
| | ౪౧ | శేయదోసంగు వెసగా | నేయదోసంగు లెసగవే | | ౧౪౪ | వాల్లఖ్యా | వాల్లభ్యా |
| ౮ | ౪౭ | మహాత్మ్య | మాహాత్మ్య | | | దను వెడ | దను వేడ |
| | ౪౯ | కాకార్జున | కార్జున | | ౧౪౬ | మందాదిరి | మంధాదిరి |
| ౯ | ౫౧ | కుపీనుని | కులీనుని | | | దూలెన్నను | దూలెన్నన్న |
| | ౫౬ | వంసంతత | సంతత | ౧౪ | ౧౪౭ | వక్షేణమోక్ష | నక్షీణమోక్ష |
| | ౫౭ | తొల్లిసి | తొల్లన | | ౧౪౮ | గణింపగ | గణియింపగ |
| ౧౦ | ౬౧ | చిత్తముశరంజిల | చిత్తమ్మున్రంజిల | | ౧౪౯ | సంతాపము | సంతానము |
| | ౬౩ | మహేంద్రి | మహీంద్రి | ౧౫ | ౧౫౫ | కవి | కలి |
| ౨ | ౭౬ | యొందుశ | యొందనశ | | ౧౫౭ | క్రియఘన | క్రియాఘన |
| ౩ | ౮౩ | కాటతుండై | కాటతుండై | ౧౬ | ౧౫౯ | వేళన్నము | వేళన్నము |
| | | | | | ౧౬౦ | చక్షుశ్రుతి | చక్షుశ్శ్రుతి |

| పేజి | పద్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౧౬ | ౧౭౬ | జల్లబు | జిల్లలు |
| | ౧౫౯ | నిలుఁదే | నిలుఁడీ |
| | ,, | గళుకు | దళుకు |
| ౧౧౮ | ౧౬౧ | చూఁఱ వెట్టి | చూఱవెట్టె |
| | ౧౬౪ | శేఖ దూఁకే | శేఖందూఁకె |
| ౧౧౭ | ౧౬౫ | డేవంబోవక | డీవంబోవక |
| ౧౯ | ౧౬౭ | కందెకరముల్ | కందెఁగరముల్ |
| | ,, | మోపెత | మోమెంత |
| ౧౧౯ | ౧౨౩ | యయనివమ్మ | యనియిమ్మ |
| ౧౨౦ | ౧౬౯ | యెట్టిదయని | యట్టిదయని |
| | ౧౭౧ | సందరీ | సుంధరీ |
| ౧౨౧ | ౧౭౫ | గైకొ వుచు | గైకొనుచు |
| | ౧౯౦ | భిక్షాం దేహి | భిక్షాందేహి |
| ౧౨౨ | ౨౦౩ | నీయుల్లిదె | నీయుల్లిది |
| ౧౨౩ | ౨౧౦ | నగియెక్లైనన్ | నగియక్లైనన్ |
| | ౨౧౧ | నీసాదశె | నీసాదవె |
| ౧౨౫ | ౨౧౭ | తడని | తడవి |
| | ౨౨౦ | వెంపడిం | వెంబడిం |
| ౨౩ | ౨౧ | కంపసీలికిన్ | కంపశీలికిన్ |
| ౧౨౬ | మొదట | పంచమ ఆశ్వాసము | పంచమాశ్వాసము |
| | హెడ్డింగులో | వేదమునీశ్వరు | వేదమునీశ్వరు |
| ౧౨౮ | ౬ | ఖాతుఁడు | ఖ్యాతుఁడు |
| ౧౨౭ | ౨౨ | హైన | హైని |
| ౧౨౯ | ౩౨ | శిక్షింకుట | శిక్షించుట |
| ౧౩౨ | ౫౧ | యాయలుంక | నీయలంక |
| ౧౩౫ | ౪౪ | వృత్తచిత్తయై | చిత్తవృత్తయై |
| ౧౩౬ | ౭౩ | వేమిక | లేమిక |
| ౧౩౪ | ౯౩ | తగుబుదుల్ | తగుబుద్ధుల్ |
| ౩ | ౯౪ | ఎత | ఎంత |
| ౧౩౭ | ౯౯ | విడివడు | విడివడ |
| ౩౩ | ౧౦౦ | వారిచటన్ | వారచటన్ |
| ౩౬ | ౧౦౨ | దుషాత్మ | దుష్టాత్మ |
| ౧౩౯ | ౧౦౯ | వేపార్చ్బటల్ | వేపార్చ్బటుల్ |
| | ౧౦౮ | గవాటగ్రి | గవాటాగ్రి |
| | ౧౦౭ | చంద్రాకుఁరల్ | చంద్రాంకురల్ |
| ౧౪౦ | ౧౧౬ | శాజ్ఞమ్మ | శార్ఙ్గమ్మ |
| ౧౪౧ | ౧౨౦ | మాయజుఁడు | యాయజుఁడు |
| | ౧౨౨ | నాటు | నాటె |
| ౧౪౨ | ౧౨౫ | బర్వ్యాం | బర్హ్యాం |
| | ౧౨౬ | సర్వ్వహారము | సర్వహారము |
| ౧౪౩ | ౧౩౪ | గదెవె | గదవె |
| | ౧౩౮ | మన్నింటెం | మన్నిటిం |
| ౧౪౪ | ౧౪౩ | లక్ష్మీశ్వరుఁడు | లక్ష్మీశ్వరుండు |
| ౧౪౮ | ౧౩ | తండమ్ములన్ | తండమ్ములె |
| | ౧౬ | గలిసెన్ | గవిసెన్ |
| ౧౪౭ | ౨౨ | గిరిశ | గిశ |
| | ౨౪ | నవ్య్వ | నవ్వ |
| ౧౪౯ | ౩౩ | తానొక | తానునొక |
| ౧౫౦ | ౩౬ | తేరా | తేరా |
| ౧౫౨ | ౪౯ | యమునవినుడు | యమునవినుతు |
| ౧౫౩ | ౫౬ | యల్లనల్లశివుసా శ్రితువాటిక | యొక్క పూచినరసా లమునీడను |
| | ౫౮ | చూచిన | పూచిన |
| | ౫౭ | స్ఫురముత్త | స్ఫురదుత్త |
| ౧౫౪ | ౫౯ | మదామయు | సుధామయ |
| | ౬౦ | జవిరించె | జివురించె |
| | ౬౧ | స్మర | సర |
| | ౬౨ | జేగ్రమార్గ్రి | జేగ్రిమార్ద్రి |
| ౧౫౫ | ౬౬ | ననభమ్ము | నభమ్ము |
| ౧౫౬ | ౬౫ | మేగ్వరునెమ్మయి | మేశ్వరునెమ్మయి |
| ౧౫౭ | ౭౭ | వటుఁడుచున్నట | వటుఁడునున్నట |
| ౧౫౮ | ౬౯ | వినియుఁట | వినియుంట |
| ౧౬౦ | ౧౧౨ | పాకార | పాకర |
| | ౧౧౩ | అననవన్ | అనవన్ |
| ౧౬౧ | ౧౧౩ | బోనిత్తుపె | బోనిత్తుమె |
| | ౧౧౪ | మాధీన్ | మాధుంన్ |

| పేజి | పద్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | ౧౧౫ | కట్టుదుర | కట్టైదుర |
| | ౧౧౫ | సౌభాగ్రి | సౌభాగ్య |
| ౧౬౩ | ౧౨౭ | కటహారి | కటిఃహారి |
| ౧౬౪ | ౧౩౨ | వేల్వ్రషన్ | వేల్వ్రడెన్ |
| | ౧౩౩ | పరమేషి | పరమేష్ఠి |
| | ౧౩౪ | గ్రింహించి | గ్రహించి |
| ౧౬౫ | ౧౩౮ | యపార్వతి | యప్పార్వతి |
| ౧౬౬ | ౧౪౭ | మతిగొని | మతి గొని |
| | ,, | దరవిరి | దరలిరి |
| | ,, | కాంక్షితమవిడ | కాంక్షితమాలిడ |
| | ౧౪౯ | షితుఁదర్మిలిన్ | షితుండర్మిలిన్ |
| | ౧౫౦ | మనహర | మదనహర |
| | ౧౫౧ | రమావిభుఁడు | రమావిభుండు |
| ౧౬౮ | ౮ | పులకంచిన | ఫులకించిన |
| ౧౬౯ | ౧౮ | సతీ! నీతగునె | సతీ! తగునె |
| | ,, | వేల్పులున్ | వేల్పులన్ |
| ౧౭౨ | ౪౩ | మగుడున్ | మగుడన్ |
| ౧౭౩ | ౪౪ | పాంబల్యమ్ము | ప్రాబల్యమ్ము |
| | ౫౦ | బెడ్లిం | బేఁడ్లిం |
| ౧౭౪ | ౫౩ | సుతనై | సుతలై |
| ౧౭౫ | ౬౧ | ప్రతిష్ప | ప్రతిష్ఠ |
| | ౬౫ | శిద్ధాంత | సిద్ధాంత |
| | ౬౬ | చెందును | నెందును |
| | ౬౭ | జీకము | బకము |
| | ,, | గళమ్ము | గణమ్ము |
| ౧౭౭ | ౮౦ | శివమత్రి | శివమంత్ర |
| ౧౭౮ | ౯౬ | పేదెంచ | లేదెంచ |
| ౧౭౯ | ౧౦౦ | ననున్ | నన్నున్ |
| | ౧౦౨ | చిత్రమ్ము | చితమ్ము |
| ౧౮౦ | ౧౦౭ | రంగళ | రంగద్ |
| ౧౮౨ | ౪ | సముత్సక | సముత్సుక |
| ౧౮౩ | ౯ | యిట్లునుం | యిట్లనుం |
| ౧౮౪ | ౬ | నతికుతుకము | సతికుతుకము |
| | ౧౯ | పంచచామరము | చామరము |
| ౧౮౫ | ౨౩ | బాలుఁడునాశశి | బాలుఁడున్ శశి |
| | ,, | గ్రాలుచుబెరుగ | గ్రాలుచున్ బెరుగ |
| ౧౮౬ | ౩౩ | నీతియొసఁగుట | నీవియొసఁగుట |
| | ౩౯ | ప్రిమృతమ్మును | ప్రమృతమ్మును |
| ౧౮౭ | ౪౦ | నమృతయా | నమృతమయా |
| | ,, | సుశృతము | సుశ్రితము |
| | ,, | పలుకుడెన్నిందు | పలుకుడెన్నండు |
| | ,, | లెడల | వెడల |
| ౧౮౮ | ౫౨ | భూవి | భూమి |
| | | వేకటిన్ | వ్రేకటిన్ |
| ౧౮౯ | ౫౯ | సూక్తవిచ్చి | సూక్తలిచ్చి |
| | ౬౦ | విపులును | లిపులును |
| ౧౯౦ | ౬౩ | మాంత్రపితలు | మాత్రపితలు |
| | ౬౪ | వత్క్రియల | దత్క్రియల |
| | | మూకుఁడ | మూకుఁడు |
| | | సంతిసిల్లు | సంతసిల్ల |
| | ౬౫ | పగ్వంధ | పంగ్వంధ |
| | ౬౬ | బాలుకుఁడు | బాలకుఁడు |
| ౧౯౧ | ౭౪ | తల్లిదంద్రులును | తల్లిదండ్రులు |
| | ౭౫ | ఇటచనె | ఇటుచనె |
| ౧౯౨ | ౭౯ | యిపుడెటునో | యిపుడెటనో |
| | ౮౦ | విడువ | విడువు |
| | ౮౧ | చూడదేల | చూడవేల |
| | | యముక్తై | యవిముక్త |
| ౧౯౩ | ౮౪ | ఖవ్యోతి | ఖద్యోతి |
| | ౮౫ | చనవసరమ్ము | చన్నవసరమ్ము |
| | ౮౯ | వంతలు | సంతలు |
| | | యొందునే | యుండునె |
| ౧౯౪ | ౯౦ | లూక్కెర | లూక్కర |
| | ౯౨ | లలనా—మగనాలి | లలనాతగునామగనాలి |
| | ౯౪ | సతిఈశ్వరుండు | సతియీశ్వరుండు |
| | ౯౬ | యదనును. | యదనున |

| పేజి | పద్య. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౯౫ | ౯౩ | అది | అని |
| | | జగ | ఝగ |
| | ౯౮ | జేపిన | జేసిన |
| | | శేషముడిద | శేషము డింద |
| | ౧౦౦ | జెండునొజెంద | జెండునొచెంద |
| | ౧౦౧ | హీనికులుల్ | హీనకులుల్ |
| ౧౯౬ | ౧౦౩ | రొుకడున్నె | రొుకడున్నే |
| | ౧౦౪ | బ్రిజలెల్టం | ఋ్రిజలెల్లం |
| | ౧౦౫ | పటికింప | పూకింప |
| | ౧౦౬ | నవర్ణ | నపర్ణ |
| | ౧౦౭ | తమిద్దగం | తమ్మిదగం |
| | ౧౦౮ | శుకాంగనబ్రియో | శుకాంగనన్ బ్రియో |
| ౧౯౭ | ౧౦౯ | పలింకెం | పలికెం |
| | ,, | కోపమ్మునన్ | కోపమ్మనన్ |
| ౧౯౮ | ౧౧౨ | ప్రవరుఁడయి | ప్రవరుండయు |
| | ౧౧౪ | కోరిక వీరికెత్తఁగా | కోరిక లీఁకెత్తఁగా |
| ౧౯౯ | ౧౨౩ | యసెమూకు | యనెన్ మూకు |
| ౨౦౦ | ౧౩౧ | శ్లోనికు | శ్లోకుని |
| | ౧౩౨ | బరత్రయమ్ము | బురత్రయమ్ము |
| | ౧౩౪ | నీడుపాద | నీయపాంగ |
| ౨౦౧ | ౧౩౫ | వేధనూపుర | వేదనూపుర |
| | | రాకపరిభూత | రాగపరిభూత |
| | ౧౩౬ | నలరెన్ | నలరన్ |
| ౨౦౨ | ౧౪౨ | వేశైన | శేరైన |

ఇటియును బట్టువడు తప్పులను సవరించుకొనఁ బాఠకులకు విన్నపము.

మం. వీ. శర్మ.
8-1-49



# మల్లంపల్లి మల్లికార్జునారాధ్యుల వారిచే రచింపబడిన గ్రంథములు.

1. భోగేశ్వర మాహాత్మ్యము.
2. సత్యవత్యుపాఖ్యానము.
3. చోరేశ్వరము.

# మల్లంపల్లి వీరేశ్వరశర్మ గారిచే రచింపబడిన గ్రంథములు.

1. గురుదక్షిణ.
2. కాంచీ ఖండము.
3. శంకరారాధ్య చరిత్ర.
4. నందన వనము.
5. దుర్గా శతకము.
6. మృత్యుంజయ శతకము.
7. ఉబ్ధకాగ్రేసర శతకము.
8. దుర్గా త్రిశతి.
9. పాంచరాత్రము, [నాటకము.]

# శర్మగారి సోదరులచే రచింప బడినవి.

1. విఘ్నేశ్వర చరిత్ర.
2. హాలాహలపానము.

# విశ్వేశ్వర గ్రంథమాల.

---

| | | |
|---|---|---|
| 1. | బ్రహ్మసూత్రభాష్యము, | జగద్గురు నీలకంఠారాధ్య విరచితము. |
| 2. | శైవ సర్వస్వము, | ముదిగొండ కోటయ్యశాస్త్రి. |
| 3. | శంభు శతకము, | ముదిగొండ నాగలింగశాస్త్రి. |
| 4. | నలవిలాసము, | ,, |
| 5. | నిత్యోత్సవ తంత్రము, | చల్లా గోపాలకృష్ణశాస్త్రి. |
| 6. | శివసందర్శన విధి, | మల్లంపల్లి జ్వాలా వీరభద్రశాస్త్రి. |
| 7. | శైవమతము — అతిప్రాచీనము, | ,, కనకదుర్గా వరప్రసాద్. |
| 8. | గౌరీ కల్యాణము, | ముదిగొండ వీరభద్రారాధ్యులు. |
| 9. | పుత్రప్రదాన లీల, | |
| 10. | కుమార కల్యాణము, | ,, జ్వాలాపతి లింగశాస్త్రి |
| 11. | శివతాండవ లీల, | ,, |
| 12. | శివకవచము, | |
| 13. | జ్ఞాన సుధారసము, | |
| 14. | లింగాష్టోత్తర శతనామాబ్జమాలిక, | |
| 15. | శంకరారాధ్య చరిత్ర, | మల్లంపల్లి వీరేశ్వరశర్మ. |

అడ్రసు:- మ॥ రా॥ ఆకారపు నరసింగం గుప్తగారు,

విశ్వేశ్వర దేవాలయ ధర్మకర్త,

వరంగల్. (N. S. Ry.)